మని నామాంతరము. అభినయమునంగా అవస్థను అనుకరించుట. రూపకము ఉపరూపకము అని రూపకము రెండు విధములు. అందు నాటకము ప్రకరణము భాణము ప్రహసనము డిమము వ్యాయోగము సమవకారము వీథి అంకము ఈహామృగము అని రూపకము పది విధములు. పదిరూపకములలో కు. రా. చ. నాటకమను తెగలోనిది. [కడమరూపకములకును ఉపరూపకములకును దానిదానికి చెప్పఁబడినవిశేషము దప్ప సామాన్యలక్షణ మెల్ల నాటకమునకు ఎట్లో అట్లే ఎఱుంగవలయును.]

నాటకమునకు లక్షణము ఎట్లన:—నాటకమున ఇతివృత్తము ప్రసిద్ధమైనది. అయిదుసంధులు ఉండును. విలాసము బుద్ధిలోనగు గుణములును నానావిభూతులును ఉండును. అది సుఖదుఃఖములచేత సముద్భవించునది, నానారసములచే నిండినది. అందు అంకములు అయిదు మొదలు పదివఱకు నుండును. నాయకుఁడు ప్రఖ్యాతవంశుఁడు రాజర్షి ధీరోదాత్తుఁడు ప్రతాపవంతుఁడు గుణవంతుఁడు దివ్యుఁడేని దివ్యాదివ్యుఁడేనియుఁ గావలయును. శృంగారమేగాని వీరమే గాని ఒకటే అంగి ప్రధానరసముగా నుండును. కడమ రసము లన్నియు అంగములు (అప్రధానములు) గా నుండును. కార్యనిర్వహణమునందు అద్భుతరసము. కార్యమునందు వనితాపురుషులు నలువురేని అయిదుగురేని ముఖ్యులుగా నుండును. దానిని గోపుచ్ఛాగ్ర సమాగ్రముగా నిర్మింపవలయును.

అంకలక్షణము:— అంకమున నాయకచరితము ప్రత్యక్షముగా మాఁడబడును, రసభావములు వెలుంగుచుండును, శబ్దార్థములు అగూఢములుగాను గద్యవాక్యములు చిన్నవిగాను ఉండవలయును, ఏదేనొక యవాంతర ప్రయోజనము సమాప్తి చెందవలయును, బిందువు కొంచెము అంటియుండవలయును, కార్యములు పెక్కుగా నుండఁగూడదు. బీజమునకు సంహారము కూడదు, నానాసంవిధానములు వలయును. పద్యములు మిక్కుటముగా నుండఁగూడదు. ఆవశ్యక కార్యములకు భంగము కలుగఁగూడదు. కథ అనేకదినములు పట్టునదిగా నుండఁగూడదు. నాయకుఁడు ఆసన్నుఁడుగా నుండవలయును. పాత్రములు ముగ్గురు నలుగు రుండవలయును.

ఈవక్ష్యమాణములు అందుం గూడవు.—దూరమునుండి పిలుచుట, చంపుట, యుద్ధము, రాజ్యము దేశము లోనగువానికి ఉపద్రవము, పెండ్లి, భోజనము, శాపము, ఉత్సర్జనము, మరణము, రతము, దంతక్షతములు సేయుట, నఖక్షతములు సేయుట, ఇట్లు లజ్జాకరములగు నితరకృత్యములును, శయనించుట, మోవియానుట, ఇత్యాదులు, నగరాదులను ముట్టడించుట, స్నానమాడుట, మైపూఁతపూసికొనుట,—ఇవి అంకమందు చూపఁగూడదు. అంకము మిక్కిలి దీర్ఘముగా నుండఁగూడదు, దేవీపరిచారాదుల

యును మంత్రులయును వణిజులయును భూసురసోద్భవములైన ప్రత్యక్షచిత్రచరితములతోఁ గూడినదై యుండవలయును; దానియంతటను పాత్రము లందఱును నిష్క్రమింప వలయును.

రంగద్వార ప్రస్తావనాదులు కలదై బీజమును ఫలమునుగలదై ఒక యంకము గర్భములోఁ గల ప్రవేశింపదగినదైన మఱియొక యంకము గర్భాంక (Interlude) మనఁబడును. ఉదా. బాలరామాయణమందలి సీతాస్వయంవరమును, ఉ. రా. చరిత మందలి కుశలవ జననభాగమును, మదీయ ప్రతాపరుద్రీయమందు అష్టమాంకమున ఓడలో మస్తాను మ్రోల నర్తకు లాడించిన భాగమును.

నాటకమునకు ముందుగా పూర్వరంగము, అటుపిమ్మట సభాపూజ, తర్వాత కవిని పేర్కొనుట, నాటకమును గూడ పేర్కొనుట, తర్వాత ప్రస్తావన. అందు నాట్యవస్తువుకంటె ముందుగా రంగవిఘ్నోపశాంత్యర్థము నటులు గావించునట్టిది పూర్వరంగ మనఁబడును. దీని యంగములలో ముఖ్యమైనది నాంది యనునది. ఆశీర్వచనముతోఁ గూడినట్టిది దేవద్విజనృపాదులస్తుతి నాంది యని చెప్పఁబడును, అది మంగళకరములైన శంఖ చంద్ర కమల చక్రవాక కైరవములను వచించునదియు, ఎనిమిదేని, పండ్రెండేని పదములు గలదియుఁ గావలయును. ప్రాయికముగా నాటకములలో నాంది యని తలంపఁబడుచున్నట్టిది పూర్వరంగముయొక్క రంగద్వారనామకమైన యంగముగాని నాంది గాదని కొందఱి మతము.

సూత్రధారుఁడు మధురములును కావ్యార్థసూచకములును అగు శ్లోకములచేత రంగమును ప్రసన్నముం గావించి రూపకనామమును కవినామ గోత్రాదులను కీర్తింపవలయును భారతీవృత్తి నవలంబింపవలయును. ప్రాయికముగా నేదే నొక ఋతువును ప్రస్తావింపవలయును. భారతి యనఁగా సంస్కృతప్రాయమును నరాశ్రయము నగు వాగ్వ్యాపారము.

సూత్రధారుఁడు నటితోనేని విదూషకునితోనేని పారిపార్శ్వకునితోనేని, కూడుకొన్నవాఁడై తనకార్యములనుండి యుత్పన్నములై ప్రస్తుతమును ఆక్షేపించునవైన చిత్రవాక్యములచేత చేయు సల్లాపము ఆముఖ మనియు ప్రస్తావన యనియుఁ జెప్పఁబడును.

ఏ వస్తువు నాయకునికి అనుచితమేని, రసమునకు విరుద్ధమేని, అగునో దానిని వదలవలయును, వేఱువిధముగా నేని కల్పింపవలయును.

అంకములయందు చూపరానిది అయినను అవశ్యము తెలుపవలసినదియగు కథను అర్థోపక్షేపకములచేత చెప్పవలయును. అర్థోపక్షేపకములు అయిదు—విష్కంభక ప్రవేశక చూళికాంకావతారాంకముఖములు.

విష్కంభకము భూతభవిష్యత్కథాంశములను తెలుపును, సంక్షిప్తార్థముగా నుండును, అంకమున కాదిలో చూపఁబడును. అది ఒకరో యిద్దఱో మధ్యపాత్రములచే జరుపఁబడిన యెడల శుద్ధమనఁబడును, నీచమధ్యపాత్రములచే జరుపఁబడినచో సంకీర్ణమగును.

ప్రవేశకము నీచపాత్రములచే నీచవాక్యములచే చేయఁబడును. రెండంకముల నడుమ వచ్చును. మిగత లక్షణము విష్కంభమునకు కెల్లో యట్లే.

చూళిక యనునది పరదాలోనివారు చేయునట్టి యర్థసూచన.

అంకాంతసూచిత పాత్రములు ఆయంకమునకు తెంపు లేనియట్లుగానే పైయంకమును తొడంగుట అంకావతార మనఁబడును.

ఒకయంకములో అన్యయంకముల సూచనయు చేయఁబడునేని దానిని అంకముఖ మందురు

బీజ బిందు పతాకా ప్రకరీ కార్యములు అయిదు అర్థప్రకృతులు.

ఇంచుకగా ఉద్దేశింపఁబడి బహుప్రకారముల వ్యాపించునది ఫలమునకు ప్రథమహేతువు బీజ మనఁబడును.

అవాంతరకథ విచ్ఛేద మొందినప్పుడు దానిని మైకితో సంధానము చేయునట్టిది బిందువు.

వ్యాపి యగు ప్రాసంగికవృత్తము పతాక యనఁబడును

ప్రాసంగికమై ఏకదేశస్థమగు చరితము ప్రకరి.

ఏది సాధింప నపేక్షితమో దేనికొఱకై యారంభమో, దేని సిద్ధిచే సమాప్తియో అది కార్య మనఁబడును.

ఫలార్థులు తొడంగిన కార్యమునకు అయిదు అవస్థలు:— ఆరంభ యత్న ప్రాప్త్యాశా నియతాప్తి ఫలాగమములు.

వరుసగా ఈయైదవస్థలును మున్నుచెప్పిన యర్థప్రకృతులతో యోగమును బొందుటచేత ఇతివృత్తము అయిదు భాగము లగును. అవి క్రమముగా ముఖ ప్రతిముఖ గర్భ విమర్శోపసంహారము లని అయిదు సంధు లగును.

ఉ. రా. చ. యందు 1 అంకమున ముఖసంధి, 2 3 అంకములందు ప్రతిముఖసంధి, 4-5 అంకములందు గర్భసంధి, 6 అంకమున విమర్శసంధి, 7 అంకమున నిర్వహణసంధి ఇత్యాది నాటకలక్షణసమన్వయమును ఈగ్రంథమున వ్యాఖ్యానవశమున తెలుసుకొనఁగలరు.



ఉ. రా. చ. కథ.

శ్రీరాములవారికి పట్టాభిషేక మయినది. ఋశ్యశృంగుడు తొడంగిన ద్వాదశవార్షికసత్రమునకు కౌసల్యాదిరాజమాతలు వసిష్ఠారుంధత్యధిష్ఠితలై చనిరి. అనంతరము సుగ్రీవ విభీషణాదిమిత్రులు వీడుకోలు వడసిరి. అటుపిమ్మట జనకమహారాజుకూడ వీడ్కోలుగైకొని యేగెను. తండ్రిగారు తన్ను విడిచిపోయినందులకు దుర్మనాయమానయైన సీతాదేవిని రాముడు ఓదార్చుచుండెను. ఆసమయాన ఋశ్యశృంగాశ్రమమునుండి అష్టావక్రముని సీతారాములకు గురుజనసందేశముం దెచ్చెను. అందు సీతకు వసిష్ఠులవారు "అమ్మాయీ, నీకన్న భాగ్యవతి యెవ్వరు! వీరప్రసవవగుదువుగాక" అని సందేశించిరి. "అది యట్లే యగును, ఋషులవాక్కు తప్పదు" అని శ్రీరాములవారు వక్కాణించిరి. శ్రీరాములకు వసిష్ఠసందేశము 1 (4); అంకములకు వారియుత్తరము 1 (5). సీతకేమైన వేఁకటికోర్కి కలిగెనేని తప్పక దానిం దీర్పవలసినదనియు శ్రీరాములకు వసిష్ఠసందేశము. అష్టావక్రులు నిర్గమింతురు. అంతట లక్ష్మణుడు వచ్చి సీతాచిత్తవినోదనార్థము తాను వ్రాయించినపూర్వ రామచరిత్రము పటములందు సిద్ధమైనదని తెలుపును. దానిం గనుటకు అందఱును చిత్రశాలకుం బోవుదురు. అచ్చట చిత్రగతవృత్తాంతములం బరికించుచుందురు. అందు జృంభకాస్త్రదర్శనంబున శ్రీరాములవారు ఆయస్త్రములను సీతాప్రసూతికి ప్రసాదింతురు. చిత్తరువుం జూడఁగా సీతాదేవికి వెండియు ప్రసన్నగంభీరములైన వనవీథులయందు విహరింపను భాగీరథీనదియందు పవిత్రశీతలజలంబుల నాడనుం గోరిక పొడమును. గర్భదోహదమును తప్పక తెలివేర్పుమన్న వసిష్ఠసందేశము శిరమున వహించి శ్రీరాములవారు వెంటనే సీత కోరిన యాకోర్కిలి తీర్చువారై కుదుపులేని తేరుం దెమ్మని లక్ష్మణుం బంపిరి. సీత బడలికచే రామబాహువు దలయంపిగా నిద్రించును. ఆసమయాన దుర్ముఖుడను పరిచారకుడు వచ్చి లోకులు సీతాదేవికి పారిశుద్ధ్యమున సడి పెట్టుచున్నారని శ్రీరాములవారిచెవిలో చెప్పును. అంతట శ్రీరాములవారు దుఃఖాబ్ధిమగ్నులై సీతతోఁగూడ నరణ్యమునకు బోవం దామున్ను చేసికొన్న సంకల్పము నుజ్జగించి ఆమెనుమాత్రమే పంపువారై ఎదుట నున్న కూడఁబోవలసివచ్చునని ఆమెను నిద్రితను వీడి గంగాపృథ్వీదేవతలే రక్షింతురని వారిని స్మరించి వేడుకొని యేగుదురు. ఆమెను అడవిలో వదలి రమ్మని లక్ష్మణునికి ఆజ్ఞ పంపుదురు. అతఁడు తేరు దెచ్చి ఆమె నందులో నుంచుకొని పోయి వాల్మీకాశ్రమముచెంత గంగకడ వదలి మరలును.

ప్రదమయినదని వారిని స్తుతించెను. ప్రభువు వానికి దివ్యలోకములకుం బోయి దివ్య భోగము లనుభవించుట కనుజ్ఞ యొసంగెను.

“దండక యంటిరే ఇదేమి దండకారణ్యమా ?” యని శ్రీరాములు శంబూకు నడిగిరి. దండకయే యని యా తండు వచించెను. అంతట శ్రీరాములకు దాని నానా భాగములను ఆనవా లయినవి. శంబూకుండు వారికి నాతిచేత ఖర దూషణ త్రిశిరసులు మడిసిన లావగు జనస్థానమును, అక్కడి కొండవాగులను, ఎఱుకపఱిచెను. రాముల వారు “లేనియు తావులు గుఱులొక్కుచున్న యీ వనములందుం గొని సీతతో కొంపురముండెదను” అని సీత పూర్వము చెప్పిన తప్పొయు నంతారములం జూచి పూర్వపరిచితము లైన యా ప్రశాంత గంభీర మధ్యమారణ్యములను, పల్లెను, విహారములను, ఆనవాలు పట్టుచు వ్యగ్రచిత్తులై యుండిరి. “క్షణములో అగస్త్యమహర్షి దర్శనము చేసికొని వచ్చెదను” అనిచెప్పి శంబూకుడు పోయి, శ్రీరాములరాకను ఋషికిం దెలిపి “తన్ను దర్శించి పోయి యశ్వమేధముం గాంతువుగాక,” యని రాములకు అగస్త్యులవారు పంపిన సందేశమును అందించెను. రాములవారు జటాయు శిఖరమును దానిక్రింద తమ పర్ణశాలయుండిన తావును, తమకు చిర నివాసమయిన పంచవటిని కని, కడు దుఃఖితు లైరి. వారికి శంబూకుడు వారు మున్నెఱింగిన క్రౌంచావతగిరిని ఆ గోదావరిని చూపి వీడుకోలు వడసి తన దివ్యగతికిం బోయెను. రాములవారు అగస్త్య దర్శనము నకుం బోయి వచ్చెద నని పంచవటితో చెప్పుకొని నిర్గమించిరి.

శ్రీరాములవారు అగస్త్య దర్శనము గావించిరి. అంతట అగస్త్యపత్ని లోపాముద్రాదేవి విరహాకృశుని శ్రీరాముని గాంచి, ఆయన తమ కడనుండి తరలుచో సీతా విస్రంభసాక్షు లయిన యీపంచవటీ ప్రదేశములను చూచుటకు పోక మానం డనియు, ఆదర్శనముచే ఆయనకు ప్రమాదము కలుగుననియు వెఱచినదై గోదావరీదేవికి మురళయను నదీదేవతమూఖమున ఆవార్తం దెలిపి, శ్రీరాముండు మూర్ఛిల్లినప్పు డెల్ల కమలకింజల్క పరిమళబంధురము లగు తన యలల చల్లని పిల్లతెమ్మెరలచే తేర్చు చుండు మని హెచ్చరిక పంపినది.

పూర్వము సీత భాగీరథిలోం బడియెంగదా ; అట నామె నీటిలో నిరువురం గుమారులం గవలం గన్నది. వారే కుశలవులు, వారినే భాగీరథి వాల్మీకికి అప్ప గించినది. వారి కిప్పుడు పండ్రెండవయేంటి మంగళంపుపుట్టినదినము రాంగా, అందుకై ఆదేవి తానును లోపాముద్రగొన్న వెఱపునే వహించి సీతను తమరాజర్షి వంశమూలకుండైన భగవంతుని సూర్యుని శ్రేయఃప్రదుని స్వహస్తాపచిత కుసుమములతో పూజింప బంపినదని యుపదేశించి, విదో గృహాచారవ్యాజమున రామరక్షార్థము

ఇటకు గోదావరికిం బంపెను? గోదావరినుండి వెలువడు ననంతరము సీతకుం దోడుగా నుండ తమస యను నదీదేవతను నియమించెను. తన ప్రభావముచేత వనదేవతల కంటికి సైతము, మఱి మనుష్యులకును చెప్పవలయునా సీతను అగపడకుండఁజేసి ఆ మాట ఆ యిరువురకుం దెలిపినది. సీత గోదావరినుండి లేచివచ్చి పూవులు గోయుచుండును.

శ్రీరాముఁడు అగస్త్యాశ్రమమునుండి వచ్చి పుష్పకము దిగి అచటి యా మా పరిచిత ప్రదేశములం గని శోకాభిభూతుఁడై మూర్ఛిల్లెను. దానిం గని సీత కడగడ వడఁకుచు తమసాప్రేరణచే సమీపించి శ్రీరాముల నుదురును నొసటనుం దాఁకెను. రాముఁడు తెప్పిఱిలి అస్పర్శ సీతచేతిది యని గ్రహించి సీతను నలుగడలను వెదకెను. భాగీరథీ ప్రభావమునం జేసి సీత అయనకుఁ గానిపింపదాయెను. అంతలో "సీత పెంచిన గున్నయేనుఁగును పదూవ్వితీయమును ఒక మదపుటేనుఁగు ఆ పిడిబెదుఁగులకై పైకొన్నది. ఎవరేని ఆయేనుఁగుఁ గాదమను కావరా!" అని వనదేవత బిగ్గరగా పలికెను. శ్రీరాముఁడు ఆ పట్టగజమును దండించుటకై లేచెను. అంతలో ఆతూయి యడినవనదేవత వాసంతి వచ్చి యాతనిని ఆనవాలుపట్టెను. రాముఁడును ఆమెను కనుంగొని ఆమెమాటవిడి ఏనుఁగుల పోరాటపు స్థలమునకుం జనెను. ఇంతలో నాతని పుత్త్రుఁడైన యేనుఁగుఁగొదమ ఆమత్తేభమును మోఁది తఱిమివైచి తన ప్రియులను అనువర్తన సేయుచుండును. అందులకు సీతారాములు సంతసిల్లుదురు. ఆకొదమం గని సీత తన కుమారులు ఎట్లున్నారో అని తలఁచుకొనును. అంత నట ఆమె మున్ను పెంచిన నెమలియుం, గున్నకడపయు, కనఁబడును. రాముఁడు సీత పెంచిన తరులను పక్షులను లేళ్లను కనుచు శోకాతివేగముచే నేడ్వం దొడంగెను. "ఆయడవిలో సీత ఏమయిన దయ్యా!" అని వాసంతి యడుగఁగా రాముఁడు ఘాతుకమృగభక్షిత యైనదని చెప్పి, మఱి మఱి యేడిచి మూర్ఛిల్లెను. సీత పెండియుం బోయి తాఁకెను. రాముఁడు లేచి ఆమె చేయిపట్టుకొని సీత దొరకిన దని వాసంతితో పలుకును. వాసంతి అతనికి ఉన్మాదావస్థ కలిగిన దని తలంచి యుండ, రాముఁడు సీతా కరస్పర్శచేత మోహితేంద్రియుఁడై తన చేతిపట్టు నిలుపుకోలేక రవంత నీవుపట్టుకొని యుండుమని సీతాకరమును వాసంతికరమున నిడంబోవును. ఆసందులో కరము లాగికొని సీత అపసరిల్లును. అప్పటికి రాముఁడు వాస్తవముగా తాను ఉన్మత్తుఁడే అని నమ్మెను. రాముఁడు తాను పోవలయు ననియుం, ఇంగారు సీతాప్రతిమను సహధర్మచారిణిగా నుంచుకొని అశ్వమేధము చేయుచున్నట్టును వాసంతితోఁ బలికి వీడుకోలు వడయును. తన ప్రతికృతి చేయునందులకు సీత కరము సంతసిల్లును. రాముఁడు అయోధ్యకు తరలును. సీత సతమున సూర్యుని పూజింపఁబోవును.

తల్లిదండ్రుల నెఱుంగఁ జేసియు, అతనికి కుశుఁ డని తమ్మునకు లవుఁ డనియు, ఆమున్న వాల్మీక్యాజ్ఞచేత ప్రణీతమయిన శ్రీమద్రామాయణములోని యతిసుభగములు రూపకరూపమున నిబద్ధములను పద్యములచే ఆనందమునకై భరతమునికి నిచ్చుటకు భరతాశ్రమమునకుం బోయియున్నాఁ డనియు, ఆరామాయణమును సీతాపరిత్యాగము వఱకు తామును గఱచియున్నా రనియుం జెప్పియును. ఇట్లు వీరు భాషించుచుండఁగా కుశుఁడు భరతాశ్రమమునుండి ప్రతినివృత్తుఁడై కటువుగలన లవచంద్రకేతు యుద్ధ వార్త విని అతికోపముతో చంద్రకేతువుమీఁదికి వచ్చుచుండెను. శ్రీరాముని గనఁగానే అతని హృదయమున గురుభక్తియు నిదాక్షాకరత్వవాంఛయుం బొడమెను గాని వైర మన్నమాట లేదాయెను. అతఁడును రామమూర్తిని లవునివలనఁ దెలిసికొని వినీతుఁడై దరిసి ప్రణమిల్లెను. రామమూర్తి సీతపోలిక అతనియందును గని అతనిని ఒడిలోఁ గూర్చుండఁబెట్టుకొని రామాయణ శ్లోకములు చదివించి విని అవి తమ (సీతారాముల) యనురాగాతిశయమును దెల్పువాక్యములగుటచే అస్మరణాలన శోకమున మునిఁగి బాష్పపూరితవదనుఁ డైనంత, వచటికే ఋషితపోయ్యంపువార్త విని దిగులున అరుంధతీ వసిష్ఠ జనకాదు లందఱును వచ్చిరి. రాముఁడు వారిని గలసి సంభాషించును.

అనంతరము వాల్మీక్యాజ్ఞచేత సకల స్థావరజంగమ భూతగ్రామము ప్రోల శ్రీరామాదుల సన్నిధిని పూర్వోక్తరూపకము అభినయించును. అది కుశలవుల జననము చూపును. సీతను భూదేవి కాపాడుచుండుటను ఇత్యాదికములు తెలుపును. ఇచట రామాదులు చూచిన కుశలవులే ఈసీతకుమారులు. అంతలో అరుంధతీవాక్యములచే సీతా ప్రభావము నెఱింగినవారై త్రిలోకవాసులును సీతను నమస్కరింతురు. అరుంధతి ఆమెను కైకొమ్మని శ్రీరామునికి అనతిచ్చును. శ్రీరాముఁడు కైకొనును. సీత శోకము తీఱి రామునిం గలయును. వాల్మీకి కుశలవులను తెచ్చి తల్లిదండ్రుల కప్పగించును. వారును కౌసల్యాజనకాదులును అసమయానకు మధురనుండి వచ్చిన లవణాంతకుఁడు శత్రుఘ్నుఁడును, శాంతా ఋశ్యశృంగులును అందఱు కలసి కొందురు.

విపర్యాసములు :

ఈకథలో భవభూతి కొన్ని విపర్యాసములు గావించినాఁడు. ఎట్లన.—

మూలములో శత్రుఘ్నుఁడు సీతావివాహసమయముఁ గొలఁది కాలమునకు లవణహననార్థము తరలినాఁడు. దారిలో ఈయన వాల్మీకీయ తపోవనంబున బసచేసిననాఁడే కుశలవులు జన్మించిరి. ఆయన లవణుని సంహరించి మథురాపురిని విస్తీర్ణము గావించి పండ్రెండు ఏండ్లు ఏలి అందు శత్రుఘాతిని, విదిశయందు సుబాహువును, తన తనయులను నిలిపి తాను అన్నను చూడ నయోధ్యకుం బోయి, అన్నసే సేవించుచుండెను. పిమ్మట కొన్ని

మూకములకు బ్రాహ్మణశిశు మృతి, తన్నివారణార్థము రామకృత శంబూకహననము, అనంతరము అగస్త్యదర్శనము, మునుల అనుమోదముం జేసినతర్వాత అశ్వమేధమున కుత్సహించి లక్ష్మణరక్షితమగు గుఱ్ఱమును విడుచుట. సంవత్సరము ముగియునప్పటికి లక్ష్మణుఁడు గుఱ్ఱముతో పృథివి చుట్టి రాఁగా, ఎల్లరాజులును కప్పంబులు తెచ్చి యజ్ఞోత్సవముం జేరుదురు. యాగము జరుగుచుండును. కుశలవులు వాల్మీకియానతిని రాముని కథ రామాయణమును పాడుదురు. ఆసందర్భమున రాముఁడు ఈశిశువులను తన పుత్త్రులనుగా శంకించి శుద్ధ్యర్థమై సీతను వాల్మీకాశ్రమమునుండి రప్పించును. సీత వచ్చును. సీత నిష్కల్మష యని వాల్మీకి సభాసదులతోను రామునితోను వాక్రుచ్చును. సీత,

శా. "రామస్వామిపదాంబుజంబు లెద నారాధింతు నేనిన్ సదా
రామాజ్ఞన్ జరియింతు నేని దశజాగ్రత్స్వప్నసుప్త్యాదులం
రాముం దప్పనిదాన నౌఁటయు యథార్థంబేని నాతల్లి యో
భూమీ యీ మొదఁ ద్రోవఁ జూపి ననుఁ గొంపోవమ్మ నీలోనికిన్." ఉ. రా.

అని పలికి భూమిలోనికి అడంగును.

"ఏవ ముక్తే తయా సాధ్వ్యా రన్ధ్రాత్ సద్యోభవా ద్భువః
శాతహ్రద మివ జ్యోతిః ప్రభామణ్డల ముద్యయౌ.
తత్ర నాగఫణోత్క్షిప్తసింహాసననిషేదుషీ
సముద్రరశనా సాక్షాత్ ప్రాదురాసీ ద్వసుంధరా.
సా సీతా మఙ్క మారోప్య భర్తృప్రణిహితేక్షణామ్
మా మేతి వ్యాహరత్యేవ తస్మిన్ పాతాళ మభ్యగాత్." రఘు. 15.

శ్రీరాముఁడు నిజపుత్త్రులను కుశలవులను గ్రహించి అశ్వమేధంబును సమాప్తి నొందించును.

ఇది వాల్మీకివిరచితోత్తరకాండ కథాఫక్కిక. ఇందు కుశలవులు గుఱ్ఱముం బట్టుటయు, వారితో పోరును, లేవు. జైమినిభారతకథ ఇంతకన్నను ఉ. రా. చ. కథం బోలి యున్నది అందు అశ్వమేధయాగకథ యిట్లున్నది:—

యజ్ఞాశ్వముతో శత్రుఘ్నుం బంపుదురు అది వాల్మీకాశ్రమమునకుఁ జనును. లవుఁడు దానిని కట్టివైచును. శత్రుఘ్నుఁడు లవు నోర్చి తురగమును విడిపించుకొని మూర్ఛితుఁడగు లవునిం దనయరదముపై నిడుకొని తురగము వెంబడిం జనును. ఈవృత్తాంతము విని కుశుఁడు తెలిసికొనివచ్చి, శత్రుఘ్నుం దాఁకును. శత్రుఘ్నుఁడు పడును.

లవుఁడు దన్నుం గలియును. పిమ్మట శ్రీరాముఁడు లక్ష్మణుని బంపుదురు. అతఁడును కుశు నిచేఁ గూలును. అంత రాముఁడు కోపించి భరతుం బంపును. అతఁడునుం గుశుచేత పడును. అనంతరము శ్రీరాములు స్వయముగా వచ్చి బాలురతో పోరి మూర్ఛితు లగుదురు. వాల్మీకి వరుణలోకమునకుం బోయియున్నవాఁడు. ఈసంగతంతయు జరిగినపిదప ఆయన వచ్చి వృత్తము విని శ్రీరాముఁడుకడకుం జని మూర్ఛితుల నెల్లఁ దేర్చును. రాములవారికి కుశలవులను తత్పుత్రులని చెప్పి సీతతో గూడ అప్పగించును. వారిం దోడ్కొని రాముఁడు తానును సోదరులును అయోధ్యకుఁ బోవును. అచట రాముఁడు సుతభార్యాయుతుఁడై యజ్ఞము ముగించి సుఖియుండును.

భవభూతి ఈ జైమినిభారతీయకథ ననుసరించి యుత్తరోవలంబించియు ఔచిత్యపోషణకై పెద్దలకు తమచేనుఁగులచే అపజయముం బెట్టక, వారి బాలునే ఇంకొకని చంద్రకేతువును తెచ్చి ఈయిరువురను ఉన్నవానికే ఉద్దిగా పెట్టినాఁడు. అతనికేలియుం అపజయము వలుకు రానీయక భావి సంఘటనార్థము రాములవారి నే యుద్ధము మాన్ప రప్పించినాఁడు. అరాక వారికి కావ్యమార్గమున నదే సంధివించినదిగా నుండునట్లుగా ఉత్తరకాండలోని కథ ననుసరించినాఁడు. అదియెట్లన:—విప్రబాలక మృతి, తత్సంజీవనార్థము శంబూకవధ, యగస్త్యులవారికి దర్శించుట, వారికడ నుండి అయోధ్యకు మరలఁబోవుచు మార్గవశాన పూర్వాశ్రమ పరిశీలనార్థమును వాల్మీకాశ్రమ సమీపగమనము, అని యివ్విధమున సంవిధానము విరచితము.

ఈసందర్భమున నే కొన్ని లఘువిషయములను హెచ్చరించెద. ఈనాటక మందు సకల వృత్తములును ప్రత్యక్ష పూర్వములుగాక, ఎవరును ముందుగా కన్నిని వినిగాక. వాయకాది లోకయాత్రానుసంగికములు నే సమాప్తములుగా మహాకవి చేత గ్రువ్వఁబడినవి. అంతటను అయా మహాసీయుల యౌన్నత్యమునకు విలోపము రాకుండునట్లు ఔచిత్యము కావఁబడినది. మహారాజ భార్యయుఁ గలిగిన నిందను కవి ఆమెచెవిని బడిన ఆదుఃఖము వివాహనసమయమున అనిర్వచనీయ మగునని ఆమెకుఁ దెలియ నీయలేదు. కవి దాని ప్రస్తావము ఎక్కడ వలసినను చెవిలో చెప్పించి నాఁడు, స్పష్టముగా చెప్పవలసిన సమయములలో అపవాద మని మాత్రము పలికించి నాఁడేగాని కంఠోక్తముగా తత్స్వరూపమును ఉచ్చరింపలేదు. ఈతీరున ఆదివ్యా దివ్యుల మహిమం గాచిన నేర్పు కరము హృదయంగమమై ఈనాటకమునకెల్ల నుత్త మాలంకారమై యున్నది. అపవాదకథను జైమిని భారతములోఁ గనుఁడు;—

చ. "రజకి యొకర్తు నాథుఁడు తిరస్కృతి సేసినఁ బుట్టినింటి కేఁ
గ జనకుఁ డాత్మజం గని జగజ్జనగాత్రమలీమసాంశుక

యందు ప్రదర్శితమగును. నాటకము హృద్యము గాక పీడాకరమగును. గర్భాంకాంతమున "ఏమి వైదేహికి ఇలయుమే సమకూడినది! హా దేవి!" అని రాముడు మూర్ఛిల్లుటయు, లక్ష్మణుడు "భగవంతుడా, వాల్మీకీ, కావ్యము కావుము! ఇదియా నీ వాక్యార్థము!" అని యాక్రోశించుటయుం గనుడు. లఘుహృదయులు ఇట్లు బెదరుదు రనియు భవభూతి తాదృశ జన పరితోషార్థము ఈ పునర్ఘటనమును కల్పించినాడనియు ఉక్త విమర్శకుల వచనము. కాని అతని పూర్వమే జైమిని మునియే కథను మంగళాంతముగా మార్చినాడు. భవభూతి తదనుసారముగా రచించినవాడు గాని పట్టి స్వతంత్రముగా కథను మార్చినవాడు గాడు. ఈవిషయము వక్ష్యమాణమున ఇంకను దృఢీకృతమగును.

భాగీరథ్యాదులు శ్రీరామునికడకుం బంచవటికి సీతాదేవిం బంపుట రామ రక్షార్థంబును, రాముని తీవ్రానురక్తిని ప్రత్యక్షముసేయుటచేత సీతను తత్పునస్సంగోత్సుకం గావించుటకును. శంబూకవధాదివృత్తములను ఒకటినుండి యొకటి యుత్పన్నమైనట్లు కల్పించుట - అయోధ్యనుండి పెక్కుపయనములు తప్పించుటకు. పుట్టబోవు సీతాప్రసూతికి చిత్రదర్శనమున జృంభకాస్త్రముల నిచ్చుట - ఆతార్కాణమున వారిని రాముడు తన తనయులనుగా ననుమానించుటకు. పునస్సంఘటన సమయమునకు శత్రుఘ్నుడును వచ్చినట్లు వర్ణితము. ఆతడు లవణునిగూల్చుటకు ప్రథమాంకమునం దరలినవాడు. వానిం గొట్టిరా నింతకాలము (పండ్రెండు ఏండ్లు) పట్టెనా యని కొందరాక్షేపించిరి. ఆతడు లవణుం గూల్చి, మధురను మరలం గట్టి, అందు పండ్రెండేండ్లు ఏలి, తనపుత్రుల నిరువుర నచట రెండు రాజధానులందు దొరలం గావించి, అనంతరము తాను శ్రీరామపాదసేవార్థము వచ్చినట్లు ఉత్తరకాండ కథ. ఈతీరున ఇందు కవికృతసంవిధానములకు నిమిత్తములం గనునది.

కవి ఈ నాటకమునందు సీతారామ పునస్సంగమము ఆదినుండియుం బన్ను చుచే గ్రంథము నల్లినాడు. ప్రస్తావనలోనే కవి "ఎల్లవిధములను ఋషులను దేవతలను మేలుసేయుడు" యనునటవాక్యముచే వాల్మీక్యాది ఋషులను గంగాభూధాత్ర్యాదిదేవతలను సీతాశుద్ధిని స్థాపించి సీతారాములను మరలం గూర్తు రని భావ్యర్థమును సూచించినాడు. రెండవది "అమ్మాయీ... పుత్రపూర్ణ మైనయొడితోడి నిన్ను ఆయమ్మతిని చూడగలము" అని సీతకు ఋష్యశృంగులవారు పంపిన సందేశమందు అభిప్రాయములు వెల్లుగా నున్నవి. అప్పుడే ఆయన తోడంగినది ద్వాదశవార్షికమగు సత్త్రము. అనంతరమేగదా ఆయన ఆమెను చూడగలుగును. కావున ఆ పండ్రెండు ఏండ్లును ఆమె సురక్షితగా నుండు నని యేర్పడుచున్నది. అందువలన

శ్రీరాముని ప్రత్యాశ మరూఢమైయున్నది. సుఖితం గాంచెద మని మునిహృదయ మగుఁ గాని దుఃఖితం గాంచెద మని యుండదు. కావున ఆయన వాక్కుచే పున స్సంగమే సూచిత మైనది. అట్లే పునస్సంగ సమయమున బుద్ధిశాలిండగుఁడు తన మాఁటతప్పక పుత్త్రపూర్ణోత్సంగనే ఆమెను దర్శించినాఁడు. ఈ పునర్ఘటనము వాక్యములందు మిక్కుటముగా సూచిత మయినది చిత్ర్పదర్శనార్థము కతిపయములనే ఉదాహరించెద. తృతీయాంకము కడపట—

"అవని యమరనదియు నస్మద్విధులఁ గూడఁ,
దోలుతఁ గవిత గన్న కులపతియును,
అలవసిష్ఠుఁ డరుంధతీ సంధు,
నిత్యమంగళములఁ నిత్తు సిరు."

అని తమసా వాసంతులు సీతారాములకు నిత్యమంగళమును ప పృథ్వీ భాగీరథీ వాల్మీకి వసిష్ఠారుంధతులు నింపుదురు గాక యని యాశీర్వదించిరో ఆపృథివ్యాదులే సప్తమాంకమున సీతారామసంయోజనమందు సోద్యములై దానిని సాధించిరి. ఇందు వలన అభావివృత్తమును ఇప్పటికే అడిగుండియే భవభూతి పన్నుకొని తదనుగుణ ముగా అంశములను అల్లుకొనుచుండుట స్పష్టము గాదా! తృతీయాంకమునకు ముందు విష్కంభములో—

"ఇట్టివారు విపాకంబు నెఱయ, నదియుఁ
బరమ విస్మయకారిగాఁ బరిణమించు;
అందు సాహాయ్యకము సేఁత నట్టివారు
పూనుదురు తమఁదామ యపూర్వగతుల"

అను వచనముచేతను కవి పూర్వోక్తార్థమునే సూచించినాఁడు. అట్టివా రనఁగా పృథ్వీభాగీరథు లని దీని ముందు వెనుక వాక్యములందు స్పష్టము.

శ్రీరాములవారు దుర్ముఖునిచే లక్ష్మణునికిం బంపినయాజ్ఞ సీతను వాల్మీకా శ్రమము చెంతవిడువుమని చూ. "అప్పుడు వాల్మీకితపోవనసమీపమున" ఇత్యాది,29పు. ఆమె వాల్మీకాశ్రమము చేరమియు భాగీరథిలో పడుటయుం తృతీయాంకముకొఱకును, సీతారామసంయోజనమందు ఆమె చక్కఁగా వ్యాపృత యగుటకొఱకును. సీత వాల్మీకాశ్రమము చేరినచో ఇందలితృతీయాంకవృత్తము - అనఁగా రాములవారు వాల్మీకాశ్రమమునకు రాకముందే వారిని ఆమె చూచుట - ఘటింపదు. ఈమార్పు భాగీరథీరూపముగా సీతాహృదయమునుండి పరిత్యాగశల్యోద్ధరణము సేయించుకొఱకు. అది పునస్సంయోజనాపేక్షచేత. ఆశ్వస్త గాదేని పునస్సంయోజనము నొల్లదు. అట్లే

ఉత్తరకాండకథలో పునస్సంయోజనము నొల్లక యడఁగిపడె. అట్లు గానియెడ మంగళపర్యవసానమునకై భాగీరథీప్రయత్నము భాగీరథిని చిత్రదర్శనమున రామునిచే "ఆ తల్లీ నీవు కోడలు సీతయందు అరుంధతియందువలె శివముగ అనుధ్యానింతువు గాక" అని వేడించుటచేత ఆయనను కవి పునస్సంయోజనార్థము అప్పుడే ఆదిలోనే నిబంధించినాఁడు. పుత్త్రపూర్వోత్సంగముగాఁ దెచ్చి రామునితోఁ గూర్చుటకన్న శివ మే మున్నది? తనశ్రేయస్సుం దలంపు మని రాముఁడు ఆమెను వేఁడలేదు. తృతీయాంకమున మాటిమాటికిని రాముని భ్రమావస్థలనుండి సీతమూలముగా తప్పించుటయు సీతాశ్రేయముకొఱకే. అట్లే గాప్పఘన్నాలు ప్రథమాంకములో రాముఁడు వేఁడినమాటబడి సీతారాములకు మేలు గావించి వారిని సమకూర్చుచు సప్తమాంకము తుదిని ఆయనమాటను ఆయనకు అప్పగించి తమకృతార్థతం దెలుపుకొనిరి. అరుంధతీవసిష్ఠాదులు కోడలు లేనియయోధ్యకు తాము పోమని ప్రతినచేసి వాల్మీకాశ్రమమున నిలుచుట - సీత జగదేకపావని యని లోకమునకు తెలుపుటకును, ఆమూలముగా పునస్సంయోజనము సాధించి సీతారాములకు దుఃఖాపనోదనము గావించుటకును, అగునేగాని, ముందు కానకు పంపింపవలసిన దని తామే వ్యాజముగా చోదనచేసి పంపినందులకై పిమ్మట తామే అసమ్మతిం దెలిపి దుఃఖార్ణవమగ్నునికి శ్రీరామునికి మెడం బాషాణము గట్టుటకుఁ గానేరదు. చతుర్థాంకమున లవునిఁ గూర్చి ప్రశ్నించిన జనకునికి అరుంధతి ఉత్తర మెఱింగియు చెప్పకుండుటయు, "సమయమున తెలిం గెదరు లే" అని పలుకుటయు, లోలోపల జరుగుచున్న పునస్సంయోజన ప్రయత్నమునే సూచించుచున్నది చతుర్థాంకములోని యీయుద్ధారము గనుఁడు:— 54 పు. "కౌస.—సామూనా, జానకి!..... వీరినుడులు 16." నాటకము పునస్సంయోజనప్రవణ మనుటకు ఇంతకన్నను ప్రమాణము ఉండునా? పుత్త్రపూర్వోత్సంగ సీతాసమాపత్తి రామునికి కాఁగల దను నీరహస్యమును వసిష్ఠులవారు ఋశ్యశృంగాశ్రమములోనే ఆదిలోనే కౌసల్యతో చెప్పిరా రని యీ గ్రంథార్థము.—ఇట్లీనాటకము సీతారామ పునస్సంగమార్థమే వ్రాయఁబడిన దనుట స్పష్టము.

ఈయుత్తరనాటకము శ్రవ్యప్రబంధముగా రచించును గాని దృశ్యముగా రంజింప దని పాశ్చాత్య సంస్కృత పండితులును నూతనమతప్రియులగు నవ్యదీయులే కతిపయులును పలికిరి. కాని, ఇది దృశ్యముగా నత్యంతరంజకమగు నని అభిప్రాయము నాకెలంపుగా నుండెను. మదరాసు క్రిస్టియన్ కాలేజిలో ప్రధానసంస్కృతోపాధ్యాయుండ నైనంతట, బి. ఏ. పరీక్షకు ఉ. రా. చ. పఠనీయము కాఁగా, నా శిష్యులకుం బై మతభేదమును నామతమును తెలిపి, తదీయస్థాపనార్థము వారిచేత ఈనాటకమును మదరాసు సౌధములో ఆడించి, ఇది రంగమునను అత్యంతరంజకం

బనియూ, లతాగుల్మంబుల మరియును, క్రిక్కిరిసిన వేగురు రసికవిద్వజ్జనులకు ప్రత్యక్షము గావించినాఁడను. ఆప్రయోగము జరిగి ఇప్పటికి 34 సంవత్సరము లయినను, ఆ కంఠాకదివ్యపురుషుని రామస్తుత్యాది పద్యములు ఇప్పటికిని నావీనులలో అనురణనము గావించుచునే యున్నవి. సీతాదిసకలపాత్రములును వారివారిచర్యలును కన్నులయెదుట ఇప్పటికిని మెలఁగుచున్నవి. అనంతరము ఎన్ని నాటకములు చూచినను ఈ విధముగా డెందమును బందిగొన్నట్టిది మఱిలేదు.

ఈ నాటకమున ప్రథమాంకములో శ్రీరాముఁడు తనకంఠమున సీతబాహువును ఉంచుకొనెను. శ్రీరాముని యురమున సీత శయనించును ఇట్టిది పరిమత్తప్రేమల వ్రీడాకరము గాదా? అట్టి యవస్థలో నున్న శ్రీరామునితో దుర్ముఖుఁడు సంభాషించుట తగునా! ఇచట పాత్రముల వాక్యములను మాత్రము యథోక్తముగాఁ బలికి క్రియను ఇంచుక సంక్షేపించి ఇంపు గూర్చుకొనవచ్చును.

“చరణాగ్రాభ్యక్షేపము” 8(17), “ఒకొక్కకకేల” 9(20) - ఇట్టి పూర్వ రహోవృత్తములను రాముఁడు సీతతో లక్ష్మణుని యెదుట నిర్లజ్జముగా ఎట్లు వచించును? ఇట్టి సమయములందు లక్ష్మణపాత్రము ఈపాత్రముల వాక్యములను వినక అవలికి జరిగి, వీరికి చూపుటకై చిత్రవీథియందలి పైపైవినోదములను ఆరయుచుండుట నభినయింప వలయును.

అంతర్నాటికాదర్శనమునకు హనుమత్సుగ్రీవ జాంబవద్విభీషణులను రావింప లేదా యేమి? లేదు. ఏలన, వారికి వహ్నియందు సీతాశుద్ధి ప్రత్యక్షీకృత పూర్వమే

సప్తమాంకమున శ్రీరాముఁడు లక్ష్మణునితో కుశలవులకు చంద్రకేతు సమముగా స్థానమర్యాదల నొసంగు మని యాజ్ఞయీయ 84, లక్ష్మణుఁడు అట్లే కావించితి నని ఉత్తరము చెప్పును. రామువాక్యమందు ‘ఈబాలుర నిరువురను’ అను పదముల లోని యేతచ్ఛబ్దముచేతను, లక్ష్మణోత్తరములోని భూతప్రయోగముచేతను ఆబాలు రచట వచ్చి కూర్చుండియున్నా రని తోఁచును. అట్లుండ, వారు పిమ్మట వాల్మీకితో ప్రవేశింతురు. వారు సమాజమునుండి ఎప్పుడు లేచిపోయిరి? పాత్రనిర్గమము అనూచితముగా జరుగఁగూడదుగదా. ఇది యెట్లు సంగతపడును? అని ప్రశ్న. వాస్తవముగా వారు సమాజములో వచ్చికూర్చుండియే యున్నయెడల వారిని రాములవారు చూడనే చూతురు, కావున లక్ష్మణునితో ఆయానతిం బలుకవలసిన పనియే యుండదు. పలికిరి గావున అప్పటికి ఆబాలురు వచ్చి కూర్చుండలేదు. పిమ్మటను సభాభవనములోనికి రాలేదు. వాల్మీకి తేరఁగా తండ్రిం జేరవచ్చిరి. లక్ష్మణవాక్యమునకు “వారికి చంద్రకేతునితో సమానమగు స్థాన మేర్పతిచియున్నాను” అని యర్థమే గాని

"వచ్చి కూర్చున్నారు" అని యర్థముగాదు. ఇందుచేత శ్రీరాములవారు ఆబాలురు తమపుత్త్రు లనియెడు భ్రమను వదలుకొనుట సుచిత్రము.

ఈనాటకమున హాస్యరసము లేదని పరాణపండితులవచనము. లేమి వాస్తవమే, ఇందులోనే గాదు, ఈయన నాటకములు మూడింటను అది మృగ్యమే. ఇందు సౌధాతకి మాటలలో కొంచె మున్నది. మూటను వదకినచో మందునకు నించుక యగపడును. ఇందలి స్త్రీపురుషులు అత్యుదాత్త ప్రకృతు లగుటంబట్టి హాస్యప్రసక్తి లేదాయె నని చెప్పవలయుగాక, మాలతింగూర్చి యేమి చెప్పఁగలము ?

ఈనాటకములో పంచమాంకమునందు లవుఁడు చంద్రకేతునికడ శ్రీరామప్రభావాధిక్షేపము సేయుచో 70(35) "మూఁదడుగుల్ ఖరాజి నవి మూఁడడుగులో భయముల్ నెలఁగవే" అని సడివెట్టుచున్నాఁడు. ఈమూఁడు వెనుకంజల వృత్తము వీరచరితలో వర్ణితము గాదు. పైగా "ఇంద్రజానేయు నేసుపుచు" అని యధిక్షేపించినాఁడు. ఈమాట రాముఁడు వాలిని ఎదుర్కొవి కొట్టనేరక చెట్టు చాటునుండి కొట్టుటను తెలుపుచున్నది. వీరచరితమందు వాలి రాముని మడియింప నుద్యుక్తుఁడై అతనిమీఁదికి పోర వచ్చి యతనిచే మడిసె నని యున్నది. ఇట రెండు నాటకములు పరస్పర విరుద్ధముగా నున్నవి. లవుఁడు రామాయణకథ ననుసరించి పల్కెనేగాని, భవభూతివీరచరితముం బట్టి పలుకలేదు. ఐనను మహాకవి తనతొలిపల్కు తాను అడంచి యిట నొండువగం బలుకుట చిత్రము.

మఱియొకటి—ఇందు "నడిమియమ్మవృత్తాంతమును అన్నయ్య అణఁచివైచినాఁడు." అని చిత్రప్రదర్శనములో లక్ష్మణవాక్యము. వీరచరిత్రలో శూర్పణఖ మంథరావేషమున వచ్చి రామప్రవాసమును కైకేయీప్రార్థితముగా సాధించె నని యున్నది. ఇట లక్ష్మణవాక్యమున తద్విరుద్ధ మైన రామాయణోక్త వృత్తాంతమే పరామృష్టమై యున్నది. ఇటనుంగవి తనపూర్వరచనను తాను పాటింపలేదు.

క్షేమేంద్రుఁడు చేసిన యుత్తరరామ చరిత్రగత కతిపయవిమ యౌచిత్యచర్చ.

(1) ప్రబంధౌచిత్యముక్రింద—యథావా భవభూతేః—

(నేపథ్యే) యో౽యమశ్వః పతాకేయ మథవా వీరఘోషణా

సప్తలోకైకవీరస్య దశకణ్ఠకులద్విషః.

లవః—(సగర్వ మివ) అహో సంతాపకా న్యక్షరాణి! భోభోః కిమక్షత్త్రియా పృథివీ యదేవ ముద్ఘుష్యతే! (విహస్య) అః కిం నామ స్ఫురన్తి శస్త్రాణి! (ధనురారోపయన్)

జ్యాజిహ్వయా వలయితోత్కటకోటిదంష్ట్ర
ముద్గారి ఘోరఘనఘర్ఘరఘోష మేతత్
గ్రాసప్రసక్తహసదన్తకవక్త్రయన్త్ర
జృంభావిడమ్బి వికటోదర మస్తు చాపమ్.

ఇందుల తెనుఁగు మదీయము—పు. 60-61 (నేపథ్యమున) అశ్వమిదె...(25)

లవ.—[illegible] అహో! రగిలించుచున్నవి యక్షరములు! ఓహోయి, క్షత్ర ఘోషించెదరే!" పృథివిలో క్షత్త్రియులు లేరనుకొన్నారా యేమి? [నవ్వి] ఏమి! శస్త్రములను జళిపింతురా! [విల్లెక్కువెట్టుచు] జ్యారసన... (27)—ఇందుపై విమర్శ—

అత్ర హి రామాయణకథాతిక్రమేణ జాత నోత్ప్రేక్షితా రామతనయస్య సహజ విక్రమానుసారిణీ కావ్యోత్కర్షభూమిః పరప్రతాపస్పర్శాసహిష్ణుతా ప్రబన్ధస్య రసబన్ధురా మౌచిత్యచ్ఛాయాం ప్రయచ్ఛతి.

(2) వీరరసౌచిత్యము క్రింద—న తు యథా భవభూతేః—

వృద్ధాస్తే న విచారణీయచరితాస్తిష్ఠన్తు హుం వర్తతే
సున్దస్త్రీదమనేఽప్యఖణ్డయశసో లోకే మహాన్తో హి తే
యాని త్రీణ్యకుతోభయాన్యపి పదాన్యాసన్ ఖరాయోధనే
యద్వా కౌశల మిన్ద్రసూనుదమనే తత్రాప్యభిజ్ఞో జనః

ఇందుల తెనుఁగు మదీయము.—'ఉండుడు'...70 (85). ఇందు పై విమర్శ.

అత్ర ప్రధానస్య రామసూనోః కుమారలవస్య పరప్రతాపోత్కర్షాసహిష్ణోర్వీరరసోద్దీపనాయ సకలప్రబన్ధ జీవితసర్వస్వ భూతస్య ప్రధాననాయక గతస్య వీరరసస్య తాటకాదమన ఖరదూషణాపహర ణాన్యరణాసక్తవాలివ్యాపాద నాది జనాపవాదప్రతిపాదనేన స్వవచసా కవినా వినాశః కృత ఇత్యనుచిత మేతత్.

(3) దేశౌచిత్యము క్రింద.—యథా భట్ట భవభూతేః ।

పురా యత్ర స్రోతః పులిన మధునా తత్ర సరితాం,
విపర్యాసం యాతో ఘనవిరళభావః క్షితిరుహామ్,
బహోర్దృష్టం కాలా దపర మివ మన్యే వన మిదం,
నివేశః శైలానాం త దిద మితి బుద్ధిం ద్రఢయతి.

ఇందులకు తెనుఁగు 26 (18). దీనిపై విమర్శము.—

అత్ర బహుభి ర్వర్ష సహస్రై రతిక్రాన్తైః శమ్బూకవధప్రసఙ్గేన దణ్డకారణ్యం రామః పూర్వపరిచితం పునః ప్రవిష్టః సమస్తా దశాః తత్త్వతం ప్రస్తౌతే—'పురా యత్ర నదీనాం ప్రవాహ స్తత్రేదానీం తటమ్; వృక్షాణాం ఘనవిరళత్వే విపర్యయ శ్చిరాద్దృష్టం వన మిద మపూర్వ మివ మన్యే, పర్వతసన్నివేశ స్తు త ఏవైత దితి బుద్ధిం స్థిరీకరోతి.' ఇత్యుక్తే చిరకాల విపర్యయము పరివృత్త సంస్థాన కానన వర్ణనయా హృదయసంవాదీ దేశస్వభావః పరమ మౌచిత్య ముద్రితము'.

సీతా వివాసనము ధర్మ్యమా, అధర్మ్యమా ?

పూర్వోక్తము చక్కఁగా నవగాహించిన, ఈ ప్రశ్నకు అవకాశమే ఉండదు. అయినను ఇంచుక. ప్రజారంజనార్థము శ్రీరాముఁడు సీతను దూరీకరించెను. తద్రంజనమే తద్వ్రతము, "ఆర్ష్మిలిని గాని" 4 (5) వివాసనోపదేష్టలును తత్ప్రేరకులును "తప్పక వేళ టెక్కోకం దీర్చునది" యనియు, "ప్రజల రంజింపఁ దివురుమెప్పాట నైన" 4(4) అనియు, చెప్పిపంపిన యరుంధతీవసిష్ఠులు, సీతంగూర్చి పడిన చ్చిన్నంత గన్న వారణమునకై సీతావివాసనముకన్న నుపాయాంతరము లేదు ["ప్రసాధు" 14 (85)]. ఎల్లవారింగూర్చి సీతాశుద్ధిం దెలుపరాదా యనిన, అది ఆపెద్దలు లేక నిరవమానముగా నెట్లు జరుగును ? వారు జన్నమును ఆకాలమున వీడి యెట్లు వత్తురు ? వారికి సమయమై వారు వచ్చి ఆయుపాయము నే ప్రయోగించువఱకు (7 అం) వివాసనము తప్పదాయెను. ఈలోపల వియుక్తి శుభోదర్కమే యని ఆశీర్వాద వాక్యములచే సీతారాములకు తెలిపినవారు (అరుంధతియు) వసిష్ఠుఁడును ఋశ్యశృంగుఁడును: "వీర ప్రసవవు గమ్ము." "మఱి పుత్త్రపూర్ణ మైనయొడితోడినిన్ను ఆయుష్మతిని చూడఁ గలము." రాముఁడు సీతాశుద్ధి నెఱుంగనివాఁడు గాఁడు 5 (?), (7), 14 (86). పౌరులు సీత నింట నుండనీయనందులకు వారు నింద్యు లని తమస స్థూలదృష్టిచేఁ బలుకుఁగాక; సూక్ష్మమతి శ్రీరాములవారు పౌరులను నిందించుట తగవుగా దని పలికినారు: "విశ్వసించు నెవండు దవిష్ఠవృత్తి" 15 (37). భాగీరథియుఁ రాముని మతమే వహించినది: "త్యాయం డబ్లెను..." 87 (6). తెలియక, "తర మెవ్వరి కౌను వారితత్త్వము తెలియఁగ" 21 (7), వాసంతి వివాసన మకార్య మన్నది - "ఎల యీ యకార్యమును దేవర గావించెను ?" 40, "ఓయి కఠోర" 40 (20), "ఈవె మదీయజీవితమవు" 39 (19). పితృత్వకారణంబున జనకుఁడు రామునిపై అలిగియు, "ఈవిశసాళనిప్రమాతి" 59 (23), అరుంధతి హెచ్చరించిన ప్రజాపాలన కారణమునకు 59 (22) సమాధాన మొందినాఁడు "బ్రోవక" 59 (28). అట్లే గర్భ ప్రీతికారణంబున పృథ్వీదేవి రామునిపై కడు వలిగియు, "బాల్యమువను" 86 (5),

భాగీరథీబోధనచే 87 (గ), సమాధానపడినది. ఈమెయు భాగీరథియును సీతాశుద్ధిని ప్రతిపాదించుటచే పౌరజానపదులు సమాధానపడి సపుత్త్రసీతారామసమ్మేళనము నంగీకరించిరి. అశుద్ధిని స్థాపించి పౌరులను సమాధానపఱచుట సీతాశుద్ధికిని రాముని యశమునకును అత్యంతావశ్యక మని పెద్ద లెల్లరుం దలంచి, అట్లే సంవిధానముం గూర్చిరి. ఇట్లు సీతావివాసనము సాహసమేగాని అసాధువుగాదు.

ఈ విషయంబున కేల్ (Kale) పండితుల యు. రా. చ. యుపోద్ఘాతము నందలి యీసంవాదముం గనుఁడు:—

"Shallow critics, with their gratuitous sympthy with Sita for her cruel abandonment in the forest, are inclined to find fault with Rama for his undue solicitude for the contentment and happiness of his overnice subjucts. They miss the very beauty of Rama's life when they take such a narrow view of it. Judged by the ideal standard of duty, Rama deserves our approbation of his wonderful self sacrificing nature rath r than condemnation for the seemingly cruel deed. No one was more conscious of the cruelty of the action than Rama himself as is evident from his utterances in the drama, but has he lived for his subjects he was bound to please them at any cost to himself. No one was more conscious than Rama himself of the sterling womanly qualities of Sita—almost an idealistic picture of every virtue that ennobles womanhood and gives it a peculiar majesty and grandeur, but when called upon by the stern voice of duty, Rama throws her off inwardly feeling the deepest anguish for the cruel step that he is forced to take."

## రసచర్చ

ఈనాటకమందు రసము ధర్మవీర మనియుం, నాయకుఁడు ధర్మవీరుఁ డనియు వ్యాఖ్యానించువారుం గలరు. అందులకు నాయుపపాదనము:—

"ఉత్సాహాత్మా భవేద్వీరస్త్రేధా ధర్మాదిభేదతః
నాయకోఽత్ర భవేత్సర్వైః శ్లాఘ్యై రనుగతో గుణైః." వాగ్భటః.
"ఉత్సాహాత్మా వీరస్త్రేధా యుద్ధధర్మదానేషు
విషయేషు భవతి తస్మిన్ ప్రకృతిః నాయకః ఖ్యాతః." రుద్రటః.
"ధర్మదానయుద్ధభేదైః త్రేధా వీరః." హేమచన్ద్రః.
"వీర శ్చతుర్ధా । దానదయాయుద్ధధర్మైస్తదుపాధేరుత్సాహస్య చతుర్విధత్వాత్." రసగఙ్గాధరః.

ఈనాటకమున నాయకునందు ధర్మవీరతా సాధకము లయిన వాక్యములు:—

ఆముఖములో అపవాదప్రస్తావము, ప్రథమాంకమున:—అర్మిలినిగాని 4 (5), కట్టా! లోకులు 5 (7), పుత్త్రులకు నిజ 8 (15), అకటసీకకు 14 (33), ఏకార్యముచే నైనను (34), ఏసాధుశుద్ధ (35), నీవలన (36), లోకులకు 15 (37), పిన్నకతి (38), నేరనిముగుదా (39), గోడుగుడువ (40), ఎదను 16 (42).

ద్వితీయాంకమున:—స్వరూప 21 (7), కుడికరము 22 (1), జెలిక 28 (9).

తృతీయాంకమున:—డెంకమున 32 (4), ఈవె మదీయ 39 (9), ఓయి కఠోర 40 (21), పూనికతోడ 41 (23), సరిపడ దాయె (25), ప్రియునుగాని (24), చకిత 40 (21), వెల్లి (22), దేవి పాడిడి 4 (26), అడ్డముగ 42 (28), పాంక (29), హా ప్రాణేశ్వరి 43 (31), సరవి 46 (37), ఎచట (50).

షష్ఠాంకమున:—మొదలనే 81 (24), నిరతిశయంపు (26), ఆకృతి 82 (31), అనుభావ 83 (34).

సప్తమాంకమున:—మహర్షులు ధర్మములను సాక్షాత్కరించినవారు 84, బాల్యమున 86 (15), క్ష్మాసుం దల్లెదు 87 (6). కుందు 89 (12).

ఇందు సీతావిరహశోకోద్ధురతాపరము లైన వాక్యములు తత్కారణ భూత ప్రజారంజన ధర్మైకాభినివేశ తాత్పర్యకములు. నాటకము ఆదిలోనే అపవాద మూలకము. అంతమున నిరపవాదకరణపరము. లోకరంజనము ఆదిలో త్యాగముచేత, అంతమున తత్సమాకలన పూర్వక తత్ప్రతిబోధనముచేత; ఏతదనుసారముగా భరత వాక్యమందు "తు్రంగంజేసి యఘంబు" అనువాక్యము అపవాదనిరసన పూర్వక ధర్మనిర్వాహపరముగాను, "శ్రేయముల సందోహంబు బొందించుతకా" అనుట సీతా పునఃప్రాప్తిపరముగాను గ్రాహ్యములు; కడముపద్యంబును అట్లై. ఈమతమున వీరరసమునకు అంగికి కరుణవిప్రలంభము అంగము, ధర్మాభినివేశదార్ఢ్యబోధకము.

సీతాపునస్సంప్రాప్తికై వ్యాఖ్యలయందు చేయబడునట్టి బీజాద్యారంభాది ముఖాదిసమన్వయముల నెల్ల నిరపవాదసాధనకై చేయవలయును.

కరుణ విప్రలంభ సిద్ధాంతము.

ఈనాటకంబున కరుణరసము అంగి యని యొకమతము కలదు.—సాహిత్య దర్పణమందు నాటకలక్షణమున "ఏక ఏవ భవే దఙ్గీ శృఙ్గారో వీర ఏవ వా" అని రెండు ఏవకారములతో నియమము నిబద్ధమై యుండగా, "శృఙ్గారో వీరో వేతి కథనం తు సముచిత రససూచనమ్; తేనోత్తరరామచరితే కరుణరసస్య ప్రబోధ చన్ద్రోదయే శాన్తస్య చాఙ్గిత్వ మవ్యాహతమ్." అని మద్రక్షాపీఠిక. శృఙ్గారిక

ప్రాధాన్యముగా నుండలేదు. ఎట్లన—ప్రబోధచంద్రోదయమందు వీరరసమే అంగి గాని శాంతరసముగా దని మతాంతరము గలదు; అదే సాధువుగాఁ దోఁచుచున్నది. మఱి యీ జ్ఞాపికచే నిరూపకమంతుఁగాని తల్లక్షణోక్త రసమే యుండవలయు నను నియమము జలలిపి యగును. మఱియు జ్ఞాపిక కరుణవిప్రలంభలక్షణమునకు విరుద్ధముగా నున్నది. ఎట్లన—సా. ద.

"యూనోరేకతరస్మిన్ । గతవతి లోకాన్తరం పునర్లభ్యే
విమనాయతే యదైక । స్తదా భవేత్కరుణవిప్రలమ్భాఖ్యః."

"యథా కాదమ్బర్యాం పుణ్డరీకమహాశ్వేతావృత్తాన్తే । పునరలభ్యే శరీరాన్తరేణ వా లభ్యే తు కరుణాఖ్య ఏవ రసః." అని తద్వృత్తి. సీత పునర్లభ్య యైనది గావున కరుణరసము గాదు. దీనిని మఱలం దడవెద.

కరుణశబ్దముగాని, (కరుణాశబ్దముగాని, దీనిం గూడ సాధకముగాఁ గొని యున్నారు.) అక్కడక్కడ నాటకమందు కనఁబడుట సాధకము గాదు. అగునేని, మాలతీమాధవమునను అంగి కరుణరసమే గావలయును. ఎట్లన—అందు 9, 10 అంకములలో ఈ ప్రయోగము లున్నవి—(సకరుణం నిశ్వస్య),—(సకరుణం పరివృత్యావలోక్య చ)—(సకరుణంవిముచ్య),—(సోచ్ఛ్వాసం సకరుణమ్),—(సకరుణం నిశ్వస్య),—(సకరుణం సాస్రమ్),—మఱియు "కరుణవేచరవచనాత్" 10(14), "కలాలాపాలిలాచ్ఛాయ ముచ్చరత్కరుణధ్వనిః" 5 (21). ఇంతమాత్రచే మాలతియందు కరుణము అంగి యగునా? కాదని చెప్పవలయునా! "ప్రకరణమందు శృంగారము అంగిగా నుండు"నని లక్షణము గదా. మఱియు మాలతియందు—

"అకరుణ, వితర స్మితోజ్జ్వలాం । దృశ. మతిదారుణ, దేహి మే గిరమ్,
సహచర మనురక్తచేతసం । ప్రియ మకరన్ద, కథం న మన్యసే!" 9 అం.

అనుశ్లోకమున కరుణరస మని వ్యాఖ్య. అందువలన మాలతిలో కరుణరసమే అంగి యగునా? మఱియు—

"జనస్థానే శూన్యే వికలకరణై రార్యచరితై
రపి గ్రావా రోదిత్యపి దలతి వజ్రస్య హృదయమ్." 1 (28)

అను నుత్తరరామచరితశ్లోకమున పూర్వరామచరితాంశము వర్ణితమై యున్నది. దానిం గూర్చి ఆర్యాసప్తశతిలో—

"భవభూతేః సంబన్ధా ద్భూధరభూరేవ భారతీ భాతి
ఏతత్కృతకారుణ్యే కిమన్యథా రోదితి గ్రావా?"

అని యున్నది. ["కారుణ్యం కరుణా ఘృణా" అమర. కరుణము గాదు.] ఇందు

వలన మహావీరచరిత్రముకూడ కరుణరసమే అంగి యగునా? శాకుంతలము పంచమాంకములో—

"వత్సశార్ఙ్గరవ, అనుగచ్ఛతీయం కరుణపరిదేవినీ శకున్తలా।
ప్రత్యాదేశపరుషే భర్తరి కింవా మే పుత్త్రికా కరోతు?"

ఇందలి కరుణశబ్దముంబట్టి శాకుంతలమందును అంగి కరుణమే యగునా?

కావున కరుణశబ్దప్రయోగము కరుణాంగికత్వసాధకము గాదు. అట్లే "రామస్య కరుణోర్యః" 89(12), "రామస్య కరుణో రసః" 28(1), ఇవియుం కరుణాంగికత్వసాధకములు గావు. ఇందు కారుణ్య కరుణరస శబ్దములు నిరుక్తకరుణరస పరములు గావు. ఏలన, రసము కథాపురుషులయందుఁ గాని నటులందుఁ గాని ఉండదు. అది సామాజికుల హృదయమునందు ఉద్బుద్ధమగును. మఱి "కరుణస్య మూర్తి రథవా శరీరిణీ విరహవ్యథైవ వన మేతి జానకీ" ["కరుణమూర్తియొ" 80 (4)]-ఇదియు సాధకము గాదా? కానే కాదు. ఇట కరుణపదము నిరుక్త కరుణరసపరమే అని యంగీకరింతుమేనియు, ఉత్ప్రేక్షా ప్రభావముచేత విరహవ్యథాతిరేకమును తెలుపుచున్నదే గాని, ఈనాటకమందు కరుణరసము అంగి యని తెలుపఁజాలదు; పైగా అంగి కాదనియే నిరూపించుచున్నది; దీని పర్యాయమే "శరీరిణీవిరహవ్యథైవ" యను వాక్యంబును ["మెయి గొన్న విరహాధిరమొ." 80 (4)].

మఱి "రామస్య కరుణో రసః" ["రాముని కరుణరసము" 28 (1)] అనుచో కరుణశబ్దము నిరుక్తరసపరముగా దేని కవి దానిని రస మన వ్యవహరించినాఁడే, అది యెట్లు సంగత మగును? అందులేని, ఇట్టి స్థలములలో రసశబ్దము భావపరము గాని శృంగారాదిరస పరిగణనాంతర్గత కరుణరసపరము గాదు. మాళవికయందలి యీ క్రింది ప్రయోగముం గనుఁడు:—

"అఙ్గై రన్తర్నిహితవచనైః సూచితః సమ్యగర్థః,
పాదన్యాసో లయ మనుగతః, స్తన్మయత్వం రసేషు."

ఇందులకు—"రసేషు సాత్త్వికవ్యభిచారిభావేషు" అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. "అత్ర రసశబ్దేన ఉపచారత్ పరిపోషాతిశయవన్తో భావాః కథ్యన్తే ప్రకృతత్వాత్। రసే వ్యాప్తిప్రసఙ్గాత్." అని కాటయవేమవ్యాఖ్య.

'రసము రామాదులయం దుండ' దని మీరు చెప్పుచున్నారు. రామాదులయం దుండు నని యిదె పరసరాదీయ వచనము:—

మ. రమణీయోల్బణ కాసమేత మగునీరత్యాదిభావాబ్ధిలో
నమరం బుట్టించు మున్గుచుం దగుఁ దరంగారూఢి సంచారినం

సుమః కేతకప్రీతిపన్నమాసము దత్యాలంబనం బైన స
త్త్వము నామాలుల యందెం, నాట్యమున సభ్యావాసమై భాసిలున్.

ఇందుల కేమి చెప్పెదరు? అని యా. శ్లో. మేని — నిరుక్త కరుణరసము రామాదినిష్ఠము గా దని సిద్ధాంతము. — సా. ద. వృ. పం. చూచునది.

"పారిమిత్యా ల్లౌకికత్వా త్సాన్తరాయతయా తథా
అనుకార్యస్య రత్యాదే రుద్బోధో న రసో భవేత్.
శిక్షాభ్యాసాదిమాత్రేణ రాఘవాదేః స్వరూపతామ్
దర్శయన్ నర్తకో నైవ రస స్యాస్వాదకో భవేత్.
కావ్యార్థభావనే నాయ మపి సభ్యపదాస్పదమ్."

మఱియు — "రామస్య కరుణో రసః" ఇత్యాది వాక్యములందు కరుణపదము నిరుక్త కరుణరసపరము కాదు. కరుణ నాటకనియందు రసమును స్వశబ్దముచేతనే చెప్పిన దోషము సంభవించును. ఎట్లన — సా. ద. సప్తమపరిచ్ఛేదము —

"అథ రసదోషా నాహ — రస స్యోక్తిః స్వశబ్దేన" — "రసస్య స్వశబ్దో రసశబ్దః శృఙ్గారాదిశబ్దశ్చ. క్రమేణ యథా —

"తా ముద్వీక్ష్య కురఙ్గాక్షీం రసో నః కోఽప్యజాయత,
చన్ద్రమణ్డల మాలోక్య శృఙ్గారే మగ్న మన్తరమ్."

అట్లయిన, "రామస్య కరుణో రసః" ఇత్యాది వ్యవహారములయందు అశబ్దమున కర్థ మేమన, దుర్భరవిరహవ్యథయే యర్థము; అదియే కరుణ విప్రలంభోద్బోధకము. అట్లే "ఏకో రసః కరుణ ఏవ నిమిత్తభేదాత్" అను వాక్యమున దుర్భరవియోగవ్యథయే విప్రలంభశృంగారాది వివర్తములం జెందు నని భావము.

ఈనాటకమున కరుణవిప్రలంభ మంగి గాని కేవలకరుణము అంగి గా దని సులువుగా తెలియుటకై కరుణరస కరుణవిప్రలంభాది స్వరూపచర్చలను అభియుక్తకృతములం గొన్నిటి నుద్ధరించెద: —

రసతరఙ్గిణీ.

"యూనో రేకతరస్మిన్ ప్రేతే ప్రలాపః కరుణరసః। జీవతో ర్విశ్లిష్టయోః ప్రలాపః శృఙ్గారః। అతఏవ రసరత్నదీపికాయాం కరుణరసోదాహరణమ్। 'అయి జీవితనాథ' ఇతి। నను విప్రలమ్భశృఙ్గారస్య పూర్వానురాగ మాన ప్రవాస కరుణాత్మకత్వాత్ జీవతో రపి విప్రలమ్భస్య కరుణరసత్వ మాయాత మితి చేత్సత్యమ్ తత్ర కరుణరస స్యాఙ్గత్వేన భాసమానత్వాత్ తత్ర కరుణాత్మకత్వవ్యపదేశః."

"శోకస్య పరిపోషః కరుణః - అభావిచ్ఛేదే సతి సర్వోత్కృష్టత్వమోహా । న చ విప్రలమ్భేఽతివ్యాప్తిః - తత్రేష్టప్రాప్త్యాశాయాః సత్త్వాత్ । తద్విచ్ఛేదే తు స విప్రలమ్భః కరుణ ఏవ - శోకో దుఃఖమ్."

వాగ్భటాలఙ్కారః.

"స్యాదేకతరపఞ్చత్వే దమ్పత్యో రనురక్తయోః
శృఙ్గారః కరుణాఖ్యోఽయం వృత్తివర్జన ఏవ సః."

"చతుర్థ మాహ । స్యా దితి । స్నిగ్ధయో ర్నాయకయో రేకస్య పఞ్చత్వే మరణే అపరస్య ప్రియాయా యో విరహః కరుణాఖ్యోఽయం కరుణనామా స్యాత్ । పరం స వృత్తవర్జనే ఆచారదార్ఢ్యఖ్యాపక ఏవ ప్రయోజనవా నితి గమ్యమ్. యథా । ......ఇత్థం చతుర్ష్వపి విప్రలమ్భేషు నాయికానాయకపరతయా ఉదాహరణ ద్వయం ప్రదర్శితమ్."

రుద్రటః.

"అథ విప్రలమ్భ నామా । శృఙ్గారోఽయం చతుర్విధో భవతి
ప్రథమానురాగ మాన । ప్రవాస కరుణాత్మకత్వేన."

వ్యాఖ్యా.—కేచిత్తు కరుణరస ఏవ విప్రలమ్భభేదం కరుణ మన్తర్భావయన్తి । తదసత్ వైలక్షణ్యాత్ । శుద్ధే హి కరుణే శృఙ్గారస్పర్శ ఏవ నవిద్యతే । కరుణ విప్రలమ్భస్తు శృఙ్గార ఏవ । యథా కాళిదాసస్య 'ప్రతిపద్య మనోహరం వపుః...'

"కరుణ స్స విప్రలమ్భో యత్రాన్యతరో మ్రియేత నాయకయోః
యది వా మృతకల్పః స్యాత్ తత్రాన్య స్తద్గతం ప్రలపేత్."

హేమచన్ద్ర కావ్యానుశాసనమ్.

"కరుణ విప్రలమ్భ స్తు కరుణ ఏవ । యథా—'హృదయే వస సీతి' ఇత్యాది రతిప్రలాపేషు." "విప్రలమ్భేఽనవచ్ఛిన్న ఏవ సంభోగమనోరథః, నిరాశత్వే తు కరుణ ఏవ స్యాత్."

సరస్వతీకణ్ఠాభరణమ్.

"అభ్యఙ్గసార్ద్రత్వే కరోతి చిత్తం దుఃఖేన యథా: 'దళతి హృదయమ్'— అత్ర రామాదేః దుఃఖేన చిత్త మభ్యజ్యతే."

"భావో యదా రతి ర్నామ ప్రకర్ష మధిగచ్ఛతి
నాధిగచ్ఛతి చాభీష్టం విప్రలమ్భ స్త దోచ్యతే.
పూర్వానురాగో మాన శ్చ ప్రవాసః కరుణ శ్చ సః
తరుణస్త్రీప్రకాణ్డేషు చతుఃకాణ్డః ప్రకాశతే.

ద్వయోరేకతరస్య మృతౌ పునస్సంజీవనావధి
విరహః కరుణోऽన్యస్య సంగమాశానువర్తనాత్,
కరుణభ్రమకారిత్వాత్ సోऽయం కరుణ ఉచ్యతే
సంచారిణోऽనుభావాశ్చ కరుణేऽపి ప్రవాసవత్.

యథా — 'అత్ర మహాశ్వేతా పుండరీకవృత్తాన్తమ్' । అత్రాకాశసరస్వతీప్రత్యయేన రతేర్విప్రలమ్భః ... అత్ర కేచిదాహుః - కరుణో నామ విప్రలమ్భశృఙ్గారో నాస్తి-శుభయాలమ్బనస్య తస్యైకత్రాసంభవాత్ । యత్ర త్వేకవ్యపాయే సతి తదితరగతాః ప్రలాపాదయో భవన్తి స శోకః స్నేహాద్భిద్యత ఇతి । తదయుక్తమ్ యతః పునస్సద్భావనేవ సంభోగో న నివర్తతే తత్ర సత్యం శోక ఏవ । యత్ర సోऽస్తి తత్ర విప్రలమ్భ ఏవ ।..."

సాహిత్యదర్పణః.

"యూనోరేకతరస్మి న్గతవతి లోకాన్తరం పునర్లభ్యే
విమనాయతే యదైక స్తదా భవేత్కరుణవిప్రలమ్భాఖ్యః.

యథా—కాదమ్బర్యాం పుణ్డరీకమహాశ్వేతావృత్తాన్తే । పున రలభ్యే శరీరాన్తరేణ వా లభ్యే కరుణాఖ్య ఏవ రసః । [టీక — పున రలభ్య ఇతి — రతేర్నాశాత్ ఉత్కటశోకసంభవాచ్చ కరుణాఖ్యో రసః, న పునర్విప్రలమ్భ ఇతి భావః] కించాత్రాకాశసరస్వతీభాషానన్తరమేవ శృఙ్గారః; సంగమప్రత్యాశయా రతేరుద్భవాత్ । ప్రథమం తు కరుణ ఏవ' ఇతి వృద్ధయుక్తా మన్యన్తే । యచ్చాత్ర సంగమప్రత్యాశానన్తరమపి భవతో విప్రలమ్భశృఙ్గారస్య ప్రవాసాఖ్యో భేద ఏవ' ఇతి కేచిదాహుః, తదన్యే 'మరణరూపవిశేషసంభవాత్తద్భిన్నమేవ' ఇతి మన్యన్తే॥

యత్ర తు రతిః ప్రకృష్టా నాభీష్టముపైతి విప్రలమ్భోऽసౌ

అభీష్టం నాయకం నాయికాం వా । స చ పూర్వరాగమానప్రవాసకరుణాత్మకశ్చతుర్ధా స్యాత్. [టీ.—ప్రకరణాదినా ప్రధానత్వం ప్రాప్తా - కరుణాదౌ శోకోద్దీపకతయా రతిసత్త్వేన తత్రాతివ్యాప్తివారణాయ ప్రకృష్టేతి.]"

శృఙ్గారతిలకః.

"విప్రలమ్భాభిధానోऽయం శృఙ్గారస్స్యాచ్చతుర్విధః,
పూర్వానురాగమానాఖ్యప్రవాసకరుణాత్మనా.
యత్రైకస్మిన్ విపన్నేऽన్యో మృతకల్పేऽపి తద్గతమ్
నాయకః ప్రలపేత్ప్రేమ్ణా కరుణోऽసౌ స్మృతో యథా.
శేషాక్షి కరుణభ్రాన్తిః కారుణ్యాదత్ర జాయతే,

పిమ్మట సీత మరల లభించినది. లభించునంతకు రామునివిలాపము కరుణవిప్రలంభము. [ఇట దర్పణ [illegible] వాక్యమున కర్థము—వదల లభింపనియెడల రతి నశించుటచేతను, [illegible] కరుణరసము గాని విప్రలంభము గాదు.] ఈ [illegible] నాటకమెందును [illegible] నున్నందునను ప్ర[illegible] [illegible] విప్రలంభ మయినది, అని సిద్ధాంతము.

## ౮. [illegible]

"ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే."

ఈ వాక్యమునకు శాకుంతలముకన్న ఉ. రా. చ. ఉత్కృష్టమని కాళిదాసు పలికినట్లుగా అర్థానకము. [పై వాక్యమునకు భవభూతి కృతనాటక త్రయములో ఉ. రా. చ. శ్రేష్ఠమని యర్థమని కొందరు చెప్పెదరు.]

ఈ నాటకమందు ప్రధానులగు స్త్రీపురుషులు ఉత్తమోత్తములును లోకాతీతులును. నాయికా నాయకులు సత్యాభిమానము దున్నను సాక్షాల్లక్ష్మీనారాయణులు; అంతకన్న నుత్తము లెట్లుందురు? శ్రీరాముని మించిన ధీరోదాత్త నాయకుని, సీతకన్న పతివ్రతాయువతిని ధర్మప్రపంచము చూపజాలదేమో. అరుంధతి పృథ్వి భాగీరథి వాసంతి ఆత్రేయి తమస వాల్మీకి జనకుడు - వీరిచరిత్రమును, వీరు మెచ్చిన సీతారాముల చరిత్రమును, బోధించు నీనాటకము ఆర్యావర్తమునకు ఉత్తమోత్తముల నూత్న ధర్మాచరణమునకు లక్ష్యభూతము గా నున్నది.

కవి యిందు గృహిలోక వృత్తమును నిపుణముగా నిబంధించినాడు. పుత్త్రుడని యెఱుంగకయే పుత్త్రవాత్సల్యము, నాయన యని యెఱుంగకయే పితృభక్తి, అన్న యనియు తమ్ముడనియు నెఱుంగకయే భ్రాతృప్రేమ - వీనిని అత్యద్భుతముగా అత్యంతహృదయంగమముగా నిరూపించినాడు. మఱియు నిట్టియహేతుక పక్షపాతములు ఏదో అంతర హేతువువలన గలుగును గాని బహిరుపాధికృతములు కావని వాక్రుచ్చినాడు. మహాకవి గావున ఈవిధముగా చిత్తప్రవృత్తిని చర్చించినాడు. ఇట్లే కాళిదాసు గూడ శాకుంతలమున ఒకచో చేతఃప్రీతివిశేషమునకు జన్మాంతర సౌహృదమును కారణముగా నుపన్యసించినాడు: ఎట్లన—

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జన్తుః
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాన్తర సౌహృదాని." శాకుంతలము.

వసిష్ఠులు నెఱవేర్చినారు. జనకుఁడు లవుని జూచి, ఈబాలు నెవ్వనింగాఁ దలంతువు? అని యీమె నడిగినప్పుడు, ఈమె అబాలుఁ డెవ్వఁడో తా నెఱింగియు సత్యమయిన యుత్తరమును అప్పుడు చెప్పంగూడదని యుండుటంబట్టి, మేము ఇప్పుడే వచ్చుచున్నామని పలికి ఆప్రశ్నను తొలఁగించుకొన్నది. అట్లు ఒక్కుమ్మడిగా కలుసుకొనుట సంభవింపని యట్లుగా కవి ఈమెవిషయమై సవిమర్శనమును విశేషముగా కల్పించియుండిన ఈమెయొక్క మహిమకు అనుగుణముగా నుండును. ఈమెయానతిచే ఎల్లలోకులును సీతామహిమను అంగీకరించిరి. ఈమెయానతిచే శ్రీరాముఁడు సీతను వెండియు స్వీకరించెను. ఈమె సీతాదోహదమును తప్పక తీర్పవలసిన దని రామునికి చెప్పిపంపుట తత్పరిత్యాగమును జరుపుటకే. కావున, ఈమె పనిపడి పునస్సంఘటనమును సాధించినది. పరిత్యాగము సేయించుట లోకారాధనకు అంతకన్న నుపాయము లేనందున.

## వాసంతి.

ఈమె జనస్థానవనదేవత, సీతాదేవికి నెచ్చెలి. ఏవ్రతమునకు హిందువులు జగత్ప్రఖ్యాతులో ఆయాతిథి పూజావ్రతమును 17(1), అర్యమాత్రుల సౌజన్యమున 18(2), ఈమెచరిత్రము విశదీకరించుచున్నది. దేవత యయ్యును ఈమె శ్రీరాములకన్న న్యూనప్రభావ. వారి యంతస్తత్త్వమును తాను గనలేకపోయినది, ఎవ్వరును గనలేరనియుం దలంచినది; రాముఁడు లోకోత్తరుఁ డని యెఱింగినది 21 (7). రాముఁడు సీతను త్యజించినందులకు ఈమె కరము దుఃఖితురాలై ఆయనను గ్రుచ్చి గ్రుచ్చి కారణ మడిగినది. లోక మొప్పదే దని ఆయన పలికినకారణమును పరిత్యాగమునకు చాలినట్టి దని ఈమె తలంపదాయెను 40 (21). రామునియందును ఈమెకు పరమానురాగమును చనవును గలవు. ఈమెయుం దమసవాలె సీతారాముల పునస్సంఘటనమును పృథ్వీభాగీరథీ వసిష్ఠారుంధతీ వాల్మీకులు సమకూర్తురని తలంచినదే 47(41).

## [వసిష్ఠులవారు.]

[వీరు నాటకములో ప్రత్యక్షముగా వ్యవహరింపక పోయినను శ్రీరామునికి లోకారాధన వ్రతమును అతిక్రమింపవల దని సందేశము పంపుటచే వీరును సీతాపరిత్యాగమును నెఱవేర్చినవారే; లేక, వీరే సీతాపరిత్యాగమును చేయించినవారు. లోకారాధనకు ఒండు ఉపాయము లే దని అందలి ధర్మరహస్యమును వీరును అరుంధతియు శ్రీరాములవారును ఎఱుఁగుదురు. అట్లు వీరు సమాధానము సేయించి సీతాశుద్ధతను లోకహృదయంబుల నాటి సీతారాముల మీఁది ప్రేమాతిశయముచే వారిని మరలం గూర్చినవారు. సీతావిరహము నిరవధి యని రాముఁడు పలికినను సావధియ యని వీరు నరుంధతియు నెఱుంగుదురు. ఆయవధిని త్వరపఱచుటకే వీరు సారుంధతీకులై అయోధ్యకుం బోక వాల్మీకాశ్రమమున నిలిచినారు.]

## ఈతని రూపకములందు సాధారణములైన శ్లోకములు.

| సంఖ్య | శ్లోకము | మాలతి | వీరచరిత | ఉ. రా. చరిత |
|---|---|---|---|---|
| 1 | అనియత | 1[illegible] (2) | | 4 (4) |
| 2 | కింత్వనుష్ఠాన | | 4 (33) | 1 (8) |
| 3 | అమృతాధ్మాత | | 2 (45) | 6 (21) |
| 4 | ఇహాసమద | | 5 (40) | 2 (20) |
| 5 | ఏతస్మిన్మద | 9 (14) | | 1 (31) |
| 6 | చతుర్దశసహ | | 5 (18) | 2 (15) |
| 7 | చూడాచుమ్బిత | | 1 (18) | 4 (20) |
| 8 | జీవయన్నివ | 8 (8) | | 1 (34) |
| 9 | జ్యాజిహ్వయా | | 8 (29) | 4 (?9) |
| 10 | త్రాతుం లోకాన్ | | 2 (40) | 6 (9) |
| 11 | దధతికుహర | 9 (6) | | 2 (21) |
| 12 | దళతి హృదయగా | 9 (12) | | 3 (31) |
| 13 | మాతర్తాతర్ | 9 (20) | | 3 (30) |
| 14 | పంపాణ్డు | 2 (4) | | 3 (4) |
| 15 | పుత్రసంక్రాన్త | | 4 (51) | 1 (22) |
| 16 | బ్రహ్మోదయా | | 1 (42) | 1 (15) |
| 17 | లీలోత్ఖాత | 9 (34) | | 3 (16) |
| 18 | వ్యతిషజతి | 1 (27) | | 6 (12) |
| 19 | సుహృదివ | 4 (7) | | 4 (15) |

| పు. | పం. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 8 | 5 | ఆయున | ఐన |
| | 12 | రోఁత | నొల్లమి |
| 8 | 9 | కష్టంబు | కష్టము |
| 9 | 14 | తలంతె | స్మరింతె |
| 10 | 7 | క్లప్త | క్లృప్త |
| 12 | 27 | శైశవంబున | బాల్యమునయందు |
| 32 | 3 | తపంచు | తపించు |
| 35 | 2 | పకట | వకట |
| 39 | 6 | స్థిటకుకు | వ్వనికి |
| 46 | 10 | దారిఁ,దా | దారిఁదా, |
| 47 | 9 | ట్లైన | ట్రైన |
| 50 | 24 | విద్య | విద్యను |
| | | ద్రయియుం | ద్రయిం |
| 52 | 5 | యాజ్ఞ | ఈయనకుయాజ్ఞ |
| | | డీయనకొసంగె | డొసఁగె |
| 53 | 9 | మూర్ఛలో | మూర్ఛలో; |
| 70 | 22 | ముండనీ | యుండనీ |
| 79 | 20 | రముంబులా | రమంబగు |
| | | వర్ష్మములను | వర్ష్మకమును |
| 80 | 2 | నైపుణ | నైపుణి |
| 87 | 2 | నైతివి | చేసితివి |
| 88 | 10 | యింది ! | యిఁది ! గొల్లిడుచు |
| 89 | 22 | వీరలం | వీరును |
| 92 | 9 | ఉపనీతులం | తల్లిదండ్రులతోఁ |
| | | జేయుము. | గూర్పుము. |

పు 22 (9, 10) లకు ఇట్లు మార్పుకలదు.

సీ. పిట్టకేఁ దొడిమలకట్టు విడువుఁజెంద । ద్విరదముల్ చెక్కులనురదవోవ
పోరయుడు రాలుపూధరములఁ దటతరుల్ । గోదను బూజించు గొమరుగనుము;
వాని పైఁగూండ్లకు వచ్చిపావురములు । నదనికోట్లను జెందఁ బడదికలకు
కాంతి పైఁగొదిరి విశ్రాంతిసేవించుచుఁ । గూసెడి హంసకార గుంఫనముగ.



## ఈనాటకమునందలి పురుషులు.

సూత్రధారుఁడును, నటుఁడును; గర్భాంకసూత్రధారుఁడును.
రాముఁడు—కథానాయకుఁడు
కంచుకి.
అష్టావక్రుఁడు—ఒకముని.
లక్ష్మణుఁడు—నాయకునియనుజుఁడు
దుర్ముఖుఁడు—అంతఃపురచారియైనపరిచారకుఁడు.
శంబూకుఁడు—శూద్రముని.
సౌధాతకి, భాండాయనుఁడు వాల్మీకిశిష్యులు
జనకుఁడు—విదేహరాజు, సీతతండ్రి.
గృష్టి—ఒకకంచుకి.
కుశలవులు—రామపుత్త్రులు.
బ్రాహ్మణవటువులు.
పురుషుఁడు—చంద్రకేతునిసైనికుఁడు.
చంద్రకేతుఁడు—లక్ష్మణపుత్త్రుఁడు
సుమంత్రుఁడు—చంద్రకేతుసారథి
విద్యాధరుఁడు.
వాల్మీకి—రామాయణకర్త.

## ఈనాటకమునందలి స్త్రీలు.

సీత—కథానాయిక.
ప్రతీహారి.
ఆత్రేయి—తాపసి.
వాసంతి—వనదేవత, సీతచెలి.
తమసా మురళలు—నదీదేవతలు.
అరుంధతి—వసిష్ఠపత్ని.
కౌసల్య—రామమాత.
విద్యాధరి.
పృథ్వీదేవి—సీతతల్లి.
భాగీరథి—(గంగాదేవి.)



# ఉత్తర రామ చరిత నాటకము.

---

## ప్రస్తావన.

ఆ. శ్రీ లెసంగ నిడెదఁ జేమోడ్పు సమయంబుఁ
గాంక్షతోడ నాద్యకవివరులకుఁ;
సత్కృపాభరమునఁ జక్కఁగ వడసెద
నమృత యాత్మకళయు నైనవాణి. ౧

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు:—అతి విస్తరము వలదు. ఇదె యిప్పుడు కాలప్రియనాథ భగవంతుని యుత్సవములో మహానుభావులకు మీకు విన్నపము చేసికొనుచున్నాను, ఇట్లు మీచిత్తమున నవధరింపవలయును — కలఁడుగదా మహనీయుఁడు కాశ్యపుఁడు శ్రీకంఠపదలాంఛనుఁడు పద వాక్య ప్రమాణ తత్త్వజ్ఞుఁడు జాతూకర్ణీపుత్త్రుఁడు భవభూతి.

తే. నలువకుంబోలె నెవనికిఁ బలుకుదేవి
తలఁపులోన మెలంగు సంతసముతోడఁ;
దద్రచితనాటకంబు నుత్తరము రామ
చరితమును నేఁ బ్రయోగింప జతనపడితి. ౨

ఇదె నేను కార్యవశంబున అయోధ్యావాసిని అప్పటివాఁడను నైతిని. [కలయం జూచి] ఓహో! పౌలస్త్యవంశధూమకేతు వగు మహారాజరాములవారి పట్టాభిషేకసమయము రేయుంబవలు ఎడతెంపులేని యానందనాందీవాదములచే ఘూర్ణిల్లుచుండునట్టిది యిది! మఱియేమి యిపుడు చత్వరస్థానములు నటులసందడి లేక యున్నవి!

నటుఁడు—[ప్రవేశించి] బావా, పంపినారుగదా మహారాజుగారు ఇటనుండీ వారివారి యిండ్లకు లంకాయుద్ధమిత్త్రులైనయామహాత్ములను వానరరాక్షసులను, తన్ను నానందంబొందింప నానాదిగంతములనుండియుం వచ్చినవారిని బ్రహ్మర్షులను రాజర్షులను. వా రున్నంతకాలము వారి నారాధించుటకుఁగాను ఇన్నిదినములు అనవరతము ఉత్సవము జరుగుచుండినది. మఱి యిప్పు డన్ననో?—

తే. అల వసిష్ఠుం డధిష్ఠాత యై సనంగ
భూపుతల్లు లరుంధతి మున్నిడుకొని
పోయినా రల్లునాశ్రమంబునకు నతని
జన్నమును గన్నులార దర్శనము సేయ. 3

సూత్ర.—పరదేశమువాఁడనుగావున నడిగెదను. ఎవ రాయన, వీరియల్లుఁడు?

**నటుఁడు.**—

తే. తనయఁ గన్న దశరథుఁడు శాంత యనఁగ,
రోమపాదుఁ డామెఁ గోరెఁ బుత్త్రిగ,
ఆమెఁ బెండ్లియాడ్డె నల విభాండకుపుత్త్రి
ఋశ్యశృంగుఁ డనెడు మునిచంద్రుఁడు. ౪

ఆ యల్లుఁ డిప్పుడు ద్వాదశవార్షిక యజ్ఞము మొదలిడినాఁడు. ఆయనమీఁది దాక్షిణ్యముచేత గురుజనులు పూర్ణగర్భిణియైనను కోడలిని జానకిని వదలి యటకుఁ బోయినారు.

సూత్ర.—మన కేల యీ జోలి? రా, రాజద్వారమునకే పోయి మన కులధర్మముచేత సేవింతము.

నటుఁడు.—అటులైన, బావా, ఏలినవారికై కడుం బరిశుద్ధమైన స్తోత్రపద్ధతిని నిరూపింపుము.

సూత్ర.—మారిషుఁడా,

తే. సర్వవిధముల గుణవంతుఁ డెన్నఁబడెను సరి,
మెట్టులును దూఱు తప్పు; న దెట్లటన్న ?
వనితలం దెట్లొ యట్లులే వాక్కులందు
సాధుతావిషయమున దుర్జనులు జనులు. ౫

నటుఁడు.—అతిదుర్జను లని చెప్పవలసినది.

తే. ఏల యనన, దేవి వైదేహినే గుఱించి
యాడికలు వల్కుఁజొచ్చిరి వయ్యారె జనులు !
రక్కసునియింట నున్కి కారణము నేసి,
వహ్నిశుద్ధిని విశ్వసింపంగ లేక ! ౬

సూత్ర.—ఈ జనవాదము మహారాజునకు అందెనా అంతట మిగులఁ గష్టము కలుగును.

నటుఁడు.—ఎల్ల విధముల ఋషులును దేవతలును మేలుసేయుందురు. (అని పరిక్రమించి) ఓహోయి ! ఏలినవారు ఇప్పుడు ఎక్కడ నున్నారు? (ఆకర్ణించి) జనులు ఇట్లు పలుకుచున్నారు:—

శా. ఆనందం బిడుకోర్కి నర్మిలి విదేహాధీశుఁ డేతెంచి తా
నీనా ళ్లుత్సవసంతతిం గడపి యిప్డే వీడుకోల్ గైకొనెన్;
దానం జేసి మదిం గుమారి లెడు సీతాదేవి నూరార్ప నా
స్థానిన్ వీడ్కొని వాసవేశ్మమునకున్ ధాత్రీవిభుం డేఁగెడిన్. ౭

ప్రస్తావన ముగిసినది. [అని నిష్క్రమింతురు.

# ప్ర థ మాం క ము.

---

[అంతట కూర్చున్నవారుగా రాముఁడును సీతయుఁ బ్రవేశింతురు.]

రాముఁడు.—దేవి, పోఁఅడిల్లము; ఆ పెద్దలు తమ యిచ్ఛచేత మనలను విడిచి పోవ శక్తులుగారు.

తే. అయినఁగాని, నిత్యమా వనుస్థాన మన్న,
వఱలనీయదు స్వాతంత్ర్యవర్తనమును.
అడుగడుగునను బ్రత్యవాయములచేత
నాహితాగ్నుల గార్హస్థ్య మరిది గాదె! ౧

సీత.—ఎఱుఁగుదును ఆర్యపుత్త్రుఁడా. అయినను బంధుజనులతోడి యెడబాపు సంతాపమును గలిగించును.

రాము.—అది యట్లే. హృదయమర్మభేదకములుగావా యీ సంసారభోగములు? వీనిపై రోఁతగొని యెల్ల కోర్కులను వదలి జ్ఞానులు అరణ్యములో విశ్రమింతురు.

కంచుకి.—[ప్రవేశించి] రామభద్రా. [అని యర్ధోక్తిలో జంకి] మహారాజా,

రాము.—[చిఱునవ్వుతో] ఆర్యా, నిక్కముగా నాయనగారిపరిజనమునకు నన్నుఁ గూర్చి రామభద్ర అను నుపచారమే శోభించును. కావున అలవాటుప్రకారము పలుకుము.

కంచుకి.—దేవా, ఋశ్యశృంగాశ్రమమునుండి అష్టావక్రులవారు వచ్చియున్నారు.

సీత.—విలంబ మేల?

రాము.—త్వరగా వారిని ప్రవేశపెట్టుము.

[కంచుకి నిష్క్రమించును.

అష్టావక్రుఁడు.—[ప్రవేశించి] మీకు శుభము.

రాము.—అభివాదనము చేయుచున్నాను. ఇటఁ గూర్చుండుఁడు.

సీత.—మ్రొక్కెదను మీకు. గురుజనుల కెల్లరకును శాంతమ్మకును కుశలమా?

రాము.—మాబావగారు ఋశ్యశృంగభగవానులవారును మాయక్క శాంతమ్మయును నిర్విఘ్నముగా సోమపానము గావించినారా?

సీత.—మమ్ము తలంచుకొందురా?

అష్టా.—[కూర్చుండి] అట్లే; దేవీ, వసిష్ఠభగవానులవారు నీ కిట్లు చెప్పి పంపినారు:—

తే. నిన్ను విశ్వంభరాదేవి కన్నతల్లి,
ధాత కైనయా జనకరాజు తండ్రి నీకు,
ఏవృపులకులగురువుల మినుఁడు నేను,
వారికోడల వైతి మాపట్టి, నీవు. ౨

నీకు ఇంతకు మించి యేమి యాశీర్వదింతుము ! కేవలము వీరప్రసవవు అగుదువు గాక !

రాము.—దేవి, మనము అనుగ్రహింపఁబడితిమి.

తే. అర్థముల నెందుఁ బూని వాక్కు లనుగమించు
లౌక్యులగు సాధువులకు వాలాయముగను,
వాక్కు వెంబడి నర్థంబు పఱచి వచ్చు
నాద్యు లయినట్టి పరమమహర్షులకును. 3

అష్టా.—అరుంధతీభగవతియు శాంతాదేవియు ఈ మాట నీకు మాటిమాటికి చెప్పి పంపినారు.—సీతాదేవికి వేవిళ్లు ఏమైనఁ గలిగనేని దానిని నీవు అవశ్యముగా వెంటనే సంపాదింపవలయు నని.

రాము.—ప్రేయసి చెప్పనేని, జరుపఁగలవాఁడను.

అష్టా.—దేవీ, నీకు నీయాఁడుబిడ్డభర్త ఋశ్యశృంగులవారును ఇట్లు సందేశించినారు:—"అమ్మాయీ, నిండు చేఁకటిలోనున్నావని నిన్ను రప్పింప మైతిమి, అబ్బాయిని రామభద్రునికూడ నీకు వినోదముకై నీయొద్దనే నిలిపితిమి; మఱి పుత్రపూర్ణమైన యొడితోడి నిన్ను అయుష్మతిని చూడఁగలము." అని.

రాము.—[ఔత్సుక్యముతోను చిఱునగవుతోను] అట్లే అగుఁగాక. వసిష్ఠభగవానులవారు నాకేమియు నాజ్ఞప్తి నొసంగలేదా?

అష్టా.—ఒసంగినారు; వినుము.

తే. అల్లునిమఖంబు సంకెల యయ్యె మాకు,
క్షీరకంఠుఁడ, వేలెదుదారిక్రొత్త;
ప్రజలరంజింపఁ దివురు మెప్పాట నైన;
దాన నగుకీర్తియే మేలిధనము మీకు. ర

రాము.—భగవానులు మైత్రావరుణివారు ఆదేశించినట్లు చేసెదను !

తే అర్మిలినిగాని, దయఁగాని, హాయిఁగాని,
అది యి దన నేల, జానకి నైనఁ గాని,
ప్రజల యనురంజనమునకై వదలునాకు
హృదయమునఁ గల్గ దిసుమంత యేని వంత. ౫

సీత.—అందువలననే ఆర్యపుత్త్రుఁడు రఘువంశధురంధరుఁడు.

రామ.—ఎవరోయి అక్కడ? అష్టావక్రులను విశ్రమింపఁ జేయవలసినది.

అష్టా.—[లేచి పరిక్రమించి] అహో! కుమార లక్ష్మణుఁడు వచ్చినాఁడు!

[అని నిష్క్రమించును.

లక్ష్మణుఁడు.—[ప్రవేశించి] జయ మార్యునికి. ఆర్యా, ఆ ముచ్చి అర్జునుఁడు మనము నియమించిన ప్రకారము అన్నయ్యచరిత్రమును ఈ వీథిలో చిత్రించినాఁడు. దానిని అన్నయ్య వచ్చి చూడవలయును.

రామ.—వత్సా, ఎఱుఁగుదువోయి వగఁగూరుచున్నదేవిని వినోదపెట్టుటకు; చరిత్రము ఎంతవఱకు చిత్రింపఁబడినది?

లక్ష్మ.—వదినెగారి వహ్నివిశుద్ధివఱకు.

రామ.—[ఓదార్చుటగా]

తే. జన్మపరిపూత కీమఖిత్మాతనయకుఁ
బావనాంతరములచేతఁ బనియు నేమి?
హుతవహాంబును బుణ్యతీర్థోదకంబు
నన్యములచేత శుద్ధి కర్హంబు లగునె! ౬

దేవీ, దేవయజనసంభూతురాలా, మన్నింపుము. ఇది నీకు యావజ్జీవిత మైనజనవాదము!

శా. కిట్టా! లోకులు రంజనీయులు కులోత్కృష్టాఘ్యలౌ వారికిన్!
జెట్టం బల్కితి దాన నీదెస హాతౌచిత్యంబె నేఁ గూళనై;
పెట్టంబోలునుగాక మూర్ధమున సంప్రీతిన్ నిసర్గార్హతన్,
మెట్టంజెల్లునె పాదఘాతపటిమన్ మేల్తానియీన్పుప్పముల్! ౭

సీత.—ఆర్యపుత్త్రా, మఱి నీచరిత్రమును చూతము.

[లేచి పరిక్రమింతురు.

లక్ష్మ.—ఇదె యాచిత్తరువు.

సీత.—[నిర్వర్ణించి] ఎవరు వీరు? మింట ఎడతెంపులేక నిలిచియున్నారు! ఆర్యపుత్త్రుని స్తుతించుచున్నట్లగపడుచున్నారు?

లక్ష్మ.—ఇవి అల్లజృంభకాస్త్రములు సరహస్యములు, భృశాశ్వభగవంతునివలననుండి కౌశికఋషిని—అనగా—విశ్వమునకు మిత్రమైన విశ్వామిత్రులవారిని జేరినవి. వారిచేత అన్నయ్యకు ప్రసాదింపఁబడినవి.

రామ.—నమస్కరింపుము దేవి, దివ్యాస్త్రములకు.

ఆ. బ్రహ్మహితముకొఱకు బ్రహ్మాదులాద్యులు
వేలు వర్షములు తపించి గురులు
ఆత్మతేజములనె యస్త్రములుగ వీనిఁ
బటుతపోమయములఁ బడసినారు. ౮

సీత.—వీనికి నమస్కారము.

రామ.—తప్పకుండ నివి నీ ప్రసూతిని సేవించును.

సీత.—మహాప్రసాదము.

లక్ష్మ.—ఇది మిథిలావృత్తాంతము.

సీత.—ఆహా! విచ్చుచున్న నల్లగలువవలె చామనైనచాయతోడి నున్నని చక్కని బల్లిదంపుదేహసౌభాగ్యముతో అవలీలగా విఱిచిన ముక్కంటివింటితో ముద్దు తోడవైన కూఁకటితో ఆర్యపుత్త్రుఁడు ఇదె ఆలిఖితుఁడు. ఇదె ఆర్యపుత్త్రుని యాసౌమ్య సౌందర్యలక్ష్మిని మానాయన ఆశ్చర్యపడుచు తెప్పవాల్పక తేఱిచూచుచున్నాఁడు!

లక్ష్మ.—ఇదిగో చూడవమ్మా ఇచ్చట.

తే. రమణ మీతండ్రిగా రాంగిరసునిపుత్త్రు
నీశతానందుఁ గులపురోహితుని, గూడి,
పూజ సల్పుచున్నారు ముదము వోలఁగ,
సాఁగు[illegible]కు వశిష్ఠాదిములకు

రామ.—ఇది చక్కఁగాఁ బొందియున్నది.

కం. జనకులకును రఘువులకును
నొనరిన వియ్యం బెవరికి నూన్పదు ముదముల్,
మునుకొని యిచ్చువతండున్
గొనునతఁడును నెందు గౌశికుండె స్వయముగాన్! ౧౦

సీత.—వీరుగో వీరు అప్పుడే గోదానమంగళమయిన నలువురు భ్రాతలు వివాహదీక్షను వహించినవారు. ఆహా! ఆతావుననే ఆ సమయముననే ఇపుడు ఉన్నానని తలంచుచున్నాను!

రామ.—అట్లే.

ఉ. వాసిగ గౌతమార్పితము బద్ధమనోరమకంకణాంకమై
భాసురమూర్తిఁ గొన్న పెనుఁబండువు నాఁగను నీదు కేలు దా
నేసమయాన నన్నిది రహిం బ్రమదాంబుధి నోలలార్చెనో
యాసమయం బిదే యనుచు నాత్మను మోహము గూరెడిన్ సఖీ. ౧౧

లక్ష్మ.—ఈమె పెదవదినెగారవు నీవే. ఈమె చిన్నవదినె మాండవి. ఇదె వధువు శ్రుతకీర్తి.

సీత.—వత్సా, ఈ యింకొకతె ఎవరు?

లక్ష్మ.—[సలజ్జస్మితముతో, స్వగతము] ఆర్య ఊర్మిళనుగూర్చి యడుగుచున్నది. కానీ, ఈమెను వేఱువిషయమునకు మరల్చెదను [ప్రకాశము] వదినెగారు చూడవలయుం. ఇది చూడఁదగినది. మఱి వీఁడుగో ఈయన పరశురామభగవానుఁడు.

సీత.—భయ మగు చున్నది!

రామ.—ఋషీ, నమస్కారము నీకు.

లక్ష్మ.—అన్నయ్యా, చూడుచూడు ఈయన నిచేత [అని అర్ధోక్తముతో]

రామ.—[ఆక్షేపముతో] వత్సా, చూడవలసినవి పెక్కుగా నున్నవి. మఱియొకటి చూపుము.

సీత.—[గౌరవముతో నిర్వర్ణించి] లెస్సగా శోభిల్లుచున్నాఁడు ఆర్యపుత్త్రుఁడు ఈ వినయమాహాత్మ్యముచేత.

లక్ష్మ.—ఇదె మనము అయోధ్యం జేరితిమి.

రామ.—[కన్నీళ్లతో] స్మరించుచున్నాను! అకటా స్మరించుచున్నాను!

కం. నాయనగా రుండఁగ, జా
యాయుక్తుల మైన క్రొత్త, న మ్మలు మనలన్
బాయక యోముచునుండిన
యాయహములు మనకుఁ దమ్ముఁడా పోయెం గదా. ౧౨

అప్పుడు ఈ జానకియు—

మ. అలఁతుల్ వేఱులు నైన పల్కుకుళముల్ ప్రాంతోన్మిషన్మంజుకుం
తలముల్ ముగ్ధవిలోకముల్ వెలయు వక్త్రం బొప్ప బాల్యంబునన్
విలసజ్జ్యోత్స్నములై విలాసఘనులై పెన్నాలితీమంధురుల్
గల యల్పాంగములన్ మదంబలకుఁ దాఁ గావించెఁ గన్వేఁదురన్. ౧౩

లక్ష్మ.—ఇది మంథర.

రామ.—[ఉత్తరము చెప్పక అవలం జూపుచు]

తే. దేవి, యీగారతరువుపై దృష్టి యిడుము;
శృంగిబేరమ్మునను దీనిక్రిందఁ గాదె
మనకుఁ జేకూఱె భవ్యసమాగమంబు
నెయ్యుఁడై నట్టి బోయమన్నినితోడ. ౧౪

లక్ష్మ.—[సశ్వాస, స్వగతము] అహో! నడిమియమ్మ వృత్తాంతమును అన్నయ్య అణఁచి వైచినాఁడు!

సీత.—ఇది జడలుముడిచిన వృత్తాంతము.

లక్ష్మ.—

తే. పుత్త్రులకు నిజలక్ష్మిని బూన్చి పేని
వృద్ధు లిక్ష్వాకువులు ధరియించినారొ,
అన్న ధరియించె లేఁబ్రాయమందె దాని
గనము కష్టంబు నారణ్యకవ్రతంబు. ౧౫

సీత.—ఇది ప్రసన్నపుణ్యోదక భాగీరథీభగవతి.

రాము.—రఘువంశదేవతా, నీకు నమస్కారము.

చం. సగరమఖాశ్వముల్ వెదక జన్లెడగా భువిఁ ద్రవ్వి కాపిల
ప్రగుణమహాస్సుచేఁ గినుక భస్మితులౌ దనుతాతతండ్రులన్
అగణిత దేహపాతుఁ డనయంబు తపించి భగీరథుండు మున్
భగవతి నీజలంపుఁజలువన్ దివిఁ జేరిచె నెట్టకేలకున్. ౧౬

ఆతల్లీ, నీవు కోడలుసీతయందు అరుంధతివలెనే శివమును అను ధ్యానింతువుగాక.

లక్ష్మ.—ఇది భరద్వాజులవారు తెలిపినవి చిత్రకూటమార్గమందు యమునాతీరంబున శ్యామ మను పేరి మఱ్ఱిచెట్టు.

[రాముఁడు మక్కువతోఁ గాంచును.

సీత.—ఆర్యపుత్త్రా, ఈ ప్రదేశమును స్మరింతువా?

రాము.—ప్రేయసి, ఎట్లు మఱతును?

చం. చరణగతాధ్వఖేదమున జం పయి నల్గియు సుందరంబులై
పరిమృదితాబ్జనాళకనిభంబుగ వాడినయంగకంబులన్,
విరియనిదట్టకౌఁగిళులవేదుఱె సంవహనంబు గాఁగ, నా
యురమునఁ జూర్చి సుప్తిసుఖ మొందవె యిందుఁ బయోరుహాననా.

లక్ష్మ.—ఇదె వింధ్యారణ్యంపు మొగాళమున విరాధునితోడి యొరయిక.

సీత.—ఇఁకెందులకులే! ఆర్యపుత్త్రుఁడు తనచేత విసనకఱ్ఱను నాకు గొడుగుగాఁ బట్టి యెండను తొలఁగించిన నా దక్షిణారణ్య ప్రవేశారంభమును చూచెదనుగాక.

రామ.—

మ. తిలకింపన్ రవిరంబు లీగిరికి నీ ప్రస్రవణాఖ్య ఘనా
ములు వైఖానసవాస స్థితతలముల్; సుస్థంటి ఖండము గుటీ
నిలయముల్ శాంతులు నాతిథేయపరముల్ నీవారముష్ట్యోదనుల్
పొలుపొందన్ గృహమేధు; లానెమఱన్ మున్స్థాత్మ యాతాపులన్?

లక్ష్మ.—ఇదె జనస్థాన మధ్యంబున దట్టంపుఁ జెట్టుల పరంపరచే నిరలుకొను చున్న నల్లని చెంగటియడవుల యొత్తుడతోడ గోదావరి గుహా ముఖంబుల మ్రోగించు చుండ అనారతము వృష్టిం గ్రక్కుగూడ మేఘములచే కమ్ముంగాఱ్కొనుచున్నది ప్రస్రవణనామపర్వతము.

రామ.—

ఉ. ఆదినముల్ స్మరింతువె శుభాంగిరో, యాగిరియందు లక్ష్మణుం
డాదట సేవ సేయఁగను హాయిగ నుంటిమి మేదినంబులన్?
గోదను కొండచెంత ననగుంభితనీరము సంస్మరింతువే?
పైదలిరో, స్మరింతె తమపాంథములన్ మనవర్తనంబులన్? ౧౯

మఱియు,

ఉ. ఒక్కొక కేలఁ దన్మయత కోయనఁ గౌఁగిలి చిక్కఁ దిద్దుచున్
జెక్కును జెక్కు నేర్పడని చేరిక పెంపున మెల్లమెల్లఁగా
నొక్కక్రమంబుఁగల్గక యెదోయెదో యాదటఁ బల్కికొన్న హిన్
గ్రక్కున యామముల్ మన పరాకునఁబోఁ దుడిముట్టె రాత్రియే.

లక్ష్మ.—ఇది పంచవటి యందు శూర్పణఖ.

సీత.—హా! ఆర్యపుత్త్రా! ఇంతవట్టే నీదర్శనము!

రామ.—ప్రియా, వియోగమునకు వెఱచెదవు! చిత్తరు విది.

సీత.—ఏదైనను గానీ, దుర్జనము అసుఖమును కలిగించును.

రామ.—అయ్యో! ఇప్పుడు జరుగుచున్నదివోలె నాకు జనస్థాన వృత్తాంతము తోఁచుచున్నది!

లక్ష్మ.—ఇఁకను,

శా. ఆవృత్తం బిది, వైఁదిలేడిమిషచే నట్లాఖలుల్ రక్కసుల్
గావింపన్ దరికొల్పినట్టివెత సంక్షాళించినన్ బేర్చెడిన్;
తావే యార్యుఁడు వచ్చి శూన్యము జనస్థానంబుఁ గన్నార్తికిన్
గ్రావంబుల్ సయితంబు నేడ్చు మగరాగర్భంబునున్ వ్రయ్యలౌ.

సీత.—[అశ్రుపూరలతో, ఆత్మగతము] అహో! దినకరకులానందనుఁడు నాకారణంబున నింత ఖేదముగా తల్లడిల్లినాఁడు!

లక్ష్మ.—[రాముని గాంచి, సాస్రము] అన్నయ్యా, ఏమియిది?

మ. ఘన నీబాష్పభరంబు హా! తెగిన ముక్తాహారపుంజం బనన్
వానలన్ ధారలుగాఁగ నుట్టిపడి బిందుల్గాఁగ దుర్వ్రయ్యుచుం;
ఘన మోహాంత్రు భరప్రక్షిప్త హృదయాధ్మానంబు నానాపుటా
ఘటకంపంబున నీ సహించినను సుద్దామంబు నావేగముల్. ౨౨

రాము.—వత్సా,

తే. అపుడు ప్రియఁ బాయ నైన యాయార్తివహ్ని
యెమువె పగతీర్పుకొనునాప నోర్వ నయ్యె,
మరల నిపుడు నికర్వమై మనసు నేర్పు
వెండి నెలవాలు నెవగుట్టుఁ బుండువోలె. ౨౩

సీత.—అయ్యయో అయ్యయో! మితిమీఱిన వియోగ దుఃఖముచేత ఇపుడు ఆర్యపుత్త్రశూన్య నై ఒంటిగా నున్నానని తోఁచుచున్నది.

లక్ష్మ.—[స్వగతము] వేఱువిషయముం జూపెదను. [చిత్తరువుం గాంచి, ప్రకాశము] ఇదిగో ఇట మన్వంతర పురాణగృధ్రరాజు మహానుభావుఁడు నాయనజటాయుని చరిత్రపరాక్రమోదాహరణము.

సీత.—హా నాయనా! నిరూఢము గావించితివి నీయపత్యస్నేహమును.

రాము.—హా నాయనా! కాశ్యపుఁడా, విహంగరాజా, నీవంటి మహాతీర్థము సాధువు ఇంకొకఁ డుండునా!

లక్ష్మ.—ఇదె యల్ల దనుకబంధనివాసము, జనస్థానమునకు పడమట కుంజవంతమను పేరి దండకారణ్యభాగము. ఇదిగో ఋశ్యమూకపర్వతమున మతంగముని యాశ్రమస్థానము. ఈమె శ్రమణయను సిద్ధశబరి. ఇది పంప యను పేరి యాపద్మాకరము.

సీత.—ఇక్కడఁగదా ఆర్యపుత్త్రుఁడు అమర్ష ధైర్యములు మాని వావిచ్చి బిగ్గర రోదనములు గావించెను!

రాము.—ఈ సరస్సు రమణీయము. ఇందు,

చ. మదకలమల్లికాతతులు మాటికి *ఱెక్కలఁ గొట్టి నెట్టుటన్
గదలుచు నూఁగుచున్న ఘననాళము లొప్పెడు పుండరీకముల్
వడి వదులన్ బయల్పడు భ్రభాభరితోత్పలషండ మండితా
స్పదములఁ గంటి బాష్పపరిపాత సముద్గమ నాంతరంబులన్. ౨౪

లక్ష్మ.—ఈయన ఆ మహాత్ముఁడు హనుమంతుఁడు!

సీత.—ఈయన చిరనిర్విణ్ణమైన జీవలోకమును సముద్ధరించిన మహోపకారి మహాభాగుఁడు మారుతి.

రాము.—

తే. అహహా! యీమహాత్ముఁ డల్లమహాభుజుండు
అంజనాదేవినోముల యఱిదిపంట!
ఎవనిబీరంబు మనకును భువనములకు
గోషు మున్నీరు దాఁటించు నోడ యయ్యె! ౨౫

సీత.—వత్సా, పూచినకదంబములమీఁద నెమళ్లు తాండవించుచున్న యీ కొండ పేరేమి? ఇచట చెట్టుక్రింద అనుభావ సౌభాగ్య మాత్రావశిష్టమై ధూసర మైన శ్రీతోడి యార్యపుత్త్రుని మూర్ఛితుని నీవు పట్టుకొని వాపిచ్చి యేడ్చుచున్నట్లు చిత్తరువు గానిపించుచున్నది.

లక్ష్మ.—

ఉ. ఔ నిది మాల్యవత్కుధర మజ్జనసౌరభ వాహి యెంతయున్
దేనిశిరంబునం బొదివె నీలము నిద్దము నైన క్రొమ్మొగుల్;
* [దీనను నన్న—

రాము.—

ఏడు విడు, దిట్టఁడఁ] గాను వినంగ నే నిఁకన్;
జానకితో వియోగ మది సంభవ మైనది వోలె వెండియున్! ౨౬

లక్ష్మ.—ఇటుపైని అన్నయ్యవియు మహావీరులైన యీ వానరరాక్షసులవియు ఉత్తరోత్తరములు కర్మాద్భుతములు. మఱి వదినె అలసిపోయినది. కావున విశ్రమించుఁగాక యని విన్నవించెదను.

సీత.—ఆర్యపుత్త్రా, ఈ చిత్తరువుం జూడఁగా నాకొక కోరిక పొడముచున్నది, విన్నవించుకొనియెద.

రాము.—ఆజ్ఞాపింపుము ప్రేయసీ.

సీత.—వెండియుం, ప్రసన్నగంభీరములైన వనవీథులయందు విహరింపను, భాగీరథీదేవియందు పవిత్రశీతల జలంబుల నాడనుం, గోరుచున్నాను.

రాము.—వత్సా, గర్భదోహదమును వెంటనే నెఱవేర్పవలసిన దని యిప్పుడే గురువులు సందేశము పంపినారు. కావున, కుదుపు గలిగింపని తేరిని తెప్పింపుము.

---

* పాఠాంతరము.—[రాము.—మానుముమాను తమ్ముఁడ సమర్థుఁడఁ]

సీత.—అజ్జవుత్త, [illegible]

రాము.—[illegible] ఇదియుం జెప్పవలయునా?

సీత.—[illegible] నాకు సంతోషము.

లక్ష్మ.—అన్నగారి యాజ్ఞ నెఱవేర్చెదను. [అని నిష్క్రమించును.

రాము.—ప్రియురాలా, ఈ [illegible] కూర్చుందుము.

సీత.—అజ్జ [illegible]. ఖేదజనిత నిద్ర నన్ను అపహరించుచున్నది.

రాము.—అట్లయిన నన్ను ఎడసేక పట్టుకొని వెంట రమ్ము.

తే. ప్రమథనస్స్వేద కణబంధురము భుజమ్ముఁ
జేర్చు [illegible]
ఐందవ మయూఖ చుంబిత స్యందమాన
చంద్రమణి హార విభ్రమ [illegible] నబల. ౨౭

[ఆర్లి చేయించి, ఆనందముతో] ప్రియా, ఇదేమి?

తే. సుఖమొ దుఃఖమొ మెలఁకువో సుప్తియొక్కొ
విసము సొక్కొటో మదమొ భావింపరాక
నీవు తాఁకినమాత్ర నింద్రియముల మోహ
మొకవికృతి నాదు చేతన నూఁపు నుఱుపు. ౨౮

సీత.—తమ ప్రసాదము స్థిరము. అంతకన్న మఱేమున్నది?

రాము.—

ఆ. మ్లానజీవిత ప్రసూన సంజీవులు
తృప్తిదములు మోహ తేంద్రియములు
నీ సుభాషణములు నీరజాతేక్షణా,
శ్రవణసుధలు హృద్రసాయనములు. ౨౯

సీత.—ప్రియంవదుఁడా, పరుండెదను. [అని శయనింప కలయం బరికించును.]

రాము.—ప్రియా, ఏమి వెదకెదవు?

తే. పెండ్లి సమయమునుండియు వీటఁ గాట
బాల్యమునయందుఁ బిదప జవ్వనమునందు
స్వాపకర మన్యచే ననుపాశ్రితంబు
లలన యిదె రాముభుజము తలాపి నీకు. ౩౦

సీత.—[నిద్రలో నటించుచు] ఆర్యపుత్త్రుఁడా, యెక్కడ యుంటివి, యిక్కడనే యుండు.

రామ.—ఏమి! ప్రియురాలు నాయందుఁ గల ప్రేమతో నిద్ర చెందినది! [కాంచి, స్నేహముతో]

ఉ. ఈమె లక్ష్మి గేహమునకు, కీమె నేత్రయుగమ్ముకు సుధాంజనం,
ఈమెకమేని తాఁకుడు శరీరమునన్ బహుళంబగు చందనద్రవం,
ఈమెకబాహువల్లి మెడ హారము మౌక్తికమై సుశీతమం,
దీనికి లేదె గాదు ప్రియమ్! విరహంబు గాని యసహ్యయోగమే.3౧

ప్రతీహారి.—[ప్రవేశించి] దేవా, వచ్చెను.

రామ.—ఆ! ఏమి వచ్చెను? ఎవరు?

ప్రతీ.—ఏలినవారి యాసన్న సంచారకుడు దుర్ముఖుఁడు!

రామ.—[స్వగతము] అంతఃపురచారి దుర్ముఖుఁడు! వానిని నేను పౌరజానపదులపై వేగుండై రమ్మని పంపితిని. [ప్రకాశము] రానిమ్మను.

[ప్రతీహారి నిష్క్రమించును.

దుర్ముఖుఁడు.—[ప్రవేశించి] [స్వగతము] హా! సీతాదేవిమీద యిటువంటి తలచరాని జనాపవాదాన్ని ఏలాగు దేవరవారికి విన్నవించెదను? మఱేమిగతి? ఈ నిర్భాగ్యుడికి ఇది కొలువుగదా.

సీత.—[పలవరించును] హా! ఆర్యపుత్త్రుఁడా, ఎట నున్నావు? ఎట నున్నావు?

రామ.—ఇదే ఆది దేవికి కంపర మెత్తించినట్టిది, చిత్రదర్శనముచేఁ గలిగిన విరహభావన, ఇప్పుడు కలలో భయముగొల్పుచున్నది. [స్నేహముతో పరామర్శించుచు]

శా. ఏ దద్వైతము సౌఖ్య దుఃఖములయం, దెం దూఱడిల్లుఁగా మనం,
బే దా సర్వదశానుగామి, జర నెం దేరక్తియుఁగా డిందదో,
ఏ దొం గాలము సాగ సాగఁ ద్రపవో నింపైన నెయ్యంపుఁబం,
డాదాంపత్యపు భద్రసార మదియే యాశింతు రె ట్లేనియుఁగా.

దుర్ము.—[సమీపించి] జయించు దేవా.

రామ.—తెలిసినదానిని చెప్పుము.

దుర్ము.—దేవరవారిని పౌరజానపదులు పొగడుతున్నారు. ఏలాగంటే—"రామదేవుడు మమ్మల్ని దశరథమహారాజుని మరిపించినాడు" అని.

రామ.—ఇది స్తుతి. దోష మేదేని చెప్పుము, దానికి ప్రతివిధానము చేసెదను.

దుర్ము.—[కన్నీళ్లతో] దేవర వినవలెను; [చెవిలో] ఇట్లు ఇట్లు.

రాము.—ఆహాహా! అతి ఘోరముగా పడినది వచనదంభోళి!

దుర్ము.—దేవరా, ఊఱడిల్లుఁడీ;

రాము.—[ఊఱడిల్లి]

తే. అకట! సీతకు నొగినించియుంటునింప
నిప్పు దెచ్చి శోధించె సద్భుతోపాయములను,
వెండి మఱి యిప్పు హతవిధి విలసనమున
విస్తరిల్లిన పాలర్క విషమువోలె. 33

రాము.—మందభాగ్యుఁడ నిందల కేమి చేయుదును! [విమర్శించుకొని సకరుణముగా] కాక మఱేమి?

కం. ఏకార్యముచే నైనను
లోకారాధనమె సాధులోకవ్రత మౌ
ఆకరణి నను జనుల నిడ
నీకొని మాయయ్య దానినే కద నెఱపెన్. 3౪

ఇప్పుడే గదా వసిష్ఠభగవంతులు సందేశించినారు. మఱియును;—

కం. ఏసాధుశుద్ధచరితకు
నాసావిత్రనృపు లగ్ర్య లాస్పదమౌ, యట్టి
నాసంబంధంబున సడి
డాసిన వ న్నిస్సిరో! యధన్యునిఁ గాల్పన్! 3౫

హా! దేవీ, యజ్ఞభూమి సంజాతా! హా! స్వజన్మానుగ్రహ పవిత్రిత విశ్వంభరా! హా! నిమిజనకవంశనందినీ! హా! పావకవసిష్ఠారుంధతీస్తుతశీలశాలిని! రామమయజీవితా! హా! మహారణ్యావాసప్రియసఖీ! హా! ప్రియమితభాషిణీ! ఏమి యిది! ఇట్టిదానికి నీకు ఇట్టి యీపరిణామము!

తే. నీవలన నెల్లలోకముల్ పావనములు,
నీవలన జనతోక్తి యపావనంబు,
నీవలన దిక్కు గలయది నిఖిలజగము,
నీవు దిక్కెందు లేక డిందెదవె యకట! 3౬

దుర్ముఖుఁడా, లక్ష్మణునితో చెప్పుము:—ఇదె నీ క్రొత్తరాజు రాముఁ డాజ్ఞాపించుచున్నాఁడు. [చెవిలో] ఇట్లు ఇట్లు.

దుర్ము — ఏమి! అగ్ని పరిశుద్ధురాలిని గర్భంలో పవిత్రరఘుకుల సంతానంగల దాన్ని దేవిని దుర్జనుల దూరుచేత ఏలినవారు ఇప్పుడు ఇలాగ చేయదలచినారు !

రాము — అట్లనకు. పాపము శమించునుగాక; పౌరజానపదులు దుర్జను లెట్లగుదురు? చూడు.

తే. లోకులకు మాననీయ మిక్ష్వాకుకులము,
నింతకుఁ గతంబు విధిచేత నందుఁ గల్గె;
శుద్ధికాలంపు టద్భుతస్వర్గాజ్ఞనమును
విశ్వసించు నెవండు దవిష్ఠవర్తి! ౩౭

కావున, నీవు పొమ్ము.

దుర్ము — హా! దేవీ! [అని నిష్క్రమించును.

రాము — హా! కష్టా! అతి బీభత్సకర్ముఁడను క్రూరుఁడ నైతిని. ఎట్లన —

తే. పిన్నతనమునుండి పెంచిన ప్రియను దీనిఁ
గూర్మిచే వేఱు తలఁపును గొననిదాని
మృత్యువున కిచ్చుచున్నాఁడ మిషను నెరపి
గృహశకుంతిక నల సూనరియును బోలె. ౩౮

కావున, అస్పృశ్యుఁడను పాతకిని ఏల దేవిని మైల చేయుదును? [సీతశిరమును స్వయముగా ఎత్తి బాహువును లాగికొనుచు,]

కం. నేరనిముగుదా! విడు మవి
చారముగ, నపూర్వకర్మచండాలు ననున్;
చేరితివి చందనం బని
ఘోరవిపాకమును గాలకూటద్రుమమున్! ౩౯

అయ్యో! తలక్రిందైనది యిప్పుడు నాకు జీవలోకము! ముగిసిపోయినది రామునికి జీవిత ప్రయోజనము! ఇట్టి పల్ల కాదు ఇప్పుడు జగత్తు! నిస్సారము సంసారము! కష్టప్రాయము శరీరము! కాకేమి?

ఆ. గోడు గుడుపుకొఱకె కూర్చెఁ జైతన్యంబు
రాము మేనఁ దామరసభవుండు ;
నిలువరించి మర్మముల ప్రక్కలించుచుఁ
గూళయుసురు వజ్రకీల మయ్యె. ౪౦

హా! అమ్మా యరుంధతీ! హా! భగవంతులారా వసిష్ఠవిశ్వామిత్రులారా! హా! దేవీ భూతధాత్రీ! హా మామా జనకుఁడా! హా నాయనా! హా తల్లులారా! హా పరమోపకారీ లంకాపతీ విభీషణుఁడా, హా ప్రియసఖుఁడా సుగ్రీవుఁడా! హా సౌమ్యుఁడా అంజనేయుఁడా! హా సఖీ త్రిజటా! కొల్లఁబోయితిరి అవమానితులైతిరి రామహతకునిచేత! అట్లు గాదేని, వారిం బేర్కొన నే నెవ్వఁడ నిప్పుడు!

ఆ. అట్లనంగ నేల యన, దురాత్ముండను
జేసినట్టిపాపము చెఱుచువాఁడ
నేను బేరుకొనుటయే యానుమహాత్ముల
నఘము సోఁకు టంచు నాత్మఁ దలఁతు ౪౧

ఎట్టివాఁడను నేను!

తే. ఎవని విశ్వాసమున బ్రౌలి నిదురఁ గూరి
నెలవదసు నెఱిగర్భంపు ప్రేఁగుదానిఁ
బ్రియగృహిణిని గృహలక్ష్మిని గృప దొఱంగి
బలిగఁ బిశితాశులకుఁ బాఱవైచినాఁడ. ౪౨

(సీతపాదములను శిరమున నుంచుకొని) దేవి, ఇది రామునిశిరముతో నీ పాదపంకజములకు కడసారి తాఁకుడు. [ఏడ్చును.

[నేపథ్యమున]

అబ్రహ్మణ్య మబ్రహ్మణ్యము!

రాము.—ఎవ రక్కడ! ఇదేమో తెలిసికొమ్ము.

[వెండియుం నేపథ్యమున]

కం. యమునాతీరమహర్షులు
తమి నుగ్రవ్రతులు నిన్నుఁ దఱిసి శరణ్యుం
గుమిగై కూయిడెదరు లవ
ణమహాసురుఁ డిడెడు యాతనలఁ బడలేమిఁక. ౪౩

రాము.—ఇప్పుడును రాక్షసబాధయా! ఇదె ఈ దురాత్ముని కుంభీనసీపుత్త్రుని తెగటార్ప నని శత్రుఘ్నునిఁ బంపెదను. [కొన్ని యడుగులు నడిచి, మరల వెనుకకు వచ్చి] హా దేవీ! విడుగుడువా! భగవతి వసుంధరా,

తే. జనకరఘుగోత్ర కృత్స్నశోభనము నెవతెఁ
బుణ్యశీలను జన్నంపుఁబుణ్యసీత

నీవ కంటివా యాసాధ్వి నీదుపట్టి
సీత రక్షింపు మప్పగించితిని నీకు. ౪౪

[అని నిష్క్రమించును.

సీత.—హా సౌమ్యుఁడా ఆర్యపుత్త్రుఁడా, ఎక్కడ నున్నావు? [తటాలున లేచి] అయ్యయ్యో! దుస్స్వప్నముచేత వంచితనై నేను ఆర్యపుత్త్రుఁడు లేనిదానినిగా నన్నుఁ దలఁచుకొంటిని. [చూచి] అయ్యయో! అయ్యయో! నన్ను నిద్రితను ఒంటిగా విడిచి ఆర్యపుత్త్రుఁడు పోయినాఁడు! కానీ, ఆయనం గన్నప్పుడు నేను నావశమన యేని ఆయనపై కోపించెదను. ఎవ రక్కడ పరిజనుఁడు?

దుర్ము.—[ప్రవేశించి] దేవీ, లక్ష్మణకుమారుడు విన్నపం చేస్తున్నాఁడు. "తేరు సిద్ధముగా నున్నది. దేవిగారు ఎక్కుదురుగాక" అని.

సీత.—ఇదె ఎక్కుచున్నాను. [అని లేచి పరిక్రమించి] ఆదరుచున్నదే నా గర్భభారము! కావున మెల్లఁగా నడవుము.

దుర్ము.—ఇటు ఇటు దేవి.

సీత.—నమస్కారము రఘుకుల దేవతలకు.

[అని అందఱు నిష్క్రమింతురు.

చిత్రదర్శన మనెడి ప్రథమాంకము
ముగిసినది.

---

విష్కంభము.

[నేపథ్యమున]

తపోధనురాలికి స్వాగతము.

[అధ్వగవేష] తాపసి.—[ప్రవేశించి] అహో వనదేవత యీమెఫలపుష్ప పల్లవార్ఘ్యముతో నన్ను సేవించుచున్నది!

వనదేవత.—[ప్రవేశించి, అర్ఘ్యము చల్లి]

ఉ. ఈవని మీకు భోగ్యము యథేచ్ఛముగా, సుదినంబు నాకు నేఁ,
డీవహి సాధుసంగతికి నెంతటిపుణ్యము చేసికొంటి మున్ ;
మీవశ మిందు వృక్షములనీడలు నీళ్లుఁ దపోర్హ్యభోజనం
బేవో, ఫలంబో, వేరో, యవి యెల్లను; బెల్లు వచింపనేటికిన్? ౧

తాపసి.—ఇందు చెప్పవలసిన దేమున్నది?

చం. చెలఁగుఁ బ్రియంకరంబె యయి చేత, వచస్సు వినీతిమంజువే,
తలఁచున దెల్ల భవ్యమ, యుదస్తవిగర్వము సంస్తవంబునున్,
కలఁగక క్రొత్తలోఁ బిదపఁ గ్రాలు రసం బొకటే విధంబుగా,
వెలయు నిసర్గశుద్ధ మతివిశ్వము సాధురహస్య మెప్పుడున్. 2

[ఇరువురుం గూర్చుందురు.

వస.—మహనీయను నిన్ను ఎవరినింగా తెలిసికొందును?

తాప.—నేను ఆత్రేయిని.

వస.—అమ్మా ఆత్రేయీ, ఎటనుండి యిటకు రాక? మఱి ఈ దండకారణ్య ప్రచారము ఎందు నిమిత్తము?

ఆత్రేయి.—

తే. ఈ ప్రదేశంబునం దగస్త్యప్రముఖులు
పలువు రుద్గీథవేదులు ప్రతివసింత్రు
వీరివలనను నిగమాంతవిద్య నేర్వ
వచ్చితి నిటకు వాల్మీకివసతినుండి. 3

వస.—ఇతరమునులుకూడ ఆయననే ప్రాచేతసుని పురాణబ్రహ్మవాదిని ఋషిని బ్రహ్మపారాయణమునకై శుశ్రూషించుచుండఁగా, అమ్మగారేల యీ చిరప్రవాస క్లేశమునకు పాలుపడుచున్నారు?

ఆత్రేయి.—అచ్చట అధ్యయనమునకు గొప్పవిఘ్నము కలిగినందున ఈ దీర్ఘ ప్రవాసము నంగీకరించితిని.

వస.—ఎట్టి దావిఘ్నము?

ఆత్రేయి.—ఆ భగవంతునికి ఎవరో దేవత ఎల్లవిధములను అద్భుతమైన బాలకద్వయమును స్తన్యము విడిచినమాత్రపు వయస్సుదానిని తెచ్చి యిచ్చినది. అది ఋషులమాత్రమేగాక సకల చరాచర భూతములయం దంతస్తత్త్వములందు స్నేహము కొల్పుచున్నది.

వస.—వారి నామధేయములు ఎఱుకయా!

ఆత్రేయి.—ఆ దేవతయే వారికి కుశలవు లని పేరు చెప్పి వారి ప్రభావమును గూడ చెప్పినది.

వస.—ఎట్టి దా ప్రభావము!

ఆత్రేయి.—వారికి సరహస్యములు జృంభకాస్త్రములు జన్మసిద్ధములు అని.

వస.—ఆహా! ఏమి చిత్రము!

ఆత్రేయి.—వారిని వాల్మీకి భగవంతుఁడు దాదివని మొదలుకొని తానే పూనుకొని పెంచినాఁడు, రక్షించినాఁడు; చూడాకర్మయుం గావించి వేదము దక్క కడమ విద్యలను సావధానముగా చదివించినాఁడు; తర్వాత గర్భైకాదశ వర్షంబున క్షాత్రకల్పంబున వేదములను నేర్పినాఁడు; అతి ప్రదీప్తప్రజ్ఞామేధాశాలు లగు నాబాలురతో మాకొంట్లకు సహాధ్యయన యోగ్యత లేదు. ఏలన.—

చ. ఒసఁగును విద్యఁ బ్రాజ్ఞునకు నోగునకుం గురుఁ డొక్కరీతి నే;
ఒసఁగఁడ తాను మానుషుఁడ యొక్కనికేనియు నేర్పు నేరుపుం,
పొసఁగును దెల్వి నిర్వురకు భూరివిభేద; మ దెట్లటన్న చోఁ,
బొసఁగును నీడ యచ్ఛమణిఁ, బొందదు మృణ్మయ సంచయంబునం

వన.—ఇదా అయధ్యయనాంతరాయము?

ఆత్రేయి.—ఇంక నొకటి కలదు.

వన.—అ దేది?

ఆత్రేయి.—అనంతరము, ఆ బ్రహ్మర్షి ఒకప్పుడు మధ్యాహ్న సమయమున తమసానదికింబోయెను. అచట కలయికలో నున్న క్రౌంచదంపతులలో ఒకదానిని వేయుచుండిన వేటరిని గాంచినవాఁడై ఆకస్మికముగా స్ఫురించిన వాగ్దేవిని అసంకీర్ణను అనుష్టుప్ఛందస్సులో కుదుర్కొన్నదానిని ఇట్లు ఉచ్చరించెను:—

"ఓనిషాద, ప్రతిష్ఠ న్నీ। వొందుదే శాశ్వతాబ్దముల్
కాము మోహిత మేకంబుం। గ్రౌంచయుగ్మానఁ జంపుటం?" అని

వన.—చిత్రము! వేదముకంటె వేఱుగా క్రొత్తది ఛందస్సుల యవతారము!

ఆత్రేయి.—మఱి యాసమయానసే అట్లు శబ్దబ్రహ్మావిర్భావముం బొందిన యాభగవంతుని ఋషిని భూతభావనుఁడైన బ్రహ్మదేవుఁడు ఎదుటఁ దోఁచి ఇట్లు హెచ్చరించెను: "ఋషీ, వాగ్బ్రహ్మమందు ఎఱుకగలవాఁడ వైతివి. కావున, రామచరితమును వర్ణింపుము. నీ ప్రతిభాచక్షుస్సు ఆర్షమును అవ్యాహతజ్యోతియగును. మొదలికవి వైతివి." ఇట్లు వచించి అంతర్ధానము పొందెను. అనంతరము భగవంతుఁడు ప్రాచేతస మహర్షి మనుష్యులయందు మొదటిదైన యట్టి యాశబ్దబ్రహ్మ పరిణామమును రామాయణమును రచించెను.

వన.—ఆహా! సంసారము పాండితీ మండిత మయినది!

ఆత్రేయి.—అందువలనం బలికితిని అధ్యయనమునకు గొప్ప విఘ్నము వచ్చినదని.

వన.—సరిగానే యున్నది.

ఆత్రేయి.—కల్యాణీ, ఆయాసము తీఱినది. ఇప్పుడు అగస్త్యాశ్రమమునకు దారి చెప్పుము.

వన.—ఇటనుండి పంచవటివెంబడి యీ గోదావరీతటమునం బొమ్ము.

ఆత్రేయి.—[బాష్పములతో] ఇది యీ తపోవనమా ? పంచవటియా యిది. ఇది ఆ ప్రస్రవణ పర్వతమా? జనస్థానదేవత యైనవాసంతివా నీవు?

వాసంతి.—సర్వమును అట్లే.

ఆత్రేయి.—పట్టీ జానకీ !

తే. సకియ, యిదె నీదు ప్రియబంధుసమితి; దీని
ముచ్చటలె మా కుబుసు పుచ్చు మొదలికథలు ;
నామశేషను నిను నిది నాకుఁ దోఁచి
యిపు డొనర్చెను బ్రత్యక్షదృశ్యఁ బోలె. ౬

వాసంతి.—[భయముతో స్వగతము] ఏమి! నామశేష యన్నదే! [ప్రకాశము] ఆర్యా, ఏమి మహాపద సీతాదేవికి?

ఆత్రేయి.—మహాపదయే గాదు, అపవాదము కూడ. (చెవిలో) ఇట్లు ఇట్లు.

వాసంతి.—అహాహా! దారుణమయిన దైవనిర్ఘాతము. [మూర్ఛిల్లును.]

ఆత్రేయి.—కల్యాణీ, ఊఱడిల్లు మూఱడిల్లుము.

వాసంతి.—హా! ప్రియసఖీ, మహాభాగురాలా! నీ జన్మభాగ్యము ఇట్టిది ! రామభద్రా రామభద్రా ! ఇఁక నీతో నేమి? అమ్మా, ఆత్రేయీ ఆకాటిలో విడిచి లక్ష్మణుండు పోయినతర్వాత సీతాదేవి వృత్తాంతము ఏమో తెలియునా?

ఆత్రేయి.—తెలియదు, తెలియదు.

వాసంతి.—కట్టా ! అరుంధతీవసిష్ఠులు విచారించుకొనుచున్న రఘుకుటుంబమందు వృద్ధులు రాజులు జీవించియుండఁగా, ఇట్టిది యెట్లు సంభవించినది?

ఆత్రేయి.—అప్పుడు గురుజనులు ఋశ్యశృంగాశ్రమములో ఉండిరి. ఇప్పుడు ఆ పండ్రెండేండ్ల యజ్ఞము ముగిసినది. ఋశ్యశృంగుఁడు గురుజనమును పూజించి అంపకము గావించినాఁడు, అంతట అరుంధతీభగవతి 'కోడలు లేని యయోధ్యకు నేను పోను' అని పలికినది. రామునితల్లులును అట్లే నిశ్చయించుకొనిరి. అందులకు అనుగుణముగానే వసిష్ఠభగవానులు ఇట్లు అతిపరిశుద్ధముగా పలికిరి:—ఎట్లన— "వాల్మీకి తపోవనమునకుం బోయి అట వసింతము," అని.

వాసంతి.—మఱి యిప్పుడు ఆ రాజు ఏమాచరించుచున్నాఁడు.

ఆత్రేయి.—ఆయన అశ్వమేధయాగమును తొడంగినాఁడు.

వాసంతి.—అయ్యో, పెండ్లి కూడ చేసికొన్నాఁడా?

ఆత్రేయి.—శాంతము! శాంతము! లేదు లేదు.

వాసంతి.—అటయిన యజ్ఞములో ఆయనకు సహధర్మచారిణి యెవరు?

ఆత్రేయి.—బంగారపు సీతాప్రతిమ.

వాసంతి.—ఆహాహా!

కం. వజ్రమునకన్నఁ గఠినములు,
విరికన్నను గోమలములు, విశ్వాతిగు లౌ
పురుషవరేణ్యుల మనములు;
తర మెవ్వరి కౌను వారితత్త్వము దెలియన్! ౭

ఆత్రేయి.—వామదేవాభిమంత్రితమును మేధ్యాశ్వమును విడిచినారు. యథావిధిగా దానికి రక్షకులను నియమించినారు. వారికి నాయకునిఁగా లక్ష్మణపుత్త్రుని దివ్యాస్త్రసంప్రదాయముం బొందినవానిని చంద్రకేతుని గుఱ్ఱపుదండు ఇచ్చి పంపినారు.

వాసంతి.—[స్నేహకౌతుకాస్రములతో] ఆహా! కుమారలక్ష్మణునికిం గూడ కుమారుఁడా! అమ్మా! బ్రదికితిని!

ఆత్రేయి.—ఇంతలో బ్రాహ్మణుఁ డొకఁడు పుత్త్రుని మృతుని రాజద్వారమందు తెచ్చిపెట్టి ఓమ్మునం బాదుకొనుచు ఉద్ఘోషించినాఁడు. అంతట "రాజాపచారములేక ప్రజలయం దకాలమరణము సంభవింప" దని కరుణామయుండు రామభద్రుఁడు తనమీఁదనే దోషము మోపుకొనఁగా, తటాలున అశరీరవాక్కు ఇట్లు వినఁబడినది.—

"తపము సేయుచునున్నాఁడు ధరణియందు
వీఁక శంబూకుఁ డనుపేరి వృషలుఁ డొకడు.
వానిఁ దల ద్రెంపఁగా నీకు వలయు రామ;
మన్నిగొని వాని మనుపు బ్రాహ్మణుని వేగ." ౮

ఈ వాక్కును విని జగత్పతి ఖడ్గపాణియై పుష్పకవిమానము నెక్కి ఎల్ల దిక్కులను ఎల్ల విదిక్కులను శూద్రతాపసుని కనిపట్టుటకై చరింపం దొడంగినాఁడు.

వాసంతి.—శంబూకుఁ డనువాఁడు ధూమపాయి, ఇందే జనస్థానముననే తపస్సు చేయుచున్నాఁడు. కావున శ్రీరాముఁడు వెండియుం నీవనము నలంకరించునా?

ఆత్రేయి.—కల్యాణీ, పోయెద నిప్పుడు.

వాసంతి.—అట్లే చేయుము. పగలు ముదిరినది. కావున నే,

తే. వెట్టచేఁ దొడిమలపట్టు విడుపుఁ జెంద
ద్విరదములు గండపిండముల్ దురద వోవ
నొరయునదురుచే రాలు సుమోత్కరములఁ
దటతరువు లర్చ సేయు గోదావరిఁ గను. ౯

తే. వానిపైఁ గూండ్ల కేతెంచి పావురములు
నడవికోళ్లను మిడియెండ బడలికలకు
శాంతిమైఁ గుదుర్కొనుచు విశ్రాంతి గాఁగ
కూయుచున్నవి హుంకారగుంభనముగ. ౧౦

తే. క్రింద నీడను ధరఁ గెక్కరించుచున్న
పులుఁగు లాచెట్లబెరడుల బిలములందుఁ
గాఁక కిట్టటులౌ కీటకములఁ దమదు
కూచిముక్కులతో నీడ్చుకొనుటఁ గనవె. ౧౧

[ఇరువురు నిష్క్రమింతురు.

శుద్ధవిష్కంభము ముగిసినది.

---

## ద్వితీయాంకము.

[అంతట రామభద్రుఁడు సదయోద్యతఖడ్గుఁడు ప్రవేశించును.]

రాముఁడు.—

తే. కుడికరమ, శూద్రమునిమీఁద విడు కృపాణి,
విప్రబాలుఁడు మృతుఁడు జీవించుకొఱకు.
కరుణ నీ కేడ దుర్భరగర్భఖిన్న
సీతఁ దఱిమిన రాముని గాత్రమునకు? ౧

[ఎట్టకేలకుఁ గొట్టి] రామసదృశ మైనకర్మం గావించితిని. ఆ బ్రాహ్మణపుత్రుండు బ్రదుకును గాక.

దివ్యపురుషుఁడు—[ప్రవేశించి] జయము జయము దేవరకు.

ఉ. నీవు కృతాంతునుండియును నిర్భయ మిచ్చి ధరింప దండమున్,
జీవన మొందె నీ శిశువు, చెందితి నిట్టి శుభంబు నేనునున్.

దేవర, శంబుకుండను ద్విదీయపదంబుల మౌళిఁ జేర్చెదర్;
జావులు గూడ సాధుజన సంగ భవంబులు తారకంబు లౌ. ౨

రాము.—రెండును మాకు ప్రియములు. మఱి యనుభవింపుము ఉగ్రమయిన తపంపు ఫలమును.

తే. ఎందు మోదంబు లెసఁగు, నానందము లగు,
నెందుఁ బుణ్యంపు సంపద లింపుమీఱు,
తైజసములు వైరాజాభిధానకములు
నయిన లోకంబులు ధ్రువంబు లగుత నీకు. 3

శంబూకుఁడు.—ఈ మహిమ మీ ప్రసాదమునకు ఫలముగాని తపస్సునకుఁగాదు. అయిన నట్లనఁ గూడదు, తపస్సే నాకు మహోపకారముం గావించినది.

చ. వెదకుదు రెల్లవారలు భువిన్ నిను భూతపతిన్ శరణ్యునిన్ ;
వెదకుచు నన్ను దుర్వ్రుషలు నీ వరుదెంచితి నూఱు లామడల్!
ఇదియె తపః ప్రసాదము మహిష్ఠము ; కాక యయోధ్యనుండియున్,
బద మిడు దేల వెండియును భానుకులాగ్రణి, దండకాటవిన్? ౪

రాము.—ఏమి దండకారణ్యమా ఇది! [కలయం దిలకించి]

శా. శ్యామస్నిగ్ధము లొక్కచో, నొకట భీష్మాభోగితా రూక్షముల్,
వ్యాఘూర్ఘజ్ఝరపాతఘోషిత కకుప్చక్రాంక త త్తన్నలుల్
భూమీ గ్రావాశ్రమతీర్థ శైవలవతీ భూయిష్ఠ కాంతారముల్
నామోగ్రలం బొడ తెంచె జ్ఞాతచర నానాదండకాభాగముల్. ౫

శంబూ.—దండకయే యిది. ఇచటఁగదా పూర్వము నివసించుచున్న దేవరచేత.

కం. దురమున నొక్కమ్మడి ప్రం
దిరి కరకరిరక్కసులు పదియు నాలుగువేల్,
ఖర దూషణ త్రిశిరసులు
స్వరునిభశరహతులఁ బడిరి శమనునివాతన్. ౬

అందువలనఁగదా, సిద్ధిక్షేత్ర మయిన జనస్థానమున మమువోఁటి భీరుజనులకుం గూడ నిర్భయ సంచారము కలిగినది.

సీ. నిష్కూజితంబులై నిభృతమై యున్నవి
యీసీమ లొకకొన్ని యెడలయందు,
సత్త్వంబు లులియు నుచ్చండాస్ఫటులతోడ
ఘూర్ణిల్లుచున్నవి కొన్ని చోట్ల,
స్వైరనిద్రిత మహాస్ఫుట భుజంగశ్వాస
దీప్తాగ్ను లొకకొన్ని దిక్కులందు,
లోఁతుఁబగుళులందు బ్రాఁతు కొనల్పాంబు
వుల మిన్కుచున్న పీకలఁకులందు,
తే తొండ లిచ్చోట డప్పిచే బెండువాఱి
త్రాగుచున్నవి యాజగరంపుఁ జెమట;
క్షణవినోదంబు గాఁ గటాక్షంబు సేయ
నవధరింపుము చిత్తంబునందు దేవ. ౭

రాము.—

తే. కాన నగుచున్నయది జనస్థాన మిదిగొ
మున్ను ఖరరాక్షసుండు కాఁపున్నచెంకి.
అనుభవం బగుచున్నవి యల్లనాఁటి
యఖిల వృత్తాంతములును బ్రత్యక్ష భంగి. ౮

వైదేహి. ఎంతయుఁ ఆరామప్రియ గదా. ఇవి యాకాంతారములే. ఇంతకన్న నాకు భయానక మేమున్నది? [సబాష్పము]

కం. తేనియతావి గుబులొ్కను
కానల నీతోడ నుండుఁ గాఁపుర మనుచుఁ
దాను విహరించె జానకి.
హా! నెయ్యంబట్టి దొర యబలకు నాపై! ౯

కం. ఎది యెవనికిఁ బ్రియజన మగు
నది యేమో యింత ద్రవ్య మగు నాతనికిఁ;
అది కా నేమియుఁ జేయక
విడుల్పు దుఃఖముల సౌఖ్యవితతులచేతన్. ౧౦

శంబు.—చూరరానివి యివి చిత్తగింపఁ దగినవి కావు. ఇటుపైని యివి మధ్యమారణ్యములు, మదోత్కట నీలకంఠ కంఠ కోమల కాంతి కాంతయులగు పర్వతములచే వ్యాప్తములు, బహుళ నీలదీప్తులతో దట్టముగా నట్టుకొన్న లేఁత చెట్ల గుబురులచే నలంకృతములు, బెదరొందని పెద్ద తెగల జింకకదుపులచే శోభితములు, ప్రశాంత గంభీరములు.

(మాలిని)

కలిత మదవిహంగా క్రాంత వానీర పుష్పో
న్మిళన సురభి శీతాచ్ఛామేయ తోయంబు లిందుఁ,
ఫలభర పరిణామ ధ్వాంతభాగ్జంబుకుంజ
స్ఖలన ముఖర భూరిస్రోతోఘంబు లేఱుల్ వహించుఁ. ౧౧

మఱియు,—

ఉ. ఈ కుహరంబులందు వసియించెడి యెల్గు యువల్ రచించు నం
బూత్కృతముల్ వివృద్ధిఁ బ్రతిమోక్తులచేఁ గనుచున్న విందులన్;
దీకొనుచున్న దేన్గులు మథించిన యందుగుగ్రంథు లొద్దు ను
త్సేకపు సౌరభంబు కటుశీతకషాయ మనోహరం బిటన్. ౧౨

రాము.—[బాష్పముల నడంచుకొని] భద్రుఁడా, నీ దారులు శుభము లగుఁగాక. దేవయానమున పుణ్యలోకములకుం బొమ్ము.

శంబు.—ముందుగా పురాతన బ్రహ్మవాదిని అగస్త్యర్షిని అభివాదించి శాశ్వతపదమునకుం బోయెద. [నిష్క్రమించును.

రాము.—

తే. కంటి వెండియు నిప్డు దాకాననంబు,
నెందుఁ జిరము వసించితి మేము మున్ను,
గృహుల మారణ్యకులము నై విహితధర్మ
రతిని సాంసారిక సుఖైక రస మెఱుఁగుచు. ౧౩

తే. ఆశిఖరు లివె శిఖి విరావాకులములు,
ఆవనము లివె యున్మద హరిణకములు,
మంజు వంజులకుంజ ధామములు సాంద్ర
నీప నిచుళంబు లివె యా ఘనీతటములు. ౧౪

కం. ఈ దవ్వున సైతము దాఁ
గాదంబినివోలె నేది కనఁబడు నదియే
కాదోటు ప్రస్రవణగిరి,
గోదావరి దేనిపజ్జ ఘూర్ణిలు చుండున్? ౧౫

ఉ. దీని మహాశిరంబె సమధిష్ఠిత మార్యజటాయు గూఁటిచే,
దానికిఁ గ్రింద నయ్యుటజధామములన్ రహి నుంటి మేమునున్,
ఆ నికటాన గోదయుఁ దదర్పితబింబము శ్యామభూరుహ
శ్రీ నినద త్పతత్త్రి ముఖరీకృత మావనముల్ విరాజిలున్. ౧౬

ఇచటనే ఆ పంచవటి; చిర నివాసముచేత మా వివిధ విస్రంభాతి ప్రసంగములకు ఈ ప్రదేశములు సాక్షులుగా నుండినవి. ప్రేయసీ ప్రియసఖి వాసంతియుం నిటనే వసించుచున్నది. హా! ఏమి సంభవించిన దిపుడు రామహతకునికి! ఏ మన నిపుడు.—

తే. చిరమునకు రేఁగి నొంచు పెన్నిలుము వోలె
ఘాతచేఁ గదలిన ముల్కికణిక వోలె,
గ్రంథియై సెలపడిన హృద్వ్రణము వోలెఁ
దట్టి వెత నన్ను నవము నా దరికొలిపెడు. ౧౭

అయినను పూర్వమిత్రములైన యీ భూప్రదేశములను గాంచెదను. [కాంచి]
అహో భూమి సన్నివేశము విలంకడ లేనిది:—

తే. పాయుదల లంక మార్పడె నేఱులందు,
విరళతయు సాంద్రతయు మాఱె విటపులందు,
తడవునకుఁ గన్న కాన నూత్నముగఁ దోఁచె,
అచలముల గుర్తు నమ్మించె నదె యి దంచు ౧౮

అయ్యో! నేను విడనాడి యేగుచున్నను వన్నిటకు పంచవటీ స్నేహము బలిమి సెయి లాగుచున్నది! (సకరుణము)

ఉ. ఎక్కడ నింటఁబోలెఁ బ్రియ యేను దినంబులు పుచ్చినారమో;
యెక్కడి తత్కథాకథన మే సతతంబును సాగుచుండునో,
ఒక్కరుఁ డిప్డు ప్రాణసఖు నుజ్జనచేసిన రామపాపి యా
యక్కను దేఁ బంచవటి నెట్లు కనున్ గన కెట్టు లేఁగెడున్! ౧౯

శంబూ.—[ప్రవేశించి] జయము దేవరకు. దేవా, అగస్త్యభగవంతులు మీ రిట నుండుటను నావలన నెఱింగి మీ కిట్లు సందేశించినారు:—"విమానమునుండి దిగునప్పటి మంగళ సంవిధానమును సిద్ధము చేసికొని వత్సల లోపాముద్ర ఎల్ల మహర్షులతోను ని న్నెదురు చూచుచున్నది. కావున వచ్చి మమ్ము సంభావింపుము. తర్వాత పుష్పకంబున త్వరగా స్వదేశము చేరి అశ్వమేధమునకు సన్నద్ధుఁడవు కాఁగలవు." అని.

రాము.—భగవంతుఁ డాజ్ఞాపించినట్లు.

శంబూ.—అటయిన దేవర పుష్పకమును ఇటు తరలింపవలయుం.

రాము.—భగవతీ పంచవటీ, గురుజనానుసారమువలనిది గావున రాముని యీ యతిక్రమమును క్షణము సేపు క్షమింపుము.

శంబూ.—దేవా! చూడుచూడు.

సీ. గుంజ న్నికుంజంపు గుడిసెలకాఁపు లౌ
గూబ పిండుల ఘనఘూత్కృతముల
బెరసిన బొంగువెదురుల నాదములకుఁ
గాక సంఘములు మూకత వహింపఁ,
బ్రచరించుచున్నట్టి బర్హిణంబులు వెట్టు
కేకారవంబుల డాక కులికి
ముదుక రోహిణ భూజముల బోదియలయందు
నెదిగెడి యురగంబు లుదరిపడఁగఁ,
ఆ. గనఁగఁ గనఁగఁ గననె కన్దోయి లాగెడు
రమణమీఱు సీధ రాధరంబు;
కనుము దేవ, దీనిఁ గ్రౌంచావతంబు నీ
దివ్యదృష్టి నెనసి తీర్థ మగుత. ౨౦

మఱియు.—

సీ. గోదావరీవారి గుహలలోనికిఁ దూఱి
గద్గదరవముతోఁ గడలుకొనఁగ,
వర్షాళిల యంబుద మండనంబులచేత
శిఖరముల్ నీలిమఁ జెంది మెఱయ,

మోఁవిలఁ దోఁచెడు నివి మున్ను దేవర గన్న
దక్షిణ ధారుణీధ్రములు సూవె;
ఒక యేటితరఁగ లొండొక యేటితరఁగలఁ
బ్రతిఘాత మొనరించి ప్రతిభయముగఁ
తే. బ్రబలి కోలాహలంబుతోఁ బాఱుచెంచు
నివియు దేవర మున్ను గన్నవియు; వీని
సమవలోకింపుమీ నదీసంగమములఁ
బావనంబుల గంభీర జీవనముల. ౨౧

[అని నిష్క్రమింతురు.

ద్వితీయాంకము ముగిసినది.

---

## విష్కంభకము.

[అంతట తమసా మురళ లనెడి నదీద్వయము ప్రవేశించును.]

తమస.—సఖి, మురళా, ఏమి సంభ్రాంతురాలవుగా నగపడుచున్నావు?

మురళ.— భగవతీ, తమసా, నన్ను అగస్త్యభగవానులవారి యిల్లాలు లోపాముద్ర నదీమతల్లికను గోదావరిని ఇట్లు హెచ్చరింపు మని పంపినది.—"ఎఱుఁగుదువు గదా వధువును విడనాడినది మొదలుగా.—

తే. వెలికిఁ బ్రిదులదు గాంభీర్య వృత్తికతన,
గూఢముగ లోన వెతవెట్టు రూఢగరిమఁ,
బుటమునం బాకముం బొందుదిటము దోఁప
నెరియుచున్నది రాముని కరుణ రసము! ౧

దానం జేసి అట్టి యీ ప్రేయసీ కష్ట వినిపాతోద్భవమైన వెంపుమీఱి యున్న దీర్ఘ శోక సంతాపముచేత శ్రీరాముడు కడుం గృశించి యున్నాడు. అతనిం జూడ నా గుండె గ్రక్కదలిన ట్లున్నది. మఱి ఇప్పుడు మరలి యేగువాడును రామభద్రుడు పంచవటీవనమందు ప్రియతోడి సహవాస విస్రంభములకు సాక్షులైన ప్రదేశములను దర్శించక మానడు. వానియందు స్వభావముచేత నాతడు ఎంత ధీరుడైనను ఇట్టి యీ యవస్థయందు శోకము ఉద్రేకము నొంది కరము లోనై విలపిం చెందుటం జేసి అడుగడుగున మహా ప్రమాద కారణములం బొందెడిం గలండని వెఱపులకే యున్నది. కావున, [illegible] భగవతీ, నీవు సావధానవై,

తే. శీకర క్షోద సంభార శీతలములఁ
బద్మ కింజల్క పరిమళ బంధురముల
నీ మృదూర్మి పవనముల రామభద్రు
జీవనము సొమ్మ సొమ్మను గావవమ్మ. ౨

అని.

తమస—స్నేహమునకు దాక్షిణ్యము తగియున్నది. సంజీవనోపాయమో ప్రధానతమమే యిట సిద్ధముగా నున్నది.

మురళ—అది యెట్లు?

తమస—వినుము. అప్పుడు వాల్మీకితపోవన సమీపమున విడిచిపెట్టి లక్ష్మణుఁడు పోఁగానే, సీతాదేవి నొప్పులు గలిగి మహాదుఃఖాతిరేకమునం బోయి గంగలోఁబడినది. వెంటనే అట ఇరువుర మగ శిశువులను గన్నది. ఆమెను భూదేవియుం గంగాదేవియుం కర మనుగ్రహించిరి, పాతాళమునకుం గొనిపోయిరి; ఆ బిడ్డలను పాలు వదలిన తర్వాత గంగాదేవి వాల్మీకి మహర్షికి అర్పించినది.

మురళ—[ఆశ్చర్యముతో]

తే. ఇట్టివారు విపాకంబు నెనయ నదియుఁ
బరమ విస్మయకారిగాఁ బరిణమించు;
అందు సాహాయ్యకము సేత కట్టివారు
పూనుదురు తముఁదామ యపూర్వ గతుల. 3

తమస—మఱి యిప్పుడు ఈ శంబూక వృత్తాంతముచేత రామభద్రుఁడు జనస్థానమునకు వచ్చెడి నని సరయువువలన విని భాగీరథీ భగవతి ఏ భయమును స్నేహముచేత లోపాముద్ర కొన్నదో అభయమునే కొన్నదై సీతాదేవిం దోడ్కొని ఏదో యొక గృహాచారంపు మిషచే గోదావరిం గాంచుటకు వచ్చియున్నది.

మురళ—భగవతి చక్కఁగా ఊహించినది—ఏమని యనఁగా—"రాజధానియందున్నప్పుడు లోకముల యభ్యుదయమునకై ఆయా వ్యాపారములలోఁ జొచ్చియున్న రామభద్రునికి చిత్తవ్యాసంగములు తప్పవు. మఱి యట్టి వ్యాసంగములు లేక శోకమాత్ర సహాయుఁడైన యాతనికి పంచవటీ ప్రవేశము మహానర్థకారి యగును." అని. సరియే గాని యిప్పుడు సీతాదేవిచేత రామభద్రుఁడు ఎట్లు ఊఱటం జెందును?

తమస—భగవతి భాగీరథీదేవి సీతతో నిట్లు వచించినది "వత్సే, దేవయజన సంభూతురాలా సీతా, నేఁడు చిరంజీవులకు కుశలవులకు పంద్రెండవయేఁటి సంఖ్యామంగ

కంపు నుండి కట్టఁబడును. కావున నీవు నీదు పురాణశ్వశురుని మనుసంభూతమైన యీ సకల రాజర్షి వంశమునకును జనకుని పాపమడఁచువానిని సూర్యదేవుని స్వయముగా నీ చేతితో కోసిన పూవులతో పూజింపుము. మఱి భూమిపై సంచరించుచున్న నీవు మా ప్రభావమున వనదేవతలకు సయితము కనఁబడవు. ఇఁక మనుష్యుల కగపడ వని చెప్ప వలయునా!" అని. నన్నును ఇట్లాజ్ఞాపించినది. "తమసా, నీయందు మా కోడలి జానకికి ప్రేమ మిక్కుటముగదా. కావున నీవే జానకికి తోడుగానుండుము." అని. కావున నే నిపు డా యానతిని నెఱవేర్చెదను.

మురళ.—నేనును ఈ వృత్తాంతమును లోపాముద్రకు నివేదించెదను. రామభద్రుఁడు వచ్చియున్నాఁ డనియే తలంచెదను.

తమసా.—ఇదె యీమె గోదావరిమడుగునుండి వెలువడి:—

తే. పాలి క్రుస్సిన చెక్కులుం గ్రాలుతుఱుము
నెమ్మొగమ్మున సౌరు పెన్నిధిని బెంపఁ,
గరుణమూర్తియొ, మెయి గొన్న విరహాభరమొ,
యనఁగ నరుదెంచుచున్నది వనికి సీత. ౪

ఈమెయేగదా యీమె!

తే. తోడిమ కెడపిన తలిరాకు బెడఁగు దానిఁ
గృశను బాండువు నీమెమూర్తి నిటు వాడ్చు
నెదవిరి నివుర్చు నుగ్రచిరైధితార్తి
మొగలిలో రేకును శరత్తునెగయుఁ బోలె. ౫

[పరిక్రమించి నిష్క్రమింతురు.

విష్కంభకము సమాప్తము.

## తృ తీ యాం క ము.

[నేపథ్యంబున]

అయ్యో! ప్రమాదము! ప్రమాదము!

[అంతట పూవులు గోయుటయందు దాసక్తురాలై సకరుణౌత్సుక్యముగా

వినుచు సీత ప్రవేశించును.]

సీత — అహా! నా ప్రియసఖి వాసంతి పలుకుచున్న దని తలంచెదను.

[మరల నేపథ్యమున]

ఉ. ముందఱ లోలమై మురియ భూసుత యేకరిలేఁగ మున్ను దా

నందుగు లేఁజివుళ్లు గొస లాత్మకరంబున మేపి పెంచెనో,

సీత — ఏమి దానికి!

[మరల నేపథ్యమున]

సుందరిలోడ నీట నది చొక్కుచునుండుదు, దాని నద్దిరా!

క్రందుగఁ బోరఁ బైకొనియె గంధగజం బొకఁ డాగ్రహోగ్రమై.

సీత — [తొట్రుపాటుతోఁ గొన్నియడుగులు నడిచి] ఆర్యపుత్త్రా, కావుకావు దానిని నా పుత్త్రకుని. [జ్ఞప్తి నభినయించి వైక్లబ్యముతో] అయ్యో అయ్యయో! చిర మలవాటుపడిన యీ యక్షరములే పంచవటీదర్శనముచేత వెండియును మందభాగ్య నయిన నా నోట వచ్చుచున్నవి. హా! ఆర్యపుత్త్రుఁడా! [అని మూర్ఛిల్లును.]

తమస — [ప్రవేశించి] పట్టీ, ఊఱడిల్లుము, ఊఱడిల్లుము.

[నేపథ్యమున]

విమానరాజ, ఇటనే యుండుము.

సీత — [ఊఱడిల్లి సాధ్వసోల్లాసములతో] అమ్మో! నీరు నిండిన మేఘంపుగర్జనవలె గంభీర మాంసలము ఎక్కడిది యీ భారతీ నిర్ఘోషము; వీనుల వివరముల నిండుచు నాకుం గూడ మందభాగినికి వెంటనే ఆశ్వాసము నొసంగుచున్నది!

తమస — [స్నేహ బాష్పములతో] ఓసి నా పట్టీ,

తే. తెలియ వెందులయదియొ, వ్యక్తిం బొరయద,

యట్టి నినదంబున కి దేమె యిట్టు లైతి?

వారి ధరగర్జ విన్న మయూరి వోలె

భయపడితి, వర్ష్మలికిని బొల్పడితి, కూన.

సీత — భగవతీ, అవ్యక్త మని యందువా? నేనో మఱి స్వరసంయోగముచేత ఆర్యపుత్త్రుఁడే పల్కుచున్నాఁ డని ఆనవాలు పట్టితిని.

తమస — వింటిమి గదా తపించుచున్న శూద్రునికి దండన మొసంగుటకై ఐక్ష్వాకుఁడు రాజు జనస్థానమునకు వచ్చినాఁ డని.

సీత — అహా! ఆ రాజు రాజధర్మమునందు కొఱవడనివాఁడు గదా!

[నేపథ్యమున]

తే. చెట్టులును లేళ్లునుఁగ నాకుఁ జుట్ట లెచట,
నెచటఁ జిర ముంటి సఖితోడ నింపు మెఱయఁ,
గ్రాలు నవె యివి బహు ధునీ కందరములు
గోద చెంగటి గొనబుల కొండదరులు. 3

సీత — [చూచి] హా! ఏమి! ఈతఁడు ప్రాతస్తన చంద్రమండలాపాండుర పరికృశ దుర్బలాకారుఁడై గంభీరానుభావమాత్రముచేత ఎఱుకపడుచున్నాఁడు! ఆర్యపుత్త్రుఁడే! హా! నన్ను పట్టుకొమ్ము. [అని తమసను కౌఁగిలించుకొని మూర్ఛిల్లును.

తమస — నా బిడ్డా సమాశ్వసిల్లుము, సమాశ్వసిల్లుము.

[నేపథ్యమున]

ఈ పంచవటీ దర్శనముచేత,

తే. డెందమున లీనమై యున్న కుందువహ్ని
యాఁక నెగఁద్రోచి యిదె మండ సగ్గలింప,
మున్ను లేచెడి బలుఁపొగ మొత్త మనఁగ
మూర్ఛ యిదె నన్ను ముంచెడి ముమ్మరముగ! ౪

హా! ప్రియా! జానకీ!

తమస — [స్వగతము] ఇదే అది గురుజనులుకూడ ఆశంకించినట్టిది.

సీత — [సమాశ్వసిల్లి] హా! ఏమి ఇది!

[మరల నేపథ్యమున]

హా దేవీ, దండకారణ్యవాస ప్రియసఖీ! హా! విదేహరాజపుత్త్రీ! [అని మూర్ఛిల్లును.

సీత — అయ్యో, అయ్యో! నన్ను మందభాగ్యను పేర్కొని నల్లగలువల వేలిన కన్నులు మూతపడి ఆర్యపుత్త్రుఁడు మూర్ఛిల్లినాఁడు! హా! ఎట్లు పట్టినేల విశ్వాసము [illegible] భగవతి తమసా, కావుము కావుము, [illegible] బ్రదికింపుము. [అని తమసపాదములం బడును.

తమస.—

తే. పొమ్ము కల్యాణి, శైత్య పొమ్ము నీవ,
జగదధీశుని జీవనౌషధివి గమ్ము;
అతనికిఁ బ్రియ మగుట నీచేతితాఁకు,
దాననే నియతంబు తద్రక్షణంబు. ౫౭

సీత.—ఏమైన నగుఁగాక. భగవతి యానతిం జేసెదను.

[అని సంభ్రమంబున నిష్క్రమించును.

[అంతట నేలఁబడినవాఁడై సభావ్య యగు సీతచేతి తాఁకుడుచే అహ్లాదముతో నుచ్ఛ్వసిల్లుచు రామభద్రుఁడు ప్రవేశించును.]

సీత.—[హర్షముతో స్వగతము] త్రైలోక్యనాథునికి మరల జీవితము వచ్చిన దని తలంచెద.

రాముఁడు.—ఓహో! ఎవ రిక్కడ! ఏ మిది!

సీ. హరిచందన ప్రవాళాంకూర నిచయంపుఁ
బసరున లేపంబు నొసఁగు టొక్కొ!
అమృత కిరణ కిరణాగ్రంబులను నుల్చి
తద్రసంబునఁ జక్కఁ దడుపు టొక్కొ!
అనయం బెరియుచున్న యట్టి నా జీవిత
తరువునకుం బరితర్పణముగ
సంజీవ నౌషధీ మంజుల స్రావంబు
డెందాన నెరయు నలందు టొక్కొ!

తే. స్పర్శ మిది నిక్కముగ నాకుఁ బరిచితంబ,
మోహావారక మిది మనోమోహకంబు,
దుఃఖజం బగు మూర్ఛను ద్రోయు చిపుడె
యిడిన దానందమున వెండి జడత నహహా! ౬౮

సీత.—[ససాధ్వస కరుణముగా ఇంచుక ఓసరిలి] ఈపాటియే నాకు ఇపుడు మహా త్తరము.

రాము.—[కూర్చుండి] నిశ్చయముగా నన్ను వాత్సల్యముచే సీతాదేవి అనుగ్రహించినది గావలయుం.

సీత.—అయ్యో అయ్యో! ఆర్యపుత్త్రుఁడు నన్ను వెదకునా యేమి?

రామ.—కానీ పరికించెద.

సీత.—భగవతీ తమసా, అవలి కేఁగుదము. నన్నుఁ గనుక చూచెనా, అంతట అంగీకృతముగాని నా సన్నిధానముకై ఎక్కుడుగా మహారాజు కోపించును.

తమస.—ఓసి పట్టీ, భాగీరథీ ప్రభావంబునం జేసి వనదేవతలకు నైతము అదృశ్యవుగా నున్నావు.

సీత.—అవును. అది కలదు.

రామ.—ప్రాణేశ్వరీ! జానకీ!

సీత.—[శోకగద్గదముగా] ఆర్యపుత్త్రా! ఈ పలుకు ఈ వృత్తాంతమునకు సరిపడదు గదా! [సబాష్పము] అట్లు గాదు; ఎట్లు నేను వజ్రమయిని జన్మాంతరమందేని కలుగు నని తలంపరాని దుర్లభ దర్శనము నొసంగినవానిని నన్నే మందభాగ్యను గుఱించి వత్సలుఁడై యిట్లు పలుకుచున్నవానిని ఆర్యపుత్త్రునిఁగూర్చి కనికరము లేనిదాన నగుదును? నేను ఈయనహృదయమును ఎఱుంగుదును, ఈయన నా హృదయమును ఎఱుంగును, అనుచు:

రామ.—[కలయం బరికించి నిర్వేదముతో] హా! ఇట నెవ్వరును లేరే!

సీత.—భగవతీ తమసా! అట్లు నిష్కారణముగా పరిత్యజించియు ఈయన ఈ విధముగా కనంబడఁగా నా హృదయము ఏదశం బొందియున్నదో ఎఱుఁగలేకున్నాను!

తమస.—ఎఱుంగుదును బిడ్డా ఎఱుంగుదును.

సీ. ఆస డిందుటచే నుదాసీనముం బలె,
విప్రియంబునఁ జేసి విషమము బలె,
చిరతరంబైన యీ విరహాన డబ్బాటు
ఘటనచేతను బ్రాపు గన్నది బలె,
సౌజన్యమున సుప్రసన్నంబు బలెఁ, బ్రియు
కరుణంబులకు గాఢకరుణము బలె,
రాగంబుచేతఁ గరంగినయది బలె,
నీమనం బైన దీ నిముసమందు,

రామ.—దేవీ,

తే. మూర్తిగొన్న ప్రసాదముం బోలె నీదు
చేతి తాఁకుడు స్నేహార్ద్రి శీతలంబు

నాకు నిడుచున్న దెప్పుడు నానందభరము,
నందినీ, గాంచఁబడవు నీ వెందు నకట! ౭

సీత.—ఇది గదా అగాధ దర్శిత స్నేహ సంభారములు ఆనంద నిష్యందులు సుధామయములు ఆర్యపుత్త్రుని యుల్లాపములు. వీనియందలి నమ్మిక చేతఁగదా నాకు ఈ జన్మలాభము నిష్కారణపరిత్యాగ శల్యముచే మెరమెరలాడుచున్నను ప్రియమైనది.

రాము.—కాదు కాదు. ప్రియతమ యెక్కడి దిచ్చట! నిశ్చయముగా ఇది రామభద్రుని భ్రమ, సంకల్పాభ్యాసబలముచేత జనించినట్టిది.

[నేపథ్యమున]

ప్రమాదము! ప్రమాదము!

['ముందఱ లోలమై' ఇత్యాద్యర్ధము పఠింపఁబడును.]

రాము.—[సకరుణౌత్సుక్యము] ఏమి దానికి?

[మరల నేపథ్యమున]

['సుందరితోడ' నిత్యాద్యుత్తరార్ధము పఠింపఁబడును.]

సీత.—ఎవరిప్పుడు ఆ దుష్టగజమును దండించెదరు?

రాము.—ఆ! ఎక్కడ నాదుష్టగజము నా ప్రేయసి పెంపుడు పుత్త్రుని వధూద్వితీయుని పైకొను చున్నట్టిది! [అని లేచును.

వాసంతి.—[సంభ్రాంతురాలు ప్రవేశించి] ఏమి! మహానీయుండు రఘునాథుఁడా!

సీత.—ఆహా! నా ప్రియసఖి వాసంతియా!

వాసంతి.—దేవా, నీకు జయము.

రాము.—[నిరూపించి] ఆహా! దేవికి ప్రియసఖి వాసంతియా?

వాసంతి.—దేవరా, త్వరపడు త్వరపడు; ఇటనుండి జటాయుంశిఖరమునకు దక్షిణమున సీతాతీర్థముమీఁదుగా గోదావరిలోనికి దిగి దేవేరిపుత్త్రకునికి ప్రాపు గమ్ము.

సీత.—హా! నాయనా జటాయూ. ఇప్పుడు నీవు లేక జనస్థానము శూన్యము!

రాము.—అహాహా! ఈ కథోద్ఘాతములు గుండియలను వ్రీల్చునవిగదా.

వాసంతి.—దేవా, ఇటు ఇటు.

సీత.—భగవతీ, సత్యమే వనదేవతలుకూడ నన్ను కనలేకున్నారు.

తమస.—సీతా పట్టీ! ఎల్లదేవతలకన్న ఎక్కుడైశ్వర్యము మందాకినీదేవికి. అట్టుండ నీవేల సందేహించెదవు?

సీత.—కనుక, అనుసరింతము. [అని పరిక్రమింతురు.

రాము.—[పరిక్రమించి, భగవతి, గోదావరి, నీకు నమస్కారము.

వాసంతి.—[చూచి] దేవా, సంతోషింపుము, దేవి పుత్త్రకుడు వధూద్వితీయుండు విజయి యయినాడు.

రాము.—ఆయుష్మంతుడు వర్ధిలుగాక.

సీత.—అహో, ఇది యిప్పటి కిట్టిదిగా అయినది.

రాము.—దేవి, నీ పుణ్యము దొడ్డది.

శా. స్మేరోద్భేది మృణాళికా కిసలయ స్నిగ్ధ ద్విజాంకూర మై
సై్వరం బెయ్యది నీ వతంసలవలీపర్ణంబుఁ దా మేసె, నీ
గారాపుం గొమరుండు వాఁడె మదముగ్గంధద్విదజ్జేత యై
తారుణ్యశ్రీ మొందె సుందరవశా దాంపత్య కల్యాణముల్.

సీత.—ఎప్పుడును ఈ దీర్ఘాయువు ఈ సౌమ్యదర్శనతోడి వియోగ మెఱుఁగ కుండునుగాక.

రాము.—సఖి వాసంతి, చూడు చూడు, కాంతానువర్తన చాతుర్యమును గూడ పుత్త్రకుడు నేర్చినాడు!

చ. హరువగు లేబిసంపుఁ గడు లల్లన నోరను బెట్టి యందులన్
విరిసెడి తమ్మితావులు కవించెడి పుక్కిటి తోయ మూన్చెడిన్,
కరమునఁ దుంపరల్ దనియఁగాఁ జిలికించి ముగించి, కూర్మిఁ దాం
దరఁ గొని పట్టెడిన్ ఋజుమృణాళముఁ దామరపాకు నెల్లిగాన్.

సీత.—భగవతి, తమసా, ఇది యిట్టిదైనది, మఱి వారు ఆ కుశలవులును ఇంత కాలమునకు ఏపాటిగా నవుదురో ఎఱుంగను.

తమస.—ఏపాటిదో యిది వారును ఆపాటియే.

సీత.—నేను ఇట్టి మందభాగ్యురాలను, నాకు ఆర్యపుత్త్ర విరహంబె కాక పుత్త్ర విరహము కూడ.

తమస.—భవితవ్యత అట్టున్నది.

సీత.—నేను కని యేమి! అట్టి యా నా పుత్త్రకుల నిర్మల ముఖపుండరీకయుగళమును ఇంచుక యెదమొలంగల కోమల దంతములచే భాసిల్లుచున్న చెక్కిళ్లతోను ముద్దు లొలుకు మధుర మూర్తస్ఫుట మందహసితానుబంధముతోను కాకళీఖండ నిబంధనము తోను వెలుంగుచున్నట్టిదానిని ఆర్యపుత్త్రుడు ముద్దుగొనఁడాయెనే!

తమస.—కలుగునుగాక వేల్పుల యనుగ్రహంబుచేత.

సీత.—భగవతి తమసా, ఈ సిసువుల స్మరణచేత స్తనములు చేఁపి వారి తండ్రి సన్నిధానంబున క్షణమాత్రము నేను సంసారిణి నైతిని.

తమస.—ఇందుల కేమందుము. కానుపు గదా స్నేహ ప్రకర్ష మునకు పరమావధి. ఇది తల్లిదండ్రులకు ఉత్కృష్టమయిన యొండొరుల కూర్పు.

కం. ఇరువంకతులకును సంతః
కరణంబుల స్నేహరసము కలుగు నెందుఁగా,
హారసపు ముడి యది నొక్కటిఁ
బరిణద్ధ మపత్య మనెడి పరనామమునన్. ౧౦

వాసంతి.—ఇటును దేవర చూడవలయును;

కం. అనువిన మేనెమలిని పక్షి
పెనిచె నవోత్థ చలద్ధ పింఛము, నదె కూ
యును సనిత ముచ్ఛిఖము ప
తనపు బోమిడికముబలెం గదంబాగ్రమునన్. ౧౧

సీత.—[సకౌతుకబాష్పము] అదా యిది!

రాము.—ఆనందింపుము వత్సా ఆనందింపుము.

సీత.—అట్లే అగుఁగాక.

రాము.—

ఉ. గొండిలులన్ బుటాంతర విఘూర్ణనసంజ్ఞ నొసంగు కంటికిన్
దాండవితభ్రువుల్ చతురతం బ్రచలించుట భూషణంబు గా,
మండిత హ స్తతాళముల మత్ప్రియ గొల్పిన నిన్ను మత్సుతా
ఖండలుఁ గాఁగ డెందమున గారవ మొప్పఁగ సంస్మరించెదన్. ౧౨

ఆహా! తిర్యగ్జంతువులు సయితము పరిచయము ననుసరించును.

తే. పూచి పూవని గున్నయై పోఁడికడప
దయిత పెంచిన యప్పుడు తనరె నేడి.

సీత.—ఆర్యపుత్త్రుఁడు చక్కఁగా ఆనవాలు పట్టినాఁడు.

రాము.—

స్వజనమునఁ బోలె దాన హార్దంబు గనుట
నిజముగా దేవి నీ గిరినెమ్మి దలఁచు. ౧౩

వాసంతి.—దేవర, యిటఁ గూర్చుండువుగాక.

ఆ. కాంతతోడ నీకుఁ గమనీయ శయన మౌ
కాని తర్ది యిది యరంటిపనిని,
పూరి యొసఁగె సీత సారె వీనికి నిటఁ,
గాన, హారిణకములు దీని విడవు. ౧౪

రాము.—దీనిని నేనుం జూడ నోపకున్నాఁడ.

[అని ఒండెడ నేడ్చుచుం గూర్చుండును

సీత.—సఖి వాసంతి! ఏమి చేసితివే నీవు, ఆర్యపుత్త్రునికిని నాకును ఈ ప్రదేశమును చూపుటచేత! అకటకటా! అతఁడే ఆర్యపుత్త్రుఁడు, అదే పంచవటీ వనము, నీవే ఆ ప్రియసఖివి వాసంతివి, అవే నానా విస్రంభసాక్షు లైన గోదావరీ కాననోద్దేశములు, నా బిడ్డలకన్న వేఱు గానట్టివి అవే యీ మృగ పక్షి వృక్షములు, మందభాగ్యకు నాకు మఱి అగపడుచునే యున్నను ఇది యెల్లను లేనిదే! ఇట్టిదిగా నున్నది జీవలోకమునకు దశాపరిణామము!

వాసంతి.—సఖి సీతా, రాముని యవస్థను చూడవా యేమి?

చం. కలువదళంపుసో రొలసి కన్నుల పండువు సేయ నంగముల్,
తలఁచినయప్డు డెల్లఁ గన దక్కియు నీ కెప్పుడుగా నవుండె యై
వెలసియు, నిప్డు శోకమున విహ్వాలితాంగుఁడు పాండురుండు దు
ర్బలుఁ డయి యెట్టకేలకు విభావితుఁ డయ్యెను నేత్రపర్వమౌ.

సీత.—చూచుచున్నాను సఖీ, చూచుచున్నాను.

తమస.—ప్రియునిఁ జూచుచుండువుగాక.

సీత.—హా దైవమా! నేను లేక యీతఁడు, ఈతఁడు లేక నేనును, అని ఎవరు తలంచిరి. కాన, ముహూర్తము సే పయినను జన్మాంతరమందుం బోలె కానంబడినవానిని బాష్పజలముల నడుమ నడుమ చూచెదనుగాక వాయందు వత్సలుని ఆర్యపుత్త్రుని.

[అనతోఁ జూచును.

తమస.—[నెయ్యముతో కవుంగిలించి]

తే. మోదశోకాశ్రువుల వెల్లి పొడుచు నీదు
దృష్టి తృష్ణచే నుత్తానదీర్ఘ యగుచు,
దయితు ధవళబహుళముగ్ధ కానమార్చు
హార్ద నిష్యంది క్షీరకుల్యయును బోలె. ౧౬

వాసంతి.—

చం. తరులు ఫలప్రసూన సహితం బగు తేనియ నర్ఘ్య మిచ్చుతఱి,
విరిసిన తమ్మిసౌరభము వెల్లిగ వీచుతఱి గాన తెమ్మెరల్,
ఉరక కలక్వణంబుల రతోత్సుకముల్ పులుఁగుల్ రచించుతఱి,
మరలను రామదేవుఁడు సమాగతుఁ డీ వ్వనికిన్ స్వయంబుగాన్.

రాము.—సఖి, వాసంతీ, ఇటఁ గూర్చుండుము.

వాసంతి.—[కూర్చుండి సబాష్పము] మహారాజ, కుమారలక్ష్మణునికి కుశలమా?

రాము.—[వినమి నభినయించి]

తే. జలము నిర్ఝరి పూరిఁ గైనలమున నిడి
యే తరు విహంగ మృగముల సీత పెనిచె,
వానిఁ గన్నంత వికృతి నా కౌ నొకండు
ప్రస్తరోద్భేద పటువు హృద్గ్రివమువోలె. ౧౨

వాసంతి.—మహారాజా, అడుగుచున్నాను గదా కుమార లక్ష్మణునికి కుశలమా అని.

రాము.—ఓహో! మహారాజా యని ప్రేమలేని పిలుపుపదము. సౌమిత్రిని గూర్చి మాత్రము బాష్పగద్గదాక్షరము కుశలప్రశ్న. కావున :తలంచెదను ఈమెకు సీతా వృత్తాంతము ఎఱుకపడి యున్నదని, [ప్రకాశము] అవును. కుశలము కుమారునికి.

[అని యేడ్చును.

వాసంతి.—ఓయి దేవరా, క్రూరుఁడవు గదా అయితివి.

సీత.—సఖి వాసంతీ, నీ విట్లు పలికెద వేమి? ఆర్యపుత్రుఁడు ఎల్లవారికిని ప్రియార్హుఁడు గదా, నా ప్రియసఖికి విశేషముగా నట్టిఁ డని చెప్పవలయునా?

వాసంతి.—

ఉ. ఈవె మదీయ జీవితమ, వీవె ద్వితీయ మనంబ, వక్షులం
దీవె విశుద్ధకౌముదివి, యీవె సుధాపగ వంగమందునన్;
ఈవవిహి వేలకున్ శతము లిచ్చుగము ల్పచరించి దానినేగా!

[నిశ్వసించి]

విధి! శాంత మాతా! మటు గా కిఁక నుత్తర మేల యీఁకొనన్!

[అని మూర్ఛిల్లును.

రాము.—యుం క్తము గదా మాట మానుటయుం మూర్ఛిల్లుటయుం. సఖి, సమాశ్వసిల్లుము సమాశ్వసిల్లుము.

వాసంతి.—[సమాశ్వసిల్లి] ఏల యీ యకార్యమును దేవర కావించెను ?

సీత.—సఖీ వాసంతీ, మానుము మానుము.

రాము.—లోకము ఒప్పలేదని.

వాసంతి.—అందులకు ఏమి కారణము?

రాము.—అది లోకమునకే యెఱుక.

తమస.—లోకులను నిందింపఁదగును.

వాసంతి.—

ఉ. ఓయి కఠోర! నీకు యశ మొక్కటియే గద యెంతయుం బ్రియం,
బే యయశంబు ఘోరతర మింతకుకన్న వచింప నేర్తువే?
ఆ యటవిన్ మృగీనయన కైనగతిన్ వివరింప వయ్య యో
హో యధినాథ; యే మనుచు నూహ యొనర్తువొ దానినయ్య యో!

సీత.—నీవే సుమా వాసంతీ దారుణురాలవు కఠోరవును. ఏలన నిట్లు ఆర్యపుత్త్రుని క్షుభితుని క్షోభపెట్టుచున్నావు.

తమస.—ప్రేమయుం శోకమును ఇట్లు పలుకుచున్నవి.

రాము.—సఖి ఏమనుకొనవలసినది?

తే. చకిత సారంగతర్ణక చపల నయన
స్ఫురిత పరిణత గర్భ ప్రభూత ఖేద
కౌముదీమయి బిసముగ్ధ గాత్రలతిక
యబల క్రవ్యాత్కుల విలుప్త యయ్యె నిజము. ౨౧

సీత.—ఆర్యపుత్త్రా, బ్రదికియున్నాను.

రాము.—హా ప్రేయసీ, జానకీ, ఎచట నున్నావు?

సీత.—అక్కటా అక్కటా, ఆర్యపుత్త్రుఁడు సయితము వాపిచ్చి యేడ్చుచున్నాఁడు!

తమస.—పట్టీ, ఇది యుక్తమేగదా. దుఃఖితులు దుఃఖనిర్వాపణము చేసికొనవలసినదే గదా. ఏలన.—

తే. వెల్లి దరులఁ బొరలి హాల్లకల్లోల మౌ
కొలనిఁ డ్రెవ్వసీక కలుఁజు గాచు;
శోకవేగమునకు క్షోభించు డెందముఁ
విలపనంబు గాచు ప్రీలనీక. ౨౨

విశేషముగా రామభద్రునికి పెక్కు తెలుంగుల జీవలోకము కష్టమైయున్నది.

ఉ. పూనికతోడ విశ్వమును బ్రోచుట కార్యము శాస్త్ర సమ్మతిన్,
మానినినంత యాత్మసు సుమంబును ఘర్మము వోలె వాడ్చెడిన్,
కానె తొలంచుటన్ విలపితంపు వినోదము నబ్బవాయె నే!
కాన నిఃశిస్పుదేని శమకారణ మగా పదితంబు మేల్గదా. ౨౩

రాము.—కట్టా! కట్టా!

ఉ. ప్రేలును గాని గుండె భయవేగముచే, మఱి గాదు రెండుగా!
సోలును గాని విహ్వాలత సొమ్మల మై, విడ దౌర చేతనన్!
కాలుచుఁ గాని లోనిసెగ కాయముఁ జేయదు బుగ్గిగా! హాతిన్
గూలుచుఁ గాని మర్మములఁ గోసెడి దైవము కోయ దాయువున్!

సీత.—ఇట్టిద యిది.

రాము.—ఓ అయ్యలారా! పౌరజానపదులారా!

చ. సరిపడదాయె మీమదికి జానకి యింటను మన్కి, దానఁ బు
ల్లొరకను బోలె శూన్యవనిలో విడనాడితి; వెండి వందురన్;
పరిచయబంధులైన యలభావములిప్పు కరంచె నామదిన్,
శరణము లేమి రోదనము సల్పెద, నిందుల కేని యోర్వఁడీ!

తమస.—శోక సముద్రంపునింపు అతిగంభీరముగా నున్నది!

వాసంతి.—కడచిపోయినదానిం గూర్చి దేవర తాల్మి వహింపవలయును.

రాము.—సఖీ, ఎట్లు చెప్పెదవు తాలిమి యని?

తే. దేవి పాడిడిచన్నట్టి యీవసుధకుఁ
బదియు రెండవ దగునేఁడు ప్రాప్త మయ్యె;
నష్ట మైనది సీత యన్నామ మదియు,
లేఁడు రాముఁ డనెడు మాట లేని దాయె. ౨౬

సీత.—ఆర్యపుత్త్రుని యీ వచనములచేత మూఢ నగుచున్నాను.

తమస.—ఆట్లే బిడ్డా.—

తే. స్నేహ శిశిరంబులును శోక నిష్ఠురములు
నిష్పతములు గావు నీ కీ పలుకులు;
తల్లి, యామకరందంపు ధార లివ్వి
కురియుచున్నవి నీమీఁద సురువిషములు. ౨౭

రాము.—వాసంతీ, విను:—

తే. అడ్డముగ లోన నాటిన దానలాత
శల్య మెట్టులొ సవిషదంశంబు నెట్లొ
అట్లె హృన్మర్మములను గోరాడుచున్న
కుందుమేకును నే నోర్చుకొనఁగ లేదె? ౨౮

సీత.—ఎంత మందభాగ్యురాలను నేను! వెండియు నార్యపుత్త్రునికి ఆయాసకారిణి నైతిని!

రాము.—ఇట్లు అంతఃకరణమును ఇంచుకేని చలింపనీయక స్తంభించుకొన్న వాఁడన నైనను నాకిప్పుడు పూర్వానుభూతము లయిన యాయా ప్రియవస్తువులం గానఁగా ఈ యఁజెప్పెన కలిగినది. అది యెట్లన.—

ఉ. హాయక క్షోభితేంద్రియవిహార విజృంభణ మాఁపువాఁడ నై
యే యతనంబు క్లేశపడి యే రచియింతునొ, దాని నెల్లనుఁ,
నాయెదలో వికారము ఘనం బయి యొక్కటి త్రోచివైచెడుఁ
దోయఝరీ మహోగ్రరయధోరణి సైకతసేతువుం బలెఁ. ౨౯

సీత.—దుర్వార దారుణారంభమైన యార్యపుత్త్రుని యీ దుఃఖసంక్షోభము చేత నా హృదయము పరిస్ఫురిత నిజదుఃఖముం బోలె వడవడ వణఁకుచున్నది.

వాసంతి.—[స్వగతము] దేవర కష్టముపాలై నాఁడు. కావున వేఱు విషయము నకు మరల్చెదను. [ప్రకాశము] చిరపరిచితములైన యీ జనస్థాన భాగములను దేవర చిత్తగించుచుగాక.

రాము.—అట్లే కానిమ్ము. [లేచి పరిక్రమించును.

సీత.—దుఃఖ సందీపనములనే ప్రియసఖ వినోదనోపాయ మని తలంచు చున్నది.

వాసంతి.—[సకరుణము] దేవా, దేవా,

శా. ఈ వల్లీ గృహమందె యుండితివి కావే కన్నుఁ దన్మార్గముఁ
దా వేడ్కం గొని తామసించె సఖి గోదం దిన్నె హంసాళితోఁ;
వేవే వచ్చుచు దుర్మనాయితునిఁగా వీక్షించి నిఁ భీత యై
కావించెఁ జితపద్మకోరకము ముగ్ధంబుఁ బ్రణామాంజలిఁ. 30

సీత.—దారుణవు నీవు వాసంతీ, దారుణవు. ఏల యిట్లు ఈ హృదయమర్మ స్పర్శ శల్యోద్ఘట్టనముల చేత మందభాగ్యను నన్నును ఆర్యపుత్త్రునిని సంతాప పెట్టెదవు?

రాము.—చండీ జానకీ! ఇటనటం గనంబడుచునే యున్నావు. జాలిగొనవేమి?

శా. హా! ప్రాణేశ్వరి! ప్రీలు నామొదఁద, దేహం బస్తబంధం బగుచున్!
చూపట్టున్ భువి పాడుగా, నవిరతార్చుల్ లోన నగ్ గాల్చెడున్,
మోహాంధకటి నంతరాత్మ మునుఁగం బోలున్ నశావేత మై,
ప్రాపించున్ బెనుమోహ, మేమియుఁక మందాదృష్టుఁడం జేయుదున్!

అని మూర్ఛిల్లును.

సీత.—అయ్యో అయ్యో! ఆర్యపుత్రుఁడు మరల మూర్ఛపోయినాఁడు.

వాసంతి.—దేవరా, సమాశ్వసిల్లుము సమాశ్వసిల్లుము.

సీత.—హా ఆర్యపుత్రుఁడా, మందభాగ్య నైన నన్నుఁగూర్చి నీవు సకల జీవ లోకమంగళాధారభూతునికి మాటిమాటికి ప్రాణసందేహదారుణ మైన యీ దశాపరి ణామము! హా చెడితిని!

[అని మూర్ఛిల్లును.

తమస.—పట్టీ సమాశ్వసిల్లుము సమాశ్వసిల్లుము. మరల నీ పాణిస్పర్శయే రామ భద్రునికి జీవనోపాయము.

[సీత సమాశ్వసిల్లును.

వాసంతి.—ఏమి ఇంకను మూర్ఛ లేరఁడు! హా! ప్రియసఖి సీతా! ఎక్కడ నున్నావు! నీ జీవితేశ్వరుని సంభావింపుము.

[సీత పడిపడిగాఁ దఱిసి ఎదయందును నొసటను దాఁకును.

వాసంతి.—ఆహా! రామభద్రుఁడు మరల చేతనం బొందినాఁడు!

రాము.—

తే. అమృతమయ లేపములఁ జిక్క నలఁదె నాఁగ
దైహికములను లోవెలిధాతువులను,
స్పర్శ మాకస్మికము నన్ను బ్రదుకఁజేసి
హర్షమున నొండువగ మోహమందు ముంచె. ౩౨

[ఆనంద నిమీలితాక్షుఁడుగానే] సఖి, వాసంతి. సంతోషము, నీవు వర్ధిల్లు చున్నావు.

వాసంతి.—ఎట్లు!

రాము.—సఖి, వే ఱే మున్నది? జానకి మరల దొరకినది.

వాసంతి.—ఓయి దేవరా రామభద్రుఁడా, ఎక్కడ నయ్యా యామె?

రాము.—[స్పర్శసుఖ మభినయించుచు] ఇదె ఎదురనే.

వాసంతి.—హా దేవా, ప్రియసఖీదుఃఖదగ్ధను మందభాగ్యను నన్ను ఏల యిట్లు మర్మచ్ఛేదదారుణములైన ప్రలాపములచేత మరల దహించెదవు.

సీత.—నేను ఆపలి కరుగఁ గోరుచున్నాను. దీర్ఘదారుణంబునే యైనను నా సంతాపమును క్షణములో పోనడంచుచున్న చిరసద్భావ సౌమ్యశీతలంబైన యీ యార్యపుత్త్ర స్పర్శచేత నా హస్తము వజ్రలేపోపనిబద్ధముంబోలె చెమర్చుచు కీ లెడలినట్లు తడంబడుచు వశము దప్పి వణఁకుచున్నది.

రామ.—సఖి, ప్రలాపము లనెద వేమి?

మ. మును పుద్వాహమునందుఁ గంకణధరంబుగా దేనిఁ గైఁగొంటినో,
అనుభూతంబో సుధాహిమంబు చిరమే యత్స్పర్శ మిచ్ఛారతిన్,

సీత.—ఆర్యపుత్త్రా, ఆతఁడవే యిపుడు నీవు.

రామ.—

పునరాత్తంబగ దే యదే లవలిక్రొమ్మొల్కం బిసాళించు నా
వనితారత్నము కేలుఁదమ్మి కరకాప్రాలేయ సౌభాగ్య మై. 33

[అని గ్రహించును.

సీత.—అహో! కట్టా! ఆర్యపుత్త్రుని స్పర్శచేత మోహితనయిన నాకు ప్రమాదము సంభవించినది!

రామ.—సఖి వాసంతి, ఆనంద నిమీలితేంద్రియుండను నిద్రాణచేత వివశుఁడను. కావున నీవు ప్రియసఖిని ఇంచుక సేపు పట్టుకొమ్ము.

వాసంతి.—కట్టా ఉన్మాదమే అయినదే.

[సీత వడిగా చేయి లాగికొని అపసరిల్లును.

రామ.—హా, ఇసీ, ప్రమాదము!

ఆ. పల్లవోపమంబు పరిగళితం బయ్యె
జడమునుండి జడము సరగ నిపుడె.
వేపినుండి వేపి స్వేదినుండియు స్వేది
నాకరంబునుండి నాతికరము. 34

సీత.—ఆర్యపుత్త్రుని నయనములు అవ్యవస్థితముగా స్తిమితములును మూఢములును నుడియుచునియుండగా నున్నవి. ఆర్యపుత్త్రుఁడు ఇంకను తన్ను తుదుటికిం దెచ్చుకొలేదు.

తమస.—[స్నేహ పాశ కౌతుకములతో, నిర్వర్ణించి]

తే. స్వేద రోమాంచ వేపథు స్థితగాత్రి
యయ్యె బాల ప్రియస్పర్శ హర్ష మునను,
కరువలికిఁ దోలఁబడికిఁ గ్రక్కదలి తడిసి
క్రొత్త ననుచు కదంబంపుఁ గొమ్మవోలె. 35

సీత.—[స్వగతము] అహో! అవశతచే నిట్లయి తమసాభగవతిచేత లజ్జిత నైతిని! ఈమె యేమి తలంచునోగదా, 'ఈ పరిత్యాగ మేమి ఈ హృదయాసంగ మేమి?' అని.

రామ.—[కలయంగని] హా! ఏమి? లేనే లేదే! ఓ కరుణాహీనురాలా వైదేహీ!

సీత.—సత్యము కరుణాహీననే నేను. ఎట్లన, ఇట్టి దశలో నున్న నిన్ను చూచుచు ప్రాణము ధరించియే యున్నానుగదా.

రామ.—ఎచట నున్నావు? అనుగ్రహింపుము, ఈ దశలో నున్నవానిని నన్ను విడనాడుట నీకుం దగదు.

సీత.—ఆర్యపుత్త్రుఁడా, ఇది విపరీతముగా నున్నది!

వాసంతి.—దేవరా, అనుగ్రహింపుము అనుగ్రహింపుము; మితిమీఱిన విప్రలంభము పాలయిన నిన్ను నీ లోకోత్తర ధైర్యముచేతనే నిలుపరించుకొనుము. నా ప్రియసఖి ఇట లేదే?

రామ.—నిజముగానే లేదు. అట్లు కాదేని, వాసంతికి ఏల యగపడదు. ఇదేమి కలయా, నిద్ర పొందనైతిఁగదా. కాక, రామునికి నిద్ర యెక్కడిది? నిశ్చయముగా నిరంతర సంకల్ప పరంపరా పరికల్పితమయిన చిత్తభ్రమయే అపరిమేయ మహిమగలది. మాటిమాటికి నన్ను వెంటనంటుచున్నది.

సీత.—నేనే క్రూరురాలను ఆర్యపుత్త్రుని వంచించితిని.

వాసంతి.—దేవా, చూడు చూడు.

మ. అసురాధీశుని యుక్కుఁదే రిదె జటాయ్వాఘాత భగ్నంబు, ము
న్నెసఁ దద్యోగ్య పిశాచతుండ ఖరపంక్తి స్ఫీతకంకాళముల్,
అసికృత్తోరు జటాయుపక్షుఁ డయి దీవ్యచ్ఛంప మద్దంబు నా
వెసఁ గోపోజ్జ్వల సీత నెత్తికొని విన్వీథిన్ జనెన్ సోఁ కిటన్. ౩౬

సీత.—[సభయము] ఆర్యపుత్త్రా! నాయనను చంపుచున్నాఁడు! నన్నపహరించుచున్నాఁడు! రక్షింపు రక్షింపు!

రామ.—[వేగమున లేచి] ఆ! పాపాత్ముఁడా! తాత ప్రాణ సీతాపహారీ! ఎట కేఁగెదవు?

వాసంతి.—దేవరా, రాక్షసవంశప్రళయ ధూమకేతూ, ఇప్పుడును నీ కోపము నకు విషయము కలదా?

సీత.—అహో ఉన్మత్త నయితిని గదా.

రామ.—ఇప్పుడు వాస్తవముగా ప్రలాపమే చేసితిని. అట్టిది గాదు ఇప్పుడీ విపర్యయ మెందుగా సంభవించినది.

చ. సరవి నుపాయపంతము నజస్రవినోదము నై ప్రవీర సం
హారణముచే జగంబున మహాద్భుత మై మదిరాక్షితోడ ము
న్విరహము సహ్య మయ్యె నరినిర్మథనావధి. యిప్పు డన్ననో
నిరవధి నిష్ప్రతిక్రియము నిష్పరిదేవిత మెట్లు సహ్య మా. ౩౭

సీత — నిరవధి యని హా చెడితిని మందభాగ్యను! [అని ఏడ్చును.

రాము — హా! కష్టము!

చ. ఎచటఁ గపీంద్రు చెల్మి వృథ, యెచ్చటఁ గ్రోఁతులశక్తి వమ్ము, వ
మ్మెచటను జాంబవన్మతి, యనీశుఁ డెటం జన వాయుసూనుఁడుం,
ఎచటికిఁ ద్వష్టృసూతి నలుఁ డేనియుఁ జేయఁగ లేఁడు దారిఁ, దా
నెచటికి లక్ష్మణేషువులు నేఁగవ, యం దెట నుందువే సఖీ! ౩౮

సీత — పూర్వ విరహమును బహుమానించుచున్నాను.

రాము — సఖి వాసంతి, ఇప్పుడు రామునిం జూచుట సఖులకు దుఃఖమునకే. కావున, ఎంతసేపు నిన్ను ఏడిపింతును? మఱి నాకు పోవ ననుజ్ఞ యిమ్ము.

సీత — [ఉద్వేగముతో తమసను పట్టుకొని] భగవతి తమసా ఏమి ఆర్యపుత్త్రుఁడు పోనేపోవునే!

తమసా — బిడ్డా, ఊఱడిల్లు మూఱడిల్లుము మనమును చిరంజీవు లగుకుశలవుల వర్షవర్ధన మంగళములను నెఱవేర్చుటకు భాగీరథీ పాదమూలముం జేరుదము.

సీత — భగవతి, అనుగ్రహంబున సెలవిమ్ము, దుర్లభజనుని క్షణమాత్ర మయినను కాంచెదను.

రాము — ఇప్పుడు నాకు అశ్వమేధమునకై సహధర్మచారిణి కలదు.

సీత — [ఉత్కంపముతో] ఆర్యపుత్త్రా, ఎవ రామె?

రాము — బంగారపు సీతా ప్రతిమ.

సీత — [ఉచ్ఛ్వాసముతో, సబాష్పము] ఆర్యపుత్త్రుఁడవే యిప్పుడు నీవు. అహో! నా కిపుడు ఆర్యపుత్త్రునిచేత పరిత్యాగ శల్యము తివిచివైవఁబడినది!

రాము — దానిం జూచుచు నైన సబాష్పావరుద్ధమును నేత్రమును వినోద మొందించెద.

సీత — ఆర్యపుత్త్రునిచేత బహుమానింపఁబడునది యది ధన్యగదా, ఏలన, అది ఆర్యపుత్త్రుని వినోదపెట్టున దై జీవలోకమునకు ఆశానిబంధన మైనది.

తమసా — [స్మితస్నేహాస్రములతో కవుఁగిలించి] ఓసీ బాలా, ఇది నిన్నే పొగడుకొనుట.

సీత.—[సలజ్జము, అధోముఖయై, స్వగతము] భగవతి నన్ను పరిహసించుచున్నది.

వాసంతి.—ఈ యోగమనసంవిధానమే మాయందు నీ మహాప్రసాదము. పోవలసి యున్న కార్యహాని లేకయుండునట్లు పోదగును.

సీత.—ఇప్పుడు నాకు వాసంతి ప్రతికూల యైనది.

తమస.—రా రమ్ము పోవుదము.

సీత.—[కష్టముతో] అట్లే చేయుందము.

తమస.—ఎట్లు పోయెదవు? ఏలన,

తే. తృష్ణచే నీదు నేత్రంబు తీఁగసాఁగి
నాటిన ట్లున్నయది ప్రాణనాథు మేన;
మర్మభేదపరము లుద్యమములు గూడఁ
దిగువలేకున్నయవి దాని మొగుడ, యిపుడు 3౯

సీత.—అపూర్వ పుణ్యముచేత దర్శన మిచ్చిన యార్యపుత్త్ర చరణకమలములకు నమస్కారము. [అని మూర్ఛిల్లును.

తమస.—పట్టీ, ఊఱడిల్లు మాఱడిల్లుము.

సీత.—ఎంతసేపు మేఘాంతరమున పూర్ణిమాచంద్రదర్శనము!

తమస.—అహో సంవిధానకము!

తే. రస మొకఁడె కరుణంబె కారణవశమునఁ
బడయు భిన్నత వేర్వేఱివర్తములను
అలలు బుడగలు సుడులును నను వికృతులు
నీ రెనసినట్లు, లవి యెల్ల నీరె గాదె. ౪౦

రాము.—విమానరాజ, ఇటు ఇటు.

[అందఱు లేతురు.

తమసా వాసంతులు.—[సీతారాములం జూచి]

ఆ. అవని యమరనదియు నస్మద్విధలు గూడఁ
దొలుతఁ గవితఁ గన్న కులపతియును
అల వసిష్ఠుఁ డనుగ తారుంధతీకుండు
నిత్య మంగళములు నింత్రు నీకు. ౪౧

[అని అందఱు నిష్క్రమింతురు.

తృతీయాంకము సమాప్తము.

## మిశ్ర విష్కంభకము.

[అంతట ఇరువురు తాపసులు ప్రవేశింతురు.]

ఒకఁడు.—సౌధాతకీ, నేఁడు మెండుగా సమకూర్చిన యతిథి జనులతోను, వారి సంతర్పణకొఱకు దండిగా జరుగుచున్న యారంభములతోను, వాల్మీకి భగవానులవారి యాశ్రమపదము ఎంత రమణీయముగా నున్నదో చూడు.—అట్లే గదా.—

తే. ఉష్ణ మధురంబు నివ్వరి యోదనంపు
గంజి నీవ్రాఁటబాలెంత కొంత మున్ను
త్రాఁగఁగా వేచి మిగిలినదానఁ ద్రాగు
నాశ్రమ మృగంబు తాను బర్యాప్తిగాఁగ. ౧

మఱియుం.—

తే. నేతి వంటకమునను౦డి నిగుడుచున్న
వలపు సనసన్నముగఁ దోడు కలసికొనఁగ,
రేఁగుఁబండులతోడి మిశ్రీకృతంపు
శాకపుం బాకపుం దావి సాగు దవ్వు ౨

సౌధాతకి.—నేడు నరపమాసగడ్డాలగాళ్లకి సవిశేష మైన యనధ్యాయకారణం వచ్చింది.

ప్రథముఁడు.—[విహసించి] ఓరి సౌధాతకీ, నీ కేమో పెద్దలయందు గౌరవము అపూర్వముగా నున్నదిరా!

సౌధా.—ఓరొయ్యావు భాండాయనా, ఈ పెద్ద ముసళ్ల బిడారుకు నాయకుడుగా ఇప్పుడు వచ్చాడే నారమడిధారి, అతని పే రేమోయి?

భాండాయనుఁడు.—ఛీ! చాలింపు ఎగతాళి. ఎఱుఁగవా ఋశ్యశృంగాశ్రమము నుండి అరుంధతీ పురస్కృతలను దశరథ మహారాజ భార్యలను తోడ్కొని భగవానులు వసిష్ఠులవారు వచ్చియున్నా రని! అట్లుండ విని యిట్లు ప్రేలెదవు!

సౌధా.—ఊ! వసిష్ఠుడా!

భాండా.—అవును.

సౌధా.—నే నను కొన్నాను పులో తోడేలో అని.

భాండా.—ఆ! ఆ! ఏ మంటివి!

సౌధా.—అతనుగారు వచ్చీ రాకముందే పాపం! ఆ కల్యాణిని కపిలని మడ మడ విఱిచి గుటకాయస్వాహా చేశాడే!

భాండా.—“ ‘మధుపర్కము మాంసముతోడిది’ అను వేదమును ప్రమాణీకరించి శ్రోత్రియునికి అభ్యాగతునికి కోడెను పెయ్యనుగాని ఆంబోతునుగాని చంపోతును గాని గృహస్థులు పెట్టుదురు.” అని ధర్మసూత్రకారులు పఠింతురు.

సౌధా.—ఓయి, ఓడినావు

భాండా.—ఎట్లు?

సౌధా.—ఎట్లా? వసిష్ఠమిశ్రులు రాగానే కోడెను పెయ్యని కోసినారుగదా, మఱి నేడే వచ్చిన ఆ రాజర్షికి భగవంతుడు వాల్మీకి పెరుగు తేనెలతో మాత్రమే మధుపర్కం పెట్టినాడు, కోడెను పెయ్యని చంపలేదు.

భాండా.—మాంసము వదలినవారికి ఈ కల్పమును ఋషులు అవలంబింతురు. ఆ మహనీయుండు జనకుడు మాంసమును వదలినవాఁడు.

సౌధా.—ఎందుకు వదలినాడు?

భాండా.—ఆయన సీతాదేవికి కలిగినట్టి దుర్విపాకమును విన్నప్పుడే వైఖానస వ్రతమును పైకొన్నాఁడు. అది మొదలు, చంద్రద్వీప తపోవనములో ఇన్ని సంవత్సరములు తపస్సు గావించినాఁడు.

సౌధా!—అక్కడినుంచి యెందుకు వచ్చాడు?

భాండా.—చిరకాల ప్రియమిత్రుని వాల్మీకిని చూచుటకు.

సౌధా.—వియ్యపురాల్నిని ఈయన దర్శించినాడా లేదా?

భాండా.—ఇప్పుడే వసిష్ఠ భగవంతులు కౌసల్యాదేవికి అరుంధతీ భగవతిచే చెప్పి పంపినారు:—“స్వయముగా పోయి వైదేహుని దర్శింపవలసినది.” అని.

సౌధా.—మఱి యీ ముదుకలు ఒకరితో ఒకరు కలుసుకొన్నట్లే మనమున్ను వటువులతో గూడుకొని అనధ్యాయ మహోత్సవాన్ని ఆటలచే నెఱవేర్చుదాము.

[అని పరిక్రమింతురు.

భాండా.—ఇతఁడే ఆ బ్రహ్మవాది పురాణరాజర్షి జనకుఁడు వాల్మీకిని వసిష్ఠుని ఉపాసించి యిపుడు ఆశ్రమమునకు వెలుపల చెట్టుమొదట కూర్చున్నాఁడు; ఈయన,—

తే. మానసములోన నిత్యత నూనినట్టి
భూసుతాశోకమునఁజేసి పొగలుచుండు,
లోనఁ గార్చిచ్చు పర్వ ననూనగరిమఁ
గాలుచుండెడు జీర్ణ వృక్షంబు పోలె. 3

[నిష్క్రమింతురు.

మిశ్ర విష్కంభకము సమాప్తము

## చ తు ర్థా ం క ము.

[అంతట జనకుఁడు ప్రవేశించును.]

జనకుఁడు.—

శా. ఘోర ప్రక్రియ వైశసం బడి సుతం గ్రుంకించి నాగుండియన్
స్ఫారంబై కడు వ్రచ్చి వ్రచ్చి యటఁ బెల్చన్ నాటె నేశోకమున్,
ధారావాహి పటిష్ఠమై యది చిరత్వం బయ్యె నూత్నంబు నా
హోరాహోరిగ నంపకోఁతవలెఁ గోయున్ నాదు మర్మంబులన్. ౧

అయ్యో! ఇసీ! ఇట్లు ముదిమిచేతను ఓర్వరాని దుఃఖముచేతను పైగా పరాక సాంతపన ప్రభృతి తపస్సులచేతను ధాతువులు శోషించి యెందులకుం గొఱగాని యీ పాడు దేహము ఇప్పటికిని కూలి పోక యున్నది! ఆత్మఘాతుకు ఆసుర్యము లనుపేరి యంధతామిస్రలోకములందుఁ గూలుదు రని ఋషులు తలంతురు. ఎన్ని వత్సరములు గడచినను నిరంతర పరిభావనచేత స్పష్టప్రకాశమై నా దుఃఖాతిరేకము క్రొత్తదియుం బోలె శమింపకున్నది! హా తల్లీ దేవయజనసంభూతురాలా, సీతా! నీ నిర్మాణ భాగ్యము కట్టా! లజ్జచే స్వచ్ఛందముగా ఏడ్చుటకేని శక్యము కాని యిట్టిదిగా పరిణమించినది, హా హా పుత్త్రీ!

తే. అనియత స్మిత రుదితమై హాపణుమీఱు
కొలఁది పలుఁగ్రొన్ననల కొనల్ వెలయుదాని
స్ఖలదసంగత మంజుల జల్పితమును
నీ నిసుఁగుమోము లేదమ్మి నే స్మరింతు. ౨

భగవతీ, వసుంధరా! నీవు నిజముగా అతిదృఢవు సుమా!

ఉ. ఈ వనలుం దరుంధతి మునీంద్రులు గంగ యెవర్తె పేర్మికిన్
భావకులో, య దేల, రఘువంశగురుం డగుప్రొద్దె సాక్షియో,
యీవ యెవర్తె విద్యనుఁ ద్రయింబలెఁ గంటివో, ఖ్యాతశుద్ధికే
యీవిలయంబు నట్టిసుతకే యెటు దారుణురాల యోర్చితో! 3

[నేపథ్యమున]

ఇటు ఇటు భగవతీ మహాదేవులు.

జన.—[చూచి] అహో! గృష్టి అరుంధతీభగవతికి దారి చూపుచున్నాఁడు. [లేచి] మఱి యెవరిని మహాదేవి యని పిలిచినాఁడు! [నిరూపించి] హా! ఏమి! మహా

రాజ దశరథుని ధర్మపత్ని, నా ప్రియసఖి కౌసల్య! ఆమెయే యీామె యని ఎవఁడు ఆనవాలు పట్టఁగలఁడు!

తే. సిరికరణి దశరథునింటఁ జెలఁగె నీమె
కరణి యనఁ నేల? లెస్సయా సిరియ యనుటె;
అట్టి యీామె విధివశాన నైన దేవొ
శోకమయి భూత; మేమి విపాక మహహా! ౪

ఇది పాపమయిన మఱియొక దశావ్యత్యాసము.

కం. ఆయెను ము న్నే జనము స
కాయ మగు మహోత్సవంబుగా నా, కదియే
యాయెను దుస్సహ మగపడి
గాయమునం గ్రుక్కినట్టి క్షారమువోలెన్. ౫

[అంతట అరుంధతి, కౌసల్య, కంచుకియుం ప్రవేశింతురు.]

అరుంధతి —దేవీ విను. స్వయముగా పోయి వైదేహుని చూడవలసిన దని యిది మీ కులగురువు నా దేశము. అందులకే నన్ను పంపినారు. మఱి యేల మాటిమాటికిని ఇట్లు మిక్కిలి వెనుదివియుంట?

కంచుకి.—దేవీ, నా విన్నపము చిత్తగించి మనస్సు నిబ్బరము చేసికొని వసిష్ఠ భగవానులవారి యాదేశమును జరుపుము.

కౌసల్య.—ఇట్టి కాలములో మిథిలాధిపుని చూడవలసి వచ్చె నని ఒక్కుమ్మడిగా సకల దుఃఖములును సంభవించుచున్నవి. మూలబంధనము వెల్లగిల్లుచున్న నా హృదయము నిలుపరించుకొన సమర్థను గాక యున్నాను.

అరుంధతి.—ఇందు సందేహ మేమి!

తే. మానుషుల కన్గుబంధులం బాయఁ గదురు
వనట లెంతయు సంతాన వాహు లయ్యు
నిష్ట జనమును గన్నంత నిముడ లేక
వేల వఱ్ఱులచేఁ బోలె వెల్లివొడుచు. ౬

కౌసల్య.—కోడలికి నా పట్టికి ఇట్లు సంభవించి యుండఁగా ఎట్లు ఆ రాజర్షి ముఖమును చూతును?

అరుంధతి.—

తే. ఇతఁడె మీ మేటి సంబంధి యీడ్యయశుఁడు
జనకవంశప్రభావ సంస్థాపకుండు,
ఈయనకు యాజ్ఞవల్క్య మునీంద్రుఁ డొసఁగె
బ్రాంతి మైనట్టి బ్రహ్మ పారాయణంబు. 2

కౌసల్య.—ఈయన మహారాజునకు వ్యాపయానందుఁడు, పట్టికి కోడలికి తండ్రి, రాజర్షి. హా కష్టా, మహోత్సవ పరంపరతోడి యా దినములందు ఈయనచే సంభావిత నైతిని. హా దైవమా! అది యెల్లను లేదాయె.

జన.—[సమీపించి] భగవతీ, అరుంధతీ వైదేహుఁడు సీరధ్వజుఁడు అభివాదన మొనర్చుచున్నాఁడు.

ఉ. నీవలనం బవిత్రునిఁగ నీపతి త న్నరయుక మహామహః
పావను లైన పూర్వ గురుపన్యుల కెల్ల గురుండు వాన నై,
దేవి సుషం బలేక భగవతీ భువనత్రయ మంగళావహా
భూవిహితాత్మ మాళి నయి మ్రొక్కెద దేవి యరుంధతీ నినుఁ గా

అరుం.—అక్షరమైన జ్యోతి నీకు ప్రకాశించునుగాక, ఈ తపించుచున్న దేవుఁడు పరోరజుఁడు నిన్ను పవిత్రం జేయుఁగాత.

జన.—అయ్యా, గృష్టి, ప్రజాపాలుని తల్లికి ఈమెకు అనామయముగదా?

కంచు.—[స్వగతము] నిరవశేషముగాను అతినిష్ఠురముగాను మర్మము గాఢ దూఱఁబడితిమి. [ప్రకాశము] రాజర్షి, ఈ కోపముచేతనే చిరపరిత్యక్త రామచంద్ర ముఖదర్శనయై అతిదుఃఖితయై యున్న దేవిని దుఃఖపెట్టుట తగదు. రామభద్రుఁడును పౌరజానపదులు 'ఎల్లెడలను బీభత్సపుఁ గింవదంతిని పర్వించుచు అల్పబుద్ధులు అగ్నిశుద్ధిని నమ్మరైరి గదా యను హేతువుచే దారుణకృత్యము గావించినాఁడు.

జన.—[రోషముతో] ఆ! అగ్ని యనఁగా నెవఁడు నా ప్రసూతిని పరిశోధించు టకు! కష్టా! రాముపరిభూతుల మయ్యును ఇట్లు పలుకుజనులచే మరల పరిభూతుల మగు చున్నాము.

అరుం.—[నిశ్వసించి] ఇట్లే ఇది. నా పట్టియెడ అగ్నియని లఘువు లక్షరములు, సీత యనుటయే చాలును. హా! పట్టీ.

చ. తనయునో శిష్యవో తనకు, దాని న టుండఁగనిమ్ము; నీదు పా
వనతరశుద్ధి పెంపు దృఢభక్తిని నీయెడఁ నాకుఁ గొల్పెఁ బో.

చినవయ సుంట! యింతి ప టు! సీతరో, పంద్యవ యాత్రిలోకికిన్;
గోసము లె పూజసుం బన సగున్, గొఱగాపు వయస్సు, లింగమున్.

కౌస.—అహో! పెదనలు రేగుచున్నది! [అని మూర్ఛిల్లును.

జన.—హా! ఇ దేమి?

అరుం.—రాజర్షీ, పేటేమి?

ఉ. భూసుతుం డతం, దలక్ష్మ మోదనము, లాంఛను, లాదినంబులున్,
స్మారిత మయ్యె; కూర్మి సుఖ సర్వము ని ష్టన; దానఁజేసి యీ
ఘోరవిపాకమందు ధృతిఁ గోల్పడి నీసఖి మున్గె మూర్ఛలో;
నారులమానసంబు సుమనస్సుకుమారము గాదె యారయన్. ౧౦

జన.—అయ్యో అయ్యో, ఎల్లవగలను నేను క్రూరుఁడ నైతిని; ఏలన నేను చిర కాలమునకుం గనఁబడిన ప్రియమిత్రుని ప్రియభార్యను మైత్రితో చూడనైతిని.

ఉ. ఆయన దొడ్డవియ్య, మతఁడు ప్రియమిత్రుఁ, డతండె స్వాంతమా,
నాయన రూపి హర్షము, సమస్తముసుం బురుషార్థ మాతఁడే, !
మై యగు, జీవ మాఁ, ప్రియతమం బెవి యంతటికన్న నద్ది యూ,
నేయది నాకు శ్రీలుఁడు మహీంద్రుఁడు పంక్తిరథుండు గాఁడహో!౧౧

అకటా! ఈమెయే యూ కౌసల్య!

చ. అరిదిగ నీమె కైనఁ బతి కైన సుపాంశున దోస మయ్యె నే,
నిరువు రొకళ్లొకళ్లపయి నెగ్గులు సెప్పఁగఁ బాత్ర మేనె కా.
సరసత నంతఁ గిన్కకుఁ బ్రసన్నతకు న్మతి కర్త నేన హా!
స్మరణ మ దేల వచ్చినది! మాడ్పఁ దొడంగిన దర్మి డెందమున్. ౧౨

అరుం.—హా కష్టము! ఈమెహృదయము చాలసేపు శ్వాసము నిల్చిపోయినం దున కఠిన మైయున్నది.

జన.—హా ప్రియ సఖీ! [అని కమండలూదకముతో తడుపును.

ఆ. తొలుత నెయ్యుకరణి బలుసుఖ మిచ్చుచు
నేకతానముగను హితము నేయు.
పిదప హేతుహీన విద్వేష ఘోర మై
విధి మనోగదంబు వెట్టు బిట్టు ౧౩

కౌస.—[చేతనం బొంది] హా పట్టీ జానకీ! ఎచట నున్నావు? పెండ్లికళ గొప్ప తొడపై శుద్ధమైన మందహాసాంకురములచే మనోహరమయిన నీ ముఖపుండరీకము కన్నుల యెదుటఁ దోఁచుచున్నది. బిడ్డా, వెన్నెలనిగ్గులు వెదచల్లెడు సుందరాంగక ములతో మరల నాయొడి నలంకరింపవే. ఎప్పుడును మహారాజు చెప్పుచుండును 'ఈమె రఘువంశ మహత్తరులకు కోడలేగాని మనకన్నతో జనకరాజసంబంధము చేత కూఁతురే' అని.

కంచు.—దేవి యన్నట్లే.

తే. ఏవురైనను బిడ్డలు భూవరునకు
వల్లభుఁడు మీసరముగ సుబాహురిపుఁడు.
అట్లె నల్వురు వధువులయందు సీత
యన్గుసుత శాంతవలె ప్రియ యయ్యెఁ గరము. ౧౮

జన.—హా! ప్రియసఖుఁడా, దశరథ మహారాజా! ఇట్లు నీవు సర్వప్రకార హృదయంగముఁడవై యుంటివే, ని న్నెట్లు మఱవ నేర్తును?

మ. వరు నాప్తవ్రజముఁ గా వధూపితలు సంభావింతు; రావొడ్డయా
దర మీవియ్యమునందు నయ్యె విపరీతం, బీవె న న్గొల్చుటఁ గా;
హరియించె న్నినుఁ గాల మట్టిని, హృతం బావియ్యపుస్బిజ; మీ
నర కాభీలజ గానఁ బాపతతినా నాజీవితం బిస్సిరో! ౧౯

కౌస.—నాయనా, జానకి! ఏమి చేయుదును! గట్టి వజ్రలేపముచే నంటుకొని బందన గొన్నదియుంబోలె నా పాడు జీవితము మందభాగ్యను నన్ను వీడకున్నది!

అరుం.—ఓలఁడిల్లుము రాజపుత్త్రీ! బాష్పములను గూడ నడుమ నడుమ ఆఁపు కొనవలసినదే. అదిగాక మఱచితివా ఋశ్యశృంగాశ్రమములో మీ కులగురువు చెప్పిన దానిని? అది రానేవచ్చినది. మఱి మేలొసంగఁ గలదు.

కౌస.—భగవతీ, ఆశ యుఁడిగిపోయినది.

అరుం.—అట్లైన నది అసత్యమని తలంతువా రాజపుత్త్రీ. సుక్షత్త్రియా దాని నొండుగా భావింపఁ దగదు. అది తప్పక జరుగునదే.

తే. జ్యోతి యావిర్భవించిన యుర్విసుపుల
వాక్కులందు వికల్పంబు వలదు సేయ;
వీరివాక్కున శుభ లక్ష్మి వెలయుచుండు;
విప్లవము చెంద వెందును వీరిసుడులు. ౨౦

[నేపథ్యమున కలకలధ్వని] [అందఱును విందురు.

జన.—నేఁడు శిష్టానధ్యయన మని అడ్డు లేక ఆడుకొనుచున్న వటువుల కోలాహల మిది.

కౌస.—పసితనమున సౌఖ్యము సులభము. [నిరూపించి] అహో వీరి నడుమ నెవరు వీఁడు రామభద్ర లక్ష్మీ పరిశోభితములై ఉదార ముగ్ధ లలితము లైన యవయవములచే మా కన్నులను చల్లఁజేయుచున్నాఁడు?

అరుం.—[ఆనంద బాష్పములతో, స్వగతము] ఇది గదా భాగీరథి నివేదించిన యాకర్ణామృతము. ఇది మాత్రము తెలియకున్నది, ఆయుష్మంతులు కుశలవులలో ఇతఁ డెవరో, అని.

జన.—

మ. సరసేందీవర నూత్నపత్త్ర మసృణ శ్యామాంగుఁడున్, గాకప
క్షరమాశోభిముఖుండుఁ, బుణ్య రుచిరజ్యా న్మాణ వానీకుఁడున్;
మరలన్ శైశవ మొందినాఁడు రఘువంశస్వామి నాఁపట్టినా,
నెరపున్ దోఁచినమాత్ర వీఁ డెవఁడొ నానేత్త్రంబులందున్ సుధన్.

కంచు.—ఈ బాలుఁడు క్షత్త్రియ బ్రహ్మచారి యని తలంచెదను.

జన.—అది సరియే. ఏలన:—

మ. ఇరుమైఁ గంకపత్త్ర చుంబిత శిఖై కైకేషుధిన్ వీఁపునన్,
ఉరమున్ రుర్వజినోత్తరీయముఁ బవిత్త్రోద్భాసి భస్మాంకమున్,
పరిసందానిత మౌర్వ్య మేఖల మధోవస్త్త్రంబు మాంజిష్ఠమున్,
కరమందు న్వేలు రావికోల వలయాకల్పాక్షసూత్త్రంబునున్. ౧౮

భగవతి అరుంధతీ, ఈ బాలుఁ డెవ్వరి సుతుఁ డని తలంచెదవు?

అరుం.—మేము ఇప్పుడే వచ్చినారము.

జన.—ఆర్య గృష్టీ, నాకు కడుం గుతూహలముగా నున్నది. కావున పోయి వాల్మీకి భగవానునే అడిగి రమ్ము. ఈ బాలునితోనుం జెప్పుము.—'మీ రెవరో వృద్ధులు నిన్నుఁ జూడఁగోరు చున్నారు' అని.

కంచు.—నీ యాజ్ఞ. [అని నిష్క్రమించును.]

కౌస.—అట్లు చెప్పిన వచ్చు ననియెదరా?

అరుం.—ఇట్టి నిర్మాణమునకు మంచి నడవడి తప్పునా?

కౌస.—అహా! ఏమి! గృష్టి వచనమును వినయముతో విని ఆ బాలుఁడు ఋషికుమారులను వదలి ఇటు మొగంబై వచ్చుచున్నాఁడు.

జన.—[చాల సేపు నిర్వర్ణించి] అహో ఇ దేమో గాని!

చ. వినయ శిశుత్వ మౌగ్ధ్య పరివేశిత మౌ మహిమాతిరేకముర్
గనుదుస పేనియుండు సరిగాఁగ విదగ్ధులు, గానలే రొరుల్.
కనఁబడి పేఁ డమోహము సకంప్రమునే హరియించె నామదిన్,
ఘనబల మొప్ప నిస్తు సలికం బగు చుంబక ఖండముర్ బలెన్.౧౯

లవుఁడు—[ప్రవేశించి, స్వగతము] అజ్ఞాత నామక్రమగోత్రులకు పూజ్యులకే అయినను ఎట్లు అభివాదనము సేయుదును? [ఆలోచించి] ఇది మఱి యవిరుద్ధమైన పద్ధతి యని పెద్దలవలన వినియున్నాఁడ. [వినయముతో సమీపించి] ఇదె మీకు లవుని యాదలతో ప్రణామ పర్యాయము.

అరుంధతీ జనకులు.—కల్యాణుఁడా! ఆయుష్మంతుఁడవు కమ్ము.

కౌస.—బిడ్డా, చిరకాలము జీవింపుము.

అరుం.—రా రమ్ము పట్టీ [అని లవుని ఒడిలో కూర్చుండఁబెట్టుకొని, అపవారించి] ఆహా! ఒడిమాత్రమేగాక చిరకాలమునకు నా మనోరథముకూడ సంపూర్ణమయినది.

కౌస.—బాలక, ఇటకును కొంచెము రమ్ము [అని బిగ్గ్మున నిడుకొని] ఆహా! అలంతిగ విరియుచున్న నల్లగలువవలె శ్యామలోజ్జ్వల మైన దేహబంధంబుచేతనే గాక తామర యకరులను గ్రసించి మధురకంఠ మైన రాజమరాళంపు నినాదమువోలె దీర్ఘ దీర్ఘంబైన స్వరముచేత సయితము ఈ నిసుఁగు రామభద్రునిఁ బోలుచున్నాఁడు. నీని శరీర స్పర్శయు రామభద్రుని శరీర స్పర్శవలెనే నిండార విరిసిన పుండరీకపు లోవైపువలె మృదువుగా నున్నది. బిడ్డా, నీ ముఖచంద్రుని చూచెదను [గడ్డ మెత్తి సబాష్పాకూతముగా] రాజర్షీ, కంటివా? నిపుణముగాఁ బరికించిన ఈ శిశువుముఖము నిశ్చయముగా కోడలి ముఖచంద్రునిం బోలియున్నది.

జన.—కంటిని సఖీ, కంటిని.

కౌస.—ఆహా! నా హృదయము వెఱ్ఱి యెత్తినదానివలె ఏమేమొ తలంచుచు మిక్కిలి తేలిపోవుచున్నది.

జన.—

ఉ. బాలయు నల్లుడున్ సకల భావములం బ్రతిబింబ మై రనన్
బాలుని రూపకాంతులు విభాసిలుఁ, బుట్టువినీతి యల్ల దే,
త్రాలును బల్కు నట్లె, యనఘుం బను భావము వారిదే యహో!
యేలొకో వహ! విధీ! పరువు లెత్తెడి నాచలబుద్ధి పైఁ బయిన్. ౨౦

కౌస.—బాలకా, నీకు తల్లి యున్నదా? మీ నాయనను స్మరింతువా?

లవు.—లేదు.

కౌస.—అటయిన నీ వెవ్వరివాఁడవు?

లవు.—నేను వాల్మీకి భగవంతునివాఁడను.

కౌస.—ఓయి బాలకా, చెప్పవలసిన దానిని చక్కఁగా చెప్పుము.

లవు.—నాకు ఇంతయే యెఱుక.

[నేపథ్యమున]

ఓహో సైనికులారా, కుమారుఁడు చంద్రకేతువు ఆజ్ఞాపించుచున్నాఁడు—'ఎవ్వరును తపోవన సమీప ప్రదేశములను అతిక్రమింపఁగూడదు,' అని.

అరుంధతీ జనకులు.—మేధ్యాశ్వ రక్షా ప్రసక్తిచే బాలుఁడు చంద్రకేతువు ఇపుడు వచ్చి చూడ నయినాఁడు. ఆహో పుణ్యదినము!

కౌస.—వత్స లక్ష్మణుని పుత్త్రకుఁడు ఆజ్ఞాపించుచున్నాఁ డని అమృతమిందు సుందరములు అక్షరములు వినఁబడుచున్నవి.

లవు.—ఆర్యా, ఎవ రితఁడు, చంద్రకేతుఁడు?

జన.—దశరథ పుత్త్రులను రామ లక్ష్మణులను ఎఱుఁగుదువా?

లవు.—ఎఱుఁగ కేమి? వారే రామాయణ కథా పురుషులు.

జన.—అటయిన నిది యెఱుఁగమి యెట్లు? ఆ లక్ష్మణుని కుమారుఁడు ఇతఁడు చంద్రకేతుఁడు.

లవు.—అటయిన నితఁడు ఊర్మిళ కొడుకు మిథిలాపతికి రాజర్షికి దౌహిత్రుఁడు.

అరుం.—[నవ్వి] కుమారుఁడు కథా ప్రావీణ్యమును వెలియిచ్చినాఁడు.

జన.—నీ విట్లు కథయందు ప్రవీణుఁడ వని, మఱి యడిగెదను చెప్పుము; ఆ దశరథ పుత్త్రులకు ఏయే పేరుల యపత్యములు ఏయే భార్యలయందు జనించినారు?

లవు.—ఈ కథాంశము మేము గాని ఒరులుగాని విన్నది గాదు.

జన.—ఏమి? కవి రచింపలేదా?

లవు.—రచించినాఁడుగాని ప్రకటింపలేదు. అందులోనే వేఱు సందర్భమున నిదో యొక భాగమును రసోత్కటముగ అభినయార్హముగా రచించినాఁడు. దానిని భగవంతుఁడు వాల్మీకి తన చేతితో స్వయముగా లిఖించి నృత్త గీత వాద్య ప్రయోగ సూత్రధారునికి భరతమునికి పంపినాఁడు.

జన.—ఎందులకు?

లవు.—ఆ భగవంతుఁడు దానిని అచ్చరలచేత ఆడించునుగాక యని.

జన.—ఇదంతయుం మాకు ఆశ్చర్యముగా నున్నది.

లవు.—సుగృహీత నామధేయునికి వాల్మీకి భగవంతునికి దానియందు ఆస్థ కడు దొడ్డది. కావుననే ఏ శిష్యులచేత నిచ్చి ఆ పుస్తకమును భరతాశ్రమమునకుం బంపినాఁడో, వారికి తోడుగా ప్రమాదోచ్ఛేదనమునకై ధనుష్పాణిని నా భ్రాతను పంపినాఁడు.

కౌస.—నీకు భ్రాతకూడఁ ఉన్నాఁడా?

లవు.—ఉన్నాఁడు, ఆర్యుఁడు కుశుఁ డని పేరు.

కౌస.—నీవు జ్యేష్ఠుఁ డని చెప్పిన ట్లయినది.

లవు.—అవును, పుట్టుక క్రమములో అయన పెద్దవాఁడు.

జన.—ఏమి ఆయుష్మంతులు కవలా?

లవు.—అవును.

జన.—వత్సా, చెప్పుము, ప్రకటించిన కథాభాగము ఎంతదనుక వచ్చినది?

లవు.—పట్టి పౌరాపవాదమునకు జడిసి రాజు వెడలనడిచినదానిని దేవయజన సంభూతను సీతాదేవిని ఆసన్న ప్రసవవేదనచే ఒంటిదానినిగా అడవిలో వదలి లక్ష్మణుఁడు మరలిపోయెను.—అన్నంతదనుక.

కౌస.—హా! పట్టీ ముగ్ధా చంద్రముఖీ! ఇప్పుడు ఏకాకినివైన నీదు మైపువ్వమునకు ఎట్టి దైవదుర్విలాస విపాకము సంభవించినదో!

జన.—హా బిడ్డా!

మ. నవ ఘోరాభిభవంబునుం బొరసి, వెంటన్ గానుపుం బ్రొద్దు సం
భవమై, నోవులు తల్లడం బిడఁగఁ, గ్రవ్యగ్రాసి సంఘంబులున్
బవిరుల్ సుట్టఁగ, భీత వై నిజము నాపట్టీ 'ననుం గావు కా
వవె నా వాయన' యంచు న స్ధలఁచుచున్ బల్మాఱు వాపోయితే!

లవు.—[అరుంధతిం గూర్చి] అమ్మా, వీ రెవరు?

అరుం.—ఈమె కౌసల్య, ఈయన జనకుఁడు.

[లవుఁడు బహుమాన ఖేదకౌతుకములతో కాంచును.

జన.—అహో దురాత్ములైన పౌరుల కరుణలేమి! అహో! రాజు రాముఁడు తొందరపడుట!

శా. ఈ విశసాశని ప్రహతి నెంతయు నారయ; నాక్రుధాగ్నికిన్
పాపి యిదే భగాలు మునిశాపమొ చాపమొ పూని మండఁగాఁ;

కౌస.—భగవతీ, రక్షింపు రక్షింపు. ప్రసమ్రాంతవ్యము కుపితుని రాజర్షిని.

అరుం.—

తే. మానఘనుల కదే యుపమానితులకుఁ
బ్రాజ్ఞ సమ్మత మగునట్టి పావితంబు;
రాజ, నీ పట్టి కాఁడె శ్రీరాముఁ డనఁగ?
పాలనీయులు గారె కృపణులు ప్రజలు? ౨౨

జన.—

కా పవి రాముపై, నతఁడు గాఁడె మదాత్మజభాండ? మాదటన్
బ్రోవక తప్పునే ద్విజని పోత జర ద్విక లాబలా తతిన్? ౨౩

వటువులు—[సంభ్రమంబునం బ్రవేశించి] కుమార కుమార! గుఱ్ఱము గుఱ్ఱ మని ఒక భూత విశేషము జనపదములలో నుండు నని వినుదుముగదా, అది యిప్పుడు మనకడకు ప్రత్యక్షముగా వచ్చియున్నది!

లవు—గుఱ్ఱ మని పశుశాస్త్రమందే గాక సంగ్రామశాస్త్రమందుఁ గూడఁ బఠితము. మఱి చెప్పుఁడు దాని స్వరూపమును.

వటు—వినుము.

మ. వెనుక న్దోఁకను దాల్చు విప్పుగ, సదా వే దాని నాడించెడిన్,
మొనయున్ దీర్ఘముగాఁగఁ గంఠము, ఖురంబు ల్దానికి న్నాల్గె సూ,
తిను లేఁబచ్చిక, నామ్రమాత్రములుగా దించున్ శకృత్పిండముల్
చను దూర మ్మది, యేల వర్ణన? కనన్ జన్నెమ్ము, రా, రా, వెసన్. ౨౪

[అని దఱిసి అజినమునం జేతులనుం బట్టుకొని లాగుదురు.

లవు—[సకౌతుక కోపరోధ వినయముగా] పెద్దలారా, చూడుఁడు చూడుఁడు మీరు నన్ను లాగికొని పోవుచున్నారు. [త్వరగా పరిక్రమించును.

అరుంధతీ జనకులు—ముద్దులాఁడు కుతూహలమును సెలవేర్చుకొనును గాక.

కౌస—భగవతీ, మీరిం గనుచుండనేని బ్రదుక నని తోఁచుచున్నది. కావున ఒండెడకేగి చూచెదముగాక అరుగుచున్న దీర్ఘాయుంవును.

అరుం—వాఁడు కుతూహలంబున అప్పుడే దూర మేఁగినాఁడు, నీ కెట్లు కనఁబడును?

కంచుకి—[ప్రవేశించి] భగవంతులు వాల్మీకివారు సెలవిచ్చినారు:—"దీనిని మీరు సమయములో ఎఱింగెదరు," అని.

జన.—ఇదేమో అతి గంభీరము కాఁగలదు. భగవతీ అరుంధతీ; సఖీ కౌసల్యా, ఆర్యుఁడా గృష్టి, స్వయముగానే పోయి భగవంతుని ప్రాచేతసుని దర్శింతము.

[వృద్ధవర్గము నిష్క్రమించును.

వటు.—కుమారా, ఆ వింతను జూడు.

లవు.—చూచితిని, గ్రహించితిని. నిశ్చయముగా నిది అశ్వమేధపు గుఱ్ఱము.

వటు.—అ దెట్లు తెలియును?

లవు.—ఓరి మూర్ఖులారా, చదివితిరే మఱి ఆ కాండములో. ఏమి చూడరా! ప్రత్యేకము నూఱుగురు కవచధరులు దండాయుధులు తూణవంతులును రక్షకులు; అట్టి వారితో మెండుకొనుచు ఈ దండు కనఁబడలేదా? నా మాట నమ్మలేరేని పోయి అడుగుఁడు.

వటు.—ఓహోయి, ఎందులకయ్యా ఈ గుఱ్ఱము పరివారము గలదై సంచరించుచున్నది?

లవు.—[ఆసలో, ఆత్మగతము] అహో! అశ్వమేధ మనునది విశ్వవిజయులైన క్షత్త్రియులకు స్వమహిమ ప్రఖ్యాపకము ఇతర క్షత్త్రియుల నెల్ల నవమానించునది ఉత్కర్షము పరీక్షించు గొప్ప యొరగల్లు.

[నేపథ్యమున]

తే. అశ్వ మిదె, కేతనం బిదె, యంతె గాక,
సప్త లోకైక వీరుఁడై త్రైతలంబు
నదశముఖకులముగఁ జేసినట్టి తేని
వీర వాదంపుఁ జాటింపు విశ్వమునకు. ౨౯

లవు.—[వ్యథతోనుం బోలె] అహో! రగిలించుచున్నవి యక్షరములు!

వటు.—ఏమన్నాఁడు? ప్రాజ్ఞుఁడు గదా కుమారుఁడు.

లవు.—ఓహోయి, ఇట్లు పలికెదరే! పృథివిలో క్షత్త్రియులు లేరనుకొన్నారా యేమి?

[నేపథ్యమున]

ఓరి! మహారాజునెదుర క్షత్త్రియు లెవరురా?

లవు.—ఛీ జాల్ములారా!

తే. ఉందురే నట్టివారు తా ముంద్రు, గాక;
వింతగా నొం డి దేటి కీవెఱపుబొమ్మ?
ఏల పలుమాట? లిదె చూడుఁ, డీక్షణాన
మీా పతాకను నేను బల్మిని హరింతు. ౩౦

ఓరోరి వటువులారా, బెత్తలతోఁ గొట్టి మరలింపుఁడు ఈ గుఱ్ఱమును, ఇది రోహిత మృగముల నడుమ దేవిరించుచు చరించునుగాక.

పురుషుఁడు.——[సక్రోధదర్పుఁడు ప్రవేశించి] ఛీ ఏమిరా యీ తుంటరితనము? ఏమి పలికితివి? ఉగ్రులు నిష్కరుణులు లెక్క మించినవారు అయోధ్యులు, శిశువు పల్కినను గర్వితవాక్కును సహింపరు. శత్రువిమర్దనుఁడు రాజపుత్త్రుఁడు చంద్రకేతువు ప్రశాంతమయిన తూర్పు కాననమును కనం గుతూహలిత హృదయుఁడై పోయియున్న వాఁడు మరలి రాకముందే, ఈ చెల్లగుఱ్ఱదారిని త్వరితముగా పాఱిపొండి.

వటు.——కుమారుఁడా, ఈ గుఱ్ఱము జోలి మన కేల? నిన్ను అయోధ్య శ్రేణులు శస్త్రములు జళిపించుచు బెదరించుచున్నారు. ఇచటికి ఆశ్రమపదము దూరముగా నున్నది; కావున రమ్ము లేడి గంతులతో పాఱిపోవుదము.

లవు.——[నవ్వి] ఏమి శస్త్రములను జళిపింతురా! [విల్లెక్కు పెట్టుచు]

తే. జ్యారసన యుత్కటార్తిదంష్ట్రలను జుట్టఁ
బ్రోద్గిర ద్ఘన ఘర్ఘర సూత్కర్జనంబు
అశన సక్త కఖ తృష్ణ తాం తాస్య యంత్ర
జృంభ వికటోదరము గాత మీ ధనుస్సు. ౨౭

[యథోచితము పరిక్రమించి అందఱు నిష్క్రమింతురు.

కౌసల్యాజనకయోగ మను

చతుర్థాంకము సమాప్తము.

---

పంచమాంకము.

[నేపథ్యమున]

ఓహో సైనికులారా, దొరకినది ప్రాప్తి మనకు! ఇదిగో!

తే. దురము విని సత్వర సుమంత్ర తున్న వల్గ
దశ్వమునఁ దేర నుత్ఖాత హాననములకుఁ
గోవిదార ధ్వజంబు వ్యాఘూర్ణితముగ,
బాసటగఁ జంద్రకేతువు వచ్చె మనకు. ౧

[అంతట సుమంత్రుఁడు తోలుచున్న రథమున చాపహస్తుఁడు సాశ్చర్యహర్ష సంభ్రముఁడు చంద్రకేతుఁడు ప్రవేశించును.]

చంద్రకేతువు.——ఆర్యుఁడా, సుమంత్రుఁడా, చూడు చూడు.

తే. అలఁతి కిన్క_కుఁ గెంపార నాస్యలక్ష్మి,
వితత గుణ గుంజ దార్త్రి యా వింటిచేతఁ
గో ల్తలఁ గురియుఁ బంచశిఖుండు వీఁడు
వీర పోతుండు చములపై విశిఖహిమము. ౨

తే. ఒంటి మునిజనశిశువు సైన్యోదరమున
ననధిగత రఘువంశ నవాంకుర మనఁ,
గృత్త కరికటగ్రంథి తాంకృతి సమిద్ధ
విశిఖ నియుతుండు, నాకు బ ల్వేడ్క_ నేయు. 3

సుమంత్రుఁడు.—అయుష్మంతుఁడా,

తే. అతిశయిత సుర దనుజ మహాప్రభావు
నీకె యెనరూపువాని నీ నిసుఁగుఁ గాంచి,
కుశికనందన ముఖ రిపు విశసనమున,
ధనువు నెత్తిన రఘునందనుని స్మరింతు. ౪

చంద్ర.—ఒంటిగాని నితనిం గూర్చి పెక్కండ్రు పనివడుటం గన నామదిలో లజ్జ పొడముచున్నది.

తే. వీని శిశు నొంటి రణధురా విస్ఫురాంశు
కందళ కరాళ శస్త్రభృద్ బృందములును
స్వర్ణ ఘుంటికా ఝణఝణ త్స్యందనములు
దాన దుర్దిన గజవారిదములుఁ బొదివె. ౫

సుమం.—వత్సా, వీ రందఱు మొత్తముగాఁ బయిఁకొన్నను ఇతని నేమి సేయఁ గలరు? ఒక రొకరుగా నైనచోఁ జెప్పవలయునా?

చంద్ర.—ఆర్యా, త్వరగా తోలుము, త్వరగా తోలుము; ఏలన, ఇతఁడు మన యాశ్రిత జనముకు మెండుగా పరిమార్పం దొడంగినాఁడు! అదె చూడు:—

మ. గిరికుంజేభము లాత్తకర్ణరుజతన్ గీపెట్టి ఘూర్ణిల్లఁగా,
గురుభేరీధ్వని పుష్టముల్ గుణ మహాఘోషంబుఁ బర్వించుచున్,
స్ఫుర దుగ్రోత్ప్లుత రుండముండములచే శూరుండు చేసెన్ గదే
పరిత్యస్య ల్లయు కాల వక్త్ర విఘస వ్యాకీర్ణ లన్ భూములన్. ౬

సుమం.—[స్వగతము] ఇట్టి వీనితో నెట్లు బాలుని చంద్రకేతుని ద్వంద్వయుద్ధమున కంగీకరింతును? [ఆలోచించి] అట్లన్న నెట్లు? ఇక్ష్వాకు గృహ వృద్ధులము గదా మేము. దురము సంభవించినప్పుడు ఒండుగతి యేమి?

చంద్ర.—[విస్మయ లజ్జా సంభ్రమముతో] ఇసీ ఇసీ, నా సైన్యములు అన్ని కదలను విఱిగి పాఱుచున్నవి.

సుమం.—[రథవేగము నభినయించి] ఆయుష్మంతుఁడా, ఆ వీరుఁడు మాట విని ఈపాటి చేరువకు వచ్చినాఁడు.

చంద్ర.—[విస్మృతి నభినయించి] ఆర్యా, ఆ చెప్పినవారు ఇతని పేరే మని చెప్పినారు?

సుమం.—లవుఁ డని.

చంద్ర.—

తే. ఓలవా, యోమహాభుజ, యేల యిట్లు
సైనికులమీఁద నీకు నీసంభ్రమంబు?
నేన వచ్చితి నిదిగో నన్నే దఱిఁగుము;
తేజము లయించుఁ గావుతఁ దేజమందు. ౭

సుమం.—కుమారా, చూడు:—

తే. నీవు చీరినమాత్రఁ గ్రేణించి తిరిగెఁ
బరిని ద్రచ్చుటమాని యీ బిరుదు విసుఁగు,
ఘనరవమున కిభాలిమర్దనము మాని
వడిఁ దిరుగు దృప్త సింహకిశోరంబు వోలె. ౮

[అంతట వడిగా నుద్ధతముగా నడచుచు లవుఁడు ప్రవేశించును.]

లవుఁడు.—ఓహో రాజకుమారా, ఓహో, సత్యముగా ఐక్ష్వాకుఁడవే సుమా నీవు. ఇదే నేనును వచ్చినవాఁడనే.

[నేపథ్యమున బలు కోలాహలము]

లవు.—[ఆవేగముతో మరలి] ఇసీ! విఱిగి పాఱియుఁ మరలి వచ్చి కలనిం జొచ్చి చుట్టును ముట్టడించి సేనాపతులం నన్ను ఏయుచున్నారు! ఛీ జాల్ములారా!

ఉ. అంతటఁ బెచ్చు నీరణరసాకుల సంకుల సైన్యఘోష మ
త్యంతకరాళ మత్ప్రతిఘయం దవురేఁ గబళంబు తద్వ; క

ల్పాంత మరుద్బలేరిత మహార్ణవ వార్లహరీ ప్రపూర మ
ద్భ్రాంత కుభృద్ధతిక్షుభిత బాడబవహ్ని శిఖాతతిః బలేః.

[అని పరిక్రమించును.

చంద్ర.—ఓహోయి కుమారుఁడా,

తే. ప్రియుఁడ వత్యద్భుత గుణాతిశయత, నాకు
డానఁ జెలి వౌదు, నాది యంతయును నీద,
అని యెనర్తేమి నిజ పరిజనము మీఁద?
దోర్బలకషంబు చంద్రకేతుండు రక్షు. ౧౦

లవు.—[హర్ష సంభ్రమములతో మరలి] మహానుభావుఁ డీ సవిత్రువంశ కుమారుఁడు! ఆహో ప్రసన్న కర్కశ మీతని వీరవచన ప్రయోగము! కావున, వీరలతో నేమి? ఇతనినే గౌరవించెద.

[మరల నేపథ్యమున కలకలము.]

లవు.—[క్రోధనిర్వేదములతో] ఇసీ! ఈ పాపులు వీర సంవాదమునకు విఘ్న మాచరించుచు నన్ను ఖలీకరించుచున్నారు! [అని వారింగూర్చి నడుచును.

చంద్ర.—ఆర్యా, మాడఁదగినదానిని దీనిని చూడుము:—

తే. మోౌల నను సకుతుక దర్పమున గుఱి యిడి,
పిఱుఁద బలము లఱుమ, వీఁడు వింటి నెత్తి,
తాల్చు ద్వేధా సముత్థ వాత్యా ప్రణున్న
మాఘవత చాపధర మేఘ మంజిమమును. ౧౧

సుమం.—కుమారుఁడే యాతనిం జూడనైనను నేర్చును, నేను కేవలము విస్మయముచేత పరవశుఁడనై యున్నాను.

చంద్ర.—ఓహో రాజులారా,—

తే. నేనవే లొంటి, రథ గజ వీతిగతులు
పత్తిఁ, గవచులు మేధ్యవర్మోత్తరీయు,
ముదురువారలు లేమేని ముద్దునిసుఁగుఁ,
బైకొనెద రిది వన్నెయే మీకు మాకు? ౧౨

లవు.—[మహోత్కతో] ఏమి యిసీ ఇతఁడు నన్ను కనికరించెడిని! [ఆలోచించి] కానీ, కాలవాలేయము తప్పించుటకై జృంభకాస్త్రముచే నిపుడు సైన్యములను మ్రానుపాటొందించెద. [అని ధ్యానము నభినయించును.

సుమం.—ఏమి యిది! ఉన్నట్లే ఉండి సేనాకలకలము అణఁగిపోయినది! వత్సా, కుమారకుఁడు జృంభకాస్త్రము నభిమంత్రించినాఁ డని తలంచెదను.

చంద్ర.—అందులకు సందేహ మేమి!

తే. తమములయు నించులయు బెడిదంపుఁ బెనపు
కనెడు కంటిని గ్రస్తము క్తముగ నొంచు,
చిత్తవుపోలె మఱి చండు చేష్టఁ దక్కె;
జృంభకాస్త్రం బజితవీర్య మేచు నిజము ౧౩

సుమం.—ఆశ్చర్య మాశ్చర్యము!

శా. పాతాళోదర సాంద్ర సంతమస గుంభ శ్యామముల్ వ్యుత్తప
ద్రీతి జ్వాల కరాళ కద్రువులు పర్వెన్ జృంభకంబుల్ దివిన్
భూతాంతంబున నుద్ధతానిలము లున్మూలించి పైరువ్వ సం
ఖ్యాతీతాభ్ర తటి త్కడారగుహ వింధ్యాగ్రంబులం బోలుచున్.

వీనికి జృంభకాస్త్రములు ఎట్లు వచ్చియుండును?

చంద్ర.—వాల్మీకి మహామునివలననుండి యని తలంచెదను.

సుమం.—వత్సా, ఈయనకు ఆస్త్రములయందు వ్యవహారము లేదు, జృంభకముల యందు బొత్తిగా లేదు. ఎట్లనః—

తే. ఇవి యపత్యంబులు భృశాశ్వ ఋషికిఁ జూవె;
అతని నుండియె గాధేయు నధిగమించె.
నంత నాతని సంప్రదాయంబువలన
రామ భద్రునియందుఁ దిరంబు లయ్యె. ౧౪

చంద్ర.—ఇతరులు గూడ మేటిమొత్తములంగా పెరుఁగుచుండు సత్త్వప్రకాశ ములచే విరాజిల్లువారు, మంత్రద్రష్టలు స్వయముగా కందురు.

సుమం.—వత్సా, హెచ్చరికగా నుండుము ప్రవీరుఁడు వచ్చినాఁడు!

కుమా.—[ఒం డొరులం గూర్చి] ఆహా ప్రియదర్శనుఁడు కుమారుఁడు! [స్నేహానురాగములతో కాంచి]

ఉ. ఆతత సద్గుణోచ్ఛ్రియ మొ వారి మిథోవచన ప్రభావమో,
భూతజని ప్రసిద్ధ దృఢమూత మనస్థ చిరత్న మైత్రియో,
ఖ్యాతము గాక యుండ విధి యాఁపిన చేరువ బంధుభావమో
యీతనిఁ గాంచినంత రచియించెఁ దదేకమయంబు నామదిన్. ౧౫

సుమం.—ప్రాయికముగా ఇది జీవిధర్మము, ఏ దన—ఒక్కొక్కనియందు రస మయంబగు ప్రీతి జనించుట. దీనినే లౌకికులు తారామైత్ర మనియుం చక్షూరాగ మనియుం వ్యవహరింతురు. దానిని త్రోసి వైవరాని ప్రమాణముగా పెద్దలు వక్కాణింతురు.

తే. హేతుశూన్యం బయిన పక్షపాతమునకుఁ
గలుగ దెట్టికునే భంగ కారణంబు
స్నేహమయతంతు వయ్యది చెవరనీక
లోని మర్మాళిఁ గుట్టు ననూనపటిమ. ౧౭

కుమారులు.—[ఒండొరులం గూర్చి]

తే. మెఱుఁగిడిన రాజపట్టంపుమించు మించు
నీ వపువు నంపగములతో నెట్లు నొంతు?
ఇది దొరకినంతఁ బరిరంభ కేచ్ఛచేతఁ
బులక నిబిరీస మయ్యె నామూర్తి యెల్ల ౧౮

ఉ. కైదువు నెత్త కేకరణిఁ గ్రాంత పరాక్రము ముట్టఁగా నగుణ్?
గైదువె యాత్మ గోచరముకాని ప్రవీరునిమీఁద నేటి కౌ?
కైదువు గొన్నపేని కనిఁ గాక తొలంగిన వీఁడె యే మనుణ్?
వా! దవు నేయుఁ వీరసమయంపురసోద్ధతి స్నేహమార్గముణ్. ౧౯

సుమం.—[లవునిఁ గాంచి, సబాష్పము ఆత్మగతము] హృదయమా! ఏమి వేఱు తెఱఁగున వికల్పించెదవు!

తే. ఎది మనోరథముల కెల్లఁ దా బీజంబొ,
దైవ మాదిలోనె దానిఁ గొనియె,
తీవఁ గమిచి మున్ను కెమలించి వైచినఁ
బూవు మొగ్గ యెట్లు పొడమూఁ బిదప. ౨౦

చంద్ర.—ఆర్యా సుమంత్రుఁడా, తేరు దిగియెదము.

సుమం.—ఎందుల కట్లు చేసెదవు?

చంద్ర.—ఏల యన నీ వీరపురుషుఁడు దానం బూడితుఁ డగును, అదియుంగాక ఆర్యా, క్షత్రధర్మంబును పరిపాలితం బగును—"రథస్థులు పాదచారునితో పోరరు" అని గదా శాస్త్రజ్ఞులు పల్కుదురు.

సుమం.—[ఆత్మగతము] అయ్యో నాకు కష్టము సంభవించినది.

తే. న్యాయ్య మైనయట్టి యాచారమున కెట్లు
వాదన నన్ను బోఁటి యడ్డుపెట్టు?
అట్లు సేయ కొండె నసుమతించెదు నెట్లు
సాహసైకరసవశంపుఁ గ్రియకు? ౨౧

చంద్ర.—మా నాయనగారు కూడ వారి నాయనగారి సఖుని ధర్మసంశయముల యందు ఆర్యునే అడుగుదురే, అట్లుండ ఏల ఆర్యా ఆలోచించెదవు?

సుమం.—అయ్యమ్మంతలేఁడా, ధర్మ సమ్మతముగానే నీవు సమకట్టితివి.

క. ఇది సంగ్రామ న్యాయం,
బిది సూవె సనాతనంపు టీడిత ధర్మం,
బిది పౌరుష చారిత్రపుఁ
బదవి సుమా యనయము రఘుపంచాస్యులకున్. ౨౨

చంద్ర.—ఆర్యుని వచనము సాటి లేనిది.

క. ఇతిహాసంబు పురాణము
శ్రుతిస్మృతి ప్రోక్త ధర్మసూక్ష్మ క్రమముల్
మతిలో నసయము మీఁకే
స్థితిఁ గొనును రఘుప్రవరుల స్థితితోఁ గూడన్ ౨౩

సుమం.—[స్నేహాముతోఁ గవుంగిలించి]

తే. నిన్న మొన్నటి నసుఁగొ తా మన్నిగొనియె,
నీజనకుఁ డింద్రజిత్తునే; నేఁటి కతని
పట్టివి ప్రవీర వృత్తంబు పట్టి తీవు;
బాపు దశరథకుల మొందెఁ బో ప్రతిష్ఠ! ౨౪

చంద్ర.—[కష్టముతో]

తే. ఇనకుల జ్యేష్ఠుఁడు ప్రతిష్ఠ నెనయ కుండ
మాకులమునఁ బ్రతిష్ఠ యన్మాట యేడ!
నని యలందురుచుండురే యాత్మ లందు
మాన కితరులు ముప్వురు మాజనకులు. ౨౫

సుమం.—చంద్రకేతుని యీ వచనములు హృదయ మర్మములను విదారించు చున్నవి!

లవు.—అహో! రసము మిశ్రీభూతముగా నున్నది!

మ. నెలసు విభావితాన మహసీఁయుఁ గుముద్వతి యెట్లొ యట్లె యీ
చెలువుని నాదుదృష్టి దరిసించి ముదంబుధి నోలలాడెడిన్;
కలిత ఝణత్క్రియా క్వణిత కార్ముక మీభుజ మన్ననో సము
జ్జ్వలిత కరాలి తోల్బణరసం బనయం బనికే ప్రియంపడున్. ౨౬

చంద్ర.—[దిగుచు] ఆర్య, సావిత్రుఁడను చంద్రకేతుఁడను అభివాదనము చేయుచున్నాను.

సుమం.—

తే. అజిత మూర్జస్వి పుణ్యంబు నైనతేజు
నీకునుం దొల్లిటి కకుత్థ్సునికిని బోలె
కొఱవడని శ్రేయములకుఁగాఁ గూర్చుఁగాత
శాశ్వతుఁడు కిటివేల్పు ప్రసన్నుఁ డగుచు. ౨౭

మఱియుః—

సీ. త్రయ్యాత్మ దేవుండు త్వద్గోత్రకందంబు
సవిత గాచుత నిన్ను బవరమందు,
గురుఁడు నీకును నీదు గురులకు నైత మా
శీర్వదించుత నిన్ వసిష్ఠమౌని,
వార్ధక శ్రవసములు వైనతేయంబులు
సామీరణములు వైశ్వానరములు
ప్రాచేతసములు నౌ బలపరాక్రమములు
నీయందుఁ దిరములై నెగడుఁగాక,
తే. అన్నిటికి హెచ్చుగా నీకు నచ్చుఁగాత
జయము శ్రీరామ లక్ష్మణ శయవిహారి
చాపశింజినిఁ బుట్టి రక్షఃపరిబృఢు
మానస మగల్చు టంకార మంత్రఘోష. ౨౮

లవు.—కుమారా, నీవు రథము దుండినట్లే మిక్కిలి శోభించెదవు. వలదు, ఆత్యాదరము వలదు.

చంద్ర.—అటువంటి మహాభాగుండు కేల్పొందు రథము నలంకరించుచుండుఁగావుత.

లవు.—ఆర్యా, లే రెక్కింపుము రాజపుత్త్రుని.

సుమం.—నీవును చంద్రకేతుని వచనము నంగీకరింపుము.

లవు.—నిజోపకరణముల నుపయోగించుటకు విచారమేల? కాని మేము అడవిలోఁ బెరిఁగినవారము, రథచర్య నెఱుంగము.

సుమం.—వత్సా, దర్ప సౌజన్యములకు తగినట్లు ఆచరించుటకు ఎఱుఁగుదువోయి. ఇట్టి నిన్ను ఐక్ష్వాకుఁడు రాజు రామభద్రుఁడు చూచినచో స్నేహముచేత అతని హృదయము కరంగి ప్రవహించును.

లవు.—ఆర్యా, ఆ రాజర్షి దొడ్డవాఁ డని వినికి. [సలజ్జముగానుం బోలె]

ఉ. ఏమును నీక్రియన్ క్రతుల కెగ్గొనరించెడుపాటి గాము సూ;
భూమిపు నెవ్వఁ డాయన నపూర్వ గుణోజ్జ్వలు మెచ్చుఁడై నను‌న్,
ఆమెయి సర్వబాహుజ భుజౌజము ధిక్కృతిసేయు నశ్వ ర
క్షా మను జాతివాదము వికారము గొల్పెను మానసంబున‌న్.—౨౯

చంద్ర.—[సస్మితము] ఏమి నీకు నాయన ప్రతాపోత్కర్షమందును అసహనమా!

లవు.—అసహన ముండుఁగాక లేకుండుఁగాక. ఒకటి యడిగెదను. ఆ రాజును రాఘవుని దాంతుఁడని విందుము. అయన తాను గర్వితుఁడు గాఁడు, తత్ప్రజలయందును గర్వము కలుగదు. అట్లుండ అతని మనుష్యులు రాక్షసవాక్కులను పలుకుచున్నారేమి?

ఆ. ఋషులు వెత్తినుడువు దృప్తుని నుడువును
జాటినారు రాక్షసం బటంచు;
ఎల్ల వైరములకు నల్లదే తల్లి సూ,
ఎల్ల లోకముల కదే యలక్ష్మి. ౩౦

ఇట్లని గదా దానిని వందింతురు. ఇతరము నిట్లు స్తుతింతురు:—

తే. కోర్కులను బిండు, దురితముఁ గూలఁజిమ్ము,
నీనుఁ గీర్తి, నలక్ష్మిని బో నదల్చు;
దాని మంగళములమాత సూనృతోక్తి
ధీరులు వచింపుదురు కామధేను వంచు. ౩౧

సుమం.—పావన స్వభావుఁ డీకుమారుఁడు వాల్మీకి శిష్యుఁడు. ఋషి యొసంగిన సంస్కారముచేత కరము విస్మృత మగుదానిం బలుకుచున్నాఁడు.

లవు.—చంద్రకేతుఁడా, నీ వంటివే "వాయన ప్రతాపోత్కర్షమందు సయి తము నీకు అసహనమా" అని, దానింగూర్చి యడిగెదను:—నియత విషయములా ఏమి క్షత్ర ధర్మములు?

సుమం.—ఐక్ష్వాకుని దేవుని ఎఱుంగవు. కావున, అతిప్రసంగము మానుము.

క. ఎక్కటివై సైనికులను
జక్కాడితి బిరుదు మెఱసి, సత్యము; కానీ.
యక్కజుని జామదగ్న్యుని
నుక్కు మడఁచినతని నీకు నొప్పునె యాడన్. ౩౨

లవు.—[సహాసము] ఆర్యా, ఆ రాజు జామదగ్న్యుని దమించినాఁ డని ఏమి పెద్ద వాదముగా నున్నదే!

తే. నిజము వాక్కున వీర్యంబు ద్విజుల కుండు,
బహు వీర్యంబొ యది యుండు బాహుజులకు,
జామదగ్న్యుండు పాఱుండు శస్త్ర మంటె,
నతని నణఁచిన యారాజు నుతికిఁ దగునె? ౩౩

చంద్ర.—[వ్యథతోసుంబోలె] ఆర్య ఆర్యా, ఏల యీ మాట పై మాట!

ఉ. ఈతఁ డెవండొ యిప్పుడె మహిన్ వెలసెన్ బురుషుండు క్రొత్తగా!
నీతఁడు వీరుఁగాఁ గొనఁ డటే భగవానుని జామదగ్న్యునిన్!
ఆతత సప్తలోక సతతాభయదాన ధురంధరంబు వి
ఖ్యాతిగ తాతపుణ్య చరితాద్భుత మేని యెఱుంగఁ డయ్యరే! ౩౪

లవు.—రఘునాథుని చరితమును మహిమను ఎవఁ డెఱుంగఁడు. చెప్పినం గొంచెము చెప్పవలసినదియుం గలదు. అది యేని ఎందులకులే!

ఉ. ఉందురు జ్యాయసుల్ తడవ నొప్పదు వారిచరిత్ర యుండ నీ;
సుందుని నాతిఁ గూల్చిన విశుద్ధయశోనిధుల మ్మహామహుల్;
ముందడుగుల్ ఖరాజి నవి మూఁడడుతో భయముల్ సెలంగవే?
యింద్రజు నేయునేర్పును నెల్లజనంబులు మెచ్చుకొన్న దే! ౩౫

చంద్ర.—తాతదూష భిన్నమర్యాదుఁడా! అతిగా ప్రేలుచున్నావు!

లవు.—ఆహో, నా మీఁదనే కోపము ముడించినాఁడే!

సుమం.—నీకీ కోపము తేలినది, కావుననే.

మ. తలకట్టుల్ గుదియించుచుఁ గ్రోధజని తోత్కంపంబు, స్ఫారాంబకం
బులు రక్తోత్పలకల్పముల్ స్వయముగాఁ బొందెన్ బయిన్ రక్తిమన్,
పొలుచున్ వక్త్ర మకాండతాండవ కన దృూభ్రియుగ్మ భంగంబుచే
నెల నుత్ఫుల్లకళంకమున్ నలము నున్నిద్రాళినిం బోలుచున్. 36

కుమారులు.—మఱి యిటనుండి పోరాటమునకుం దగిన తావునకు నడుతము.

[అని యందఱు నిష్క్రమింతురు.

కుమార విక్రమ మనెడి

పంచమాంకము సమాప్తము.

---

విష్కంభము.

---

[అంతట ఉజ్జ్వలం బగు విమానమున విద్యాధర మిథునము ప్రవేశించును.]

విద్యాధరుఁడు.—ఏమి యీ యాశ్చర్యము! ఈ సూర్యవంశ కుమారుల దబ్బాటు పోరితములో క్షాత్త్రలక్ష్మి ప్రజ్వలిత మగుడు తదీయ విక్రాంత చర్యలు దేవాసురులనుం గూడ అబ్బురంబొందించి కబ్బిబ్బు గొల్పుచున్నవి. అది యెట్లన్న—ప్రేయసీ, చూడు చూడు.

తే. క్వణిత కింకిణీ ఝణఝణ త్కంకణమున
గురుగుణాటనీ కృత కరాళ రణితమున
వింట గొరకలు గురియు నీవీరుల యని
భువన భీషణ మేచు నద్భుతము మీఱి 1

క. ఇరువుర కల్యాణముకై
శరధర గంభీర గర్జచాడ్పున నులియన్
సుర దుందుభు లివె కడుకొని
దురదుర నభమందు దుందు దుందు మ్మనుచున్. 2

తావున నిపుడు ఎడతెంపు లేక వీరిపై విండార విరిసిన యందంపుఁ బసిండి క్రొత్త మ్ముల దట్టంపుఁ దంపరలతోడను, కల్పవృక్షముల మణిక్రొమ్మొగ్గ ముత్తముల తేనె బొట్టులతోడను నింపారుపట్టి పూలవాన గురియుంగాక.

విద్యాధరి.—అటయితే ఏమి యిది ఆకస్మికంగా పేలిన మెఱుపు తీగలవిందు మూలతగా క్షణంలో ఆకాశమంతా పసుపు పూతేసినట్లయినది!

విద్యాధరుఁడు.—ఇ దేమి యిప్పుడు!—

క. సురశిల్పి నిజదుహితకై
తనువడినిడ సుడియు చెఱయు తరణిమహాస్సో?
స్మరహరుని ఫాలదేశముఁ
బొరసిన చిచ్చుఱుకుకంటి పుటభేదంబో? 3

[ఆలోచించి] ఆ తెలిసినది. బాలుఁడు చంద్రకేతువు ఆగ్నేయాస్త్రమును ప్రయోగించినాఁడు. ఇది దాని నిప్పుకుప్పలు పర్వవెళ్లిదము. అట్లే ఇపుడు:—

తే. కమరి డాల్జల్లులును గర్బురములు గాఁగ
నోహటిల్లి పఱచె వెస ద్యోకరథాళి.
కేతన పటాంచలములందుఁ గీల లొందె
మసృణ ఘుసృణచ్ఛురణ విభ్రమమును క్షణము. ౪

ఆహా! లేవనే లేచినాఁడే గండుమీఱు పిడుగుఁ దునియలవలె భెట్టిదంబులగు మిడుంగుఱుల విరివితో, నిడుద మొత్తములుగా నెగఁబ్రాఁకి నాకుచున్న జ్వాలల సంభారములతో భయంకరుఁడై యగ్ని భగవంతుఁడు! ఇతని వేఁడి ఇక్కడికిని దుస్సహముగానే యున్నది. కావున ప్రియను నా యొడలితోఁ గప్పి దవ్వుగాఁ బోయెదను.

[అట్లు చేయును.

విద్యాధరి.—బాపురే! విమలంపు ముత్తెసరంపు మున్నని నిండుతాకుడువంటి నాథుని నెమ్మేని తాకుడుచేత సంతోషాన కళ్లు మూతపడి నా వేడి అఱిపోయినట్లుంది.

విద్యాధరుఁడు.—ప్రాణేశ్వరీ, ఇట నేనేమి చేసితిని! అయినను,

క. ఎది ప్రియజన మగు నెవరికి,
నది యేమో వింతద్రవ్య మగు వారలకున్;
అది తా నేమియుఁ జేయక,
విదుల్చు దుఃఖముల సౌఖ్య వితతులచేతన్. ౫

విద్యాధరి.—ఏమి యిది! ఎడంలేక దువాళిస్తూ సుడులుపడుతూవున్న మెఱుపు తీఁగలనేటి పాంపుల యలంకారంతో, పొగరెక్కిన నెమళ్ల మెడలలాగ శ్యామలమైన నీటి మబ్బులు ఆకాశమంతా ఆవరించినవి!

విద్యాధరుఁడు.—సఖీ, ఆ కుమారుఁడు ప్రయోగించిన వారుణాస్త్రంపుఁ బ్రభావము మహా యుంది! ఏమీ! తెఱపి లేక కురిసిన జలధారా సహస్రములు ఒక్కుమ్మడిగా పడుటచేత ఆగ్నేయాస్త్రము అడఁగిపోయినది!

విద్యాధరి.— ఇది నాకు ప్రియము.

విద్యాధరుఁడు.—హా! ఏదైనను మిక్కుట మగు నేని చెఱుపే. ఎట్లన—ప్రాణి లోకమెల్ల పెనుగాలి పెట్టెడి క్షోభచేత లోఁతుగా నుఱుముచున్న మేఘములచేత దట్టమయిన యంధకారములో బద్ధమై,—ఒక్కుమ్మడిగా విశ్వము నెల్ల మ్రింగ నుంకించుచు వెడలుపుగా భయంకరమైన నోటిని తెఱచిన నీలకంఠుని కంఠ కుహరములో ఉరలుచున్నదియుం బోలెను, యుగాంత కాలపు యోగనిద్రా నిరుద్ధ నవద్వారుం డయిన నారాయణుని యుదరంబునం జొచ్చినదియుం బోలెను, కంపిల్లుచున్నది. బళీ! వత్సా చంద్రకేతూ, బళీ! సమయమునకు వాయవ్యాస్త్రమును బ్రయోగించితివి. దానివలన,—

ఆ. పలు వివర్తములును బరమాత్మ లోపలఁ
తెలివిచే లయించు తెఱఁగు దోఁప,
ఎక్కడనో లయించె లెక్కకు నెక్కు డౌ
కార్మొగుళ్లు విసరుగాడ్పుచేత. ౬

విద్యాధరి.—నాథా, ఎవ రీయన, వడిగా నెత్తిన చేత్తో వస్త్రాంచలమును ఆడిస్తూ దూరాన్నుంచే తియ్యని మాటలతోటి యుద్ధ వ్యాపారాన్ని మానిపిస్తూ ఈ కుమాళ్ల నడమ విమానం నుంచి దిగుతున్నాడు?

విద్యాధరుఁడు.—చూచి, ఈయన శ్రీరామభద్రుఁడు శంబూకవధము గావించి మరలినాఁడు.

తే. ఆ మహా పురుషుని శబ్ద మాలకించి
దాని మన్నించి లవుఁడు యుద్ధంబు మానె,
జంద్రకేతుండు ప్రణమిల్లె సంభ్రమమున;
శుభము రా జొందుఁ గావుత సుతులఁ గూడి. ౭

కాన మన మిటనుండి వెడలి పోవుదము. [నిష్క్రమింతురు.

విష్కంభకము సమాప్తము.

## షష్ఠాంకము.

[అంతట రాముఁడు, లవుఁడు, ప్రణతుఁడు చంద్రకేతువును ప్రవేశింతురు.]

రాముఁడు.—[పుష్పకమునుండి దిగుచు]

తే. చంద్రకేతుండ, రవికుల చంద్రమసుఁడ,
కడువడిగ రమ్ము నను బిగ్గఁ గౌఁగిలింపు;
హిమశకలశీత భవదంగకములచేత
నాఱుఁగాత నా చిత్త దాహంబు కూడ. ౧

[లేచి, ప్రేమతో కవుంగిలించి] దివ్యాస్త్రధారిదేహమువానికి నీకు కుశలమా?

చంద్ర.—అత్యద్భుతక్రియుఁడును ప్రియదర్శనుండు నగు లవుని స్నేహభాగ్యము దొరకినందున కుశలము. కావున విన్నవించుకొనెదను—నాయనగారు ఈ వీర ప్రకాండుని నన్నుఁగా నేగాని, అంతకన్న ప్రేమతోడికంటితోఁగాని చూడవలయును—అని.

రాము.—[లవుని నిరూపించి], సంతోషము. నీ చెలికాఁడు ఈ బాలుఁడు అతి గంభీరాకారుఁడుగా నున్నాఁడు.

ఉ. ప్రోవఁగ లోక సంఘమును మూర్తి ధరించిన యస్త్రవేదమో?
కావఁగ బ్రహ్మకోశమును గాయము దాల్చిన క్షాత్ర ధర్మమో?
ప్రోవో సమస్త శక్తులకు? మొత్తమొ సద్గుణ రత్నపాళికిన్?
శ్రీ విలసిల్ల దృశ్యతఁ జరించు జగత్సుకృతైక రాశియో? ౨

లవు.—అహో! పుణ్య ప్రభావ దర్శనుఁ డైన యీ మహాపురుషుఁడు—

తే. నిర్వృతి స్నేహ భక్తు లన్త్రితయమునకు
వింగడం బైనయట్టిది వేశ్మ మొకటి.
ప్రాగ్రహార మైన యట్టి ధర్మం బొసంగు
సంప్రసాదంబు విగ్రహ సంచరంబు! 3

ఆశ్చర్యము.—

ఉ. వైరము శాంత మయ్యె, శమవర్షక మౌ రస మబ్బెఁ, బ్రబ్బి పొం
గారెడు గర్వ మస్తమిత మయ్యె, వినమ్రత నన్నుఁ గుంచెడిన్,
దారున నీయనం గన నదఃప్రవణుండన యైతి నద్దిరా!
యోరయఁ దీర్ఘము ల్బలె మహార్ఘు విభూతియుతుల్ మహాజనుల్. ౪

రామ.—ఏమి యిది ! ఒక్కొక్కడిచే దుఃఖశాంతి కలిగించుచున్నాఁడు! ఏ నిమిత్తమునకో అంతరాత్మను స్నేహము నొందించుచున్నాఁడు ! కాక; స్నేహమంట నిమిత్త సవ్యాపేక్ష మంట! ఇది పరస్పర పరాహతముగదా? అట్లే.—

ఆ. గూఢహేతు వేదొ కూర్చును వస్తుల,
బహిరుపాధిఁ బ్రీతి బలసికొనదు,
ప్రొద్దు పొడిచినంత పుండరీకము పూచు,
నెలమణియుఁ గరంగు నెలయుఁ దోఁప. ౫౯

లవు.—చంద్రకేతూ, వీ రెవరు?

చంద్ర.—ప్రియవయస్యా, మా నాయనగారు గదా.

లవు.—అటయిన నాకును ధర్మమునుబట్టి అట్లే; ఏలన, ప్రియవయస్యా అంటివి గావున. కాని, నీకు ఈ పేరం బరఁగువారు రామయణకథాపురుషులు పూజ్యులు నల్వురు గదా. అందు విశేషముం జెప్పుము.

చంద్ర.—ఓయి, పెదనాయనగా రని యెఱుంగుము.

లవు.—[ఉల్లాసముతో] ఏమీ! రఘునాథుఁడా? సంతోషము! నేఁడు సుప్రభాతము; ఏల యన, ఈ దేవుని కంటిని. [సవినయ కౌతుకముగా చూచి] నాయనా, ప్రాచేతస శిష్యుఁడు లవుఁడు అభివాదనము చేయుచున్నాఁడు.

రామ.—ఆయుష్మంతుఁడా, రా రమ్ము. [అని సస్నేహముగా కవుంగిలించి] ఓయి బాలకా, వలదు అతివినయము వలదు. పలుమాఱు చిక్కఁగా నన్ను కౌఁగిలింపుము.

తే. విరియు నెత్తమ్మిలోఁ రేకువిభవ మొప్పఁ
బీన మృదు మసృణంబు నీమేని తాఁకు
నాకు మితి మేర లేని యానంద మొసఁగుఁ
జంద్రచందన నిష్యంద జడము వత్స. ౬౦

లవు.—[స్వగతము] నా పై వీరికి ఇట్టి నిష్కారణ స్నేహము. నేనన్నో తెలియక వీరికే ద్రోహ మాచరించితివి, అయిన మెత్తుటపటుకు దురుద్యోగమును వహించితిని. [ప్రకాశము] లవుని బాలిశత్వమును నాయనగారు మన్నింపవలయును.

రామ.—వత్సా, నీవు ఏమి యపరాధము చేసితివి?

చంద్ర.—గుఱ్ఱము వెంట వచ్చినవారు నాయనగారి ప్రతాపమును వెల్లడింపఁగా నీతఁడు వీరము చూపినాఁడు.

రామ.—ఇది క్షత్త్రమునకు అలంకారము గదా.

ఉ. తేజుగలాఁడు పుష్వనొరు తేజము నోర్వఁడు; వాని కద్దియే
భ్రాజిలుఁ దెచ్చికోని నిజభావముగాఁ బ్రకృతి ప్రరూఢతన్;
జేజె యినుం డజస్రము రుచిప్రకరంబులతో జ్వలించుదున్;
దేజముఁ జిత్రభానుశిల ధిక్కృతముంబలెఁ గ్రక్కుఁ జూడవే. ౭

చంద్ర.—ఈ వీరుని యసహానముకూడ శోభించునదే. నాయనగారు చూడవలయును, ప్రియవయస్యుఁడు ప్రయోగించిన జృంభకాస్త్రములచే సైన్యములు అంతటను కదలక ప్రాన్పడి యున్నవి!

రామ.—వత్సా, లవా, అస్త్రము నుపసంహరింపుము. నీవును చంద్రకేతూ, చేతన దక్కి దిగుల్కొనియున్న బలములను ఓదార్పుము.

లవు.—నాయనగారు ఆజ్ఞాపించినట్లు. [అని ధ్యానమును అభినయించును.

చంద్ర.—నాయన యాజ్ఞ. [అని నిష్క్రమించును.

లవు.—శాంతించినది అస్త్రము.

రామ.—వత్సా, సరహస్య ప్రయోగ సంహారము లస్త్రములు సంప్రదాయము కలవి.

ఆ. బ్రహ్మహితముకొఱకు బ్రహ్మాదు లాద్యులు
వేలు వర్షములు తపించి గురులు
ఆత్మ తేజములనె యస్త్రములుగ వీని
ఘనత పోమయములఁ గాంచినారు. ౮

అట్టి యీ మంత్రపారాయణోపనిషత్తును భగవానుఁడు కృశాశ్వుఁడు సహస్రాధిక సంవత్సరముల శిష్యుఁ డయిన కౌశికునికి విశ్వామిత్రునికి ఇచ్చినాఁడు ఆ భగవంతుఁడు నాకు నిచ్చినాఁడు. ఇది వీని క్రమము కుమారునికి మఱి ఏ సంప్రదాయమున వచ్చినదో అడిగెదను.

లవు.—మా యిరువురకు అస్త్రములు స్వతః ప్రకాశములు.

రామ.—[ఆలోచించి] ఏల యట్లు సంభవింపరాదు? ఇది ఏదో దొడ్డ పుణ్యపుం బరిపాకముచేఁ గలిగిన మహిమ గానోపు. ఇరువురకు అంటివే అది యేమి?

లవు.—మేము ఇరువురము కవలవాండ్రము భ్రాతలము.

రామ.—అటుయిన రెండవవాఁ డెవరు?

[నేపథ్యమున]

భాండాయనా, భాండాయనా,

తే. వృషభములతోడ దీర్ఘాయునికి లవునికి
జివ్వ యంటివో? యేమి నని చెప్పెదె సఖి!

జగతి నణఁగుత నధిరాజశబ్ద మిపుడు,
క్షత్త్రశస్త్రాగ్ను లిప్పుడు శమము గనుత. ౯

రాము.—

తే. ఎవఁ డితం డింద్రమణి శితిచ్ఛవి లలితుఁడు?
శబ్ద మాత్రానఁ బులకదంశసుని నన్ను
నభినవశ్యామ జలదగర్జైక నిమిష
బద్ధకలిక కదంబడంబమునిఁ జేసె. ౧౦

లవు.—ఈయన నా యన్నయ్యగారు, కుశుఁ డని పేరు. భరతాశ్రమమునుండి మరలి వచ్చినాఁడు.

రాము.—వత్సా, ఆయుష్మంతు నీతని ఇటకుం బిలువుము.

లవు.—అట్లే. [అని పరిక్రమించును.

[అంతట కుశుఁడు ప్రవేశించును.]

కుశుఁడు.—[అద్భుత ధైర్య హర్షములతో ధనుస్సును ఆస్ఫాలించుచు]

సీ. వైవస్వతుని భగవాను మనువుఁ దొట్టి
యేనృపుల్ త్రైలోక్య హితముపొంలె
సమరేంద్రునికి సతం బభయదక్షిణ లిచ్చి
లీల నెల్లరదిగు ల్దీర్చినారొ,
ఏ రాజవరులు ధర్మేతర చరితుల
దృప్తుల భస్మీకరించు కొఱకుఁ
దమకుం బ్రకృతి సిద్ధధర్మం బయినక్షాత్త్ర
విక్రమంబును జ్వలింపించినారొ,
తే. అట్టి సావిత్ర నృపులతో నాలమేని,
ధన్య మా నిది మద్భుజాదండ సఖము
దీప్ర దివ్యాస్త్ర విస్ఫుర త్తీవ్రకీల
కాండ నీరాజితజ్యంబు కార్ముకంబు. ౧౧

[అని వికటముగా పరిక్రమించును.

రాము.—ఈ క్షత్త్రియ బాలునందు ఏదో అనిర్వచనీయమైన పౌరుషాతిరేకము కలదు.

ఉ. చీరికి దృష్టి కైకొన దశేష జగత్త్రయ సత్త్వసారముం,
ధీరము నుద్ధతంబు గతి దిగ్గఁగఁ జేసెడిఁబోలె ధారుణిం,
గౌరవ మూను వీఁడు గిరికైవడి బాలుఁడ యయ్యు, మాయురే!
వీరమొ దర్పమో యిటులు వీఁ డయి యీ దెస వచ్చుచున్నదో?

లవు.—అన్నకు జయము.

కుశు.—ఓయి అయుష్మంతుఁడా, ఏటి దీమాట యుద్ధ మని?

లవు.—అ దేదో ఏపాటిలే. దృప్తభావము మాని, ఆర్యా, వీరియెడల వినయముతో వర్తింపుము.

కుశు.—అది యేల?

లవు.—మహారాజు రఘుపతి ఈయన మఱి మనయందు నెయ్యమూని యున్నాఁడు. నిన్నుఁ జెంతఁ జూడ మిక్కిలి కోరుచున్నాఁడు.

కుశు.—[సతర్కముగా] అయన రామాయణ కథానాయకుఁడు, బ్రహ్మాండమునకు రక్షకుఁడు.

లవు.—అవును.

కుశు.—ఆ మహాత్ముని పుణ్యదర్శనమును కోరవలసినది గదా. కాని, మనమెట్లు అయనను దఱియవలయునో ఎఱుంగకున్నాఁడ.

లవు.—గురువునుంబోలె ఉపచార పూర్వకముగా దఱియవలయును.

కుశు.—అహో, అది యెట్లు?

లవు.—అత్యుదారుఁడు సుజనుఁడు చంద్రకేతుఁడు ఊర్మిళా పుత్త్రుఁడు నన్ను ప్రియవయస్యుఁడ నని సఖ్యముచేత చేరుచున్నాఁడు. కనుక ఆ సంబంధముచేత ఈ రాజర్షి మనకు ధర్మము ప్రకారము నాయన.

కుశు.—అట్లైన రాజన్యుని యెడలనైనను వినయము నిందనీయము గాదు.

లవు.—అన్నా, ఈ మహాపురుషునిం జూడుము, వీరి ప్రభావగాంభీర్యములు వీరి నిఖిలలోకాతీత సుచరితాతిశయములను సూచించుచున్నవి.

కుశు.—[చూచి]

తే. బాపురే! ప్రసాదాత్మ మీరూప మేమి!
పావన మహారె! యీ యనుభావ మేమి!
మాయురే! పాత్ర మందె రామాయణకవి
భారతీదేవిఁ బ్రకటించె భాసురముగ. ౧3

[సమీపించి] నాయనా, ప్రాచేత సాంతేవాసి కుశుఁడు అభివాదనము సేయం చున్నాఁడు.

రాము.—రా రమ్ము, ఆయుష్మంతుఁడా,

తే. అమృతపూరిత వారివాహంబు కరణి
నిద్ధమును శ్యామలము నగు నీదు మేనిఁ
గౌఁగిటం బొదువంగ నుత్కంఠ గొంటి
వత్సలత్వంబుచేఁ బరవత్త్వ మొంది. ౧౪

[కౌఁగిలించి స్వగతము] ఈ బాలుఁడు ఎవరిపట్టి?

శా. సర్వాంగ స్రుతనైజ దేహజ గరిష్ఠస్నేహ సారంబొ? దృ
క్పర్వాకారముఁ దాల్చి వేర్పడిన వల్లచ్చేతనా ధాతువో?
నిర్వృత్తుండొ ప్రహర్ష సంక్షుభిత హృత్సిద్ధ స్న వౌఘంబుచేఁ?
బర్వించెఁ బలె వీఁడు కౌఁగిట సుధాప్రావృట్ప్రవంతీ మెయిన్. ౧౫

లవు.—నాయనా, చండాంశుఁడు నడిమింటికి వచ్చి ఫాలదేశముం గాల్చుచున్నాఁడు. కావున ఇట ఈ వద్దిక్రింద నాయన ఇంచుక సేపు కూర్చుండుఁగాక.

రాము.—వత్సా, నీకిష్టమైనట్లు. [అందఱును పరిక్రమించి కూర్చుందురు.

రాము.—[స్వగతము]

ఆ. బళిర! ప్రశ్రయంబుఁ బాటించు నహిలోనె
నడక, నిలక, యాసనంబు మొదలు
భావములు వచించుఁ బరమ సామ్రాజ్యంబుఁ
గుశునికి లవునికి నకుంఠితముగ. ౧౬

తే. సహజలక్ష్మీ విలాసముల్ చదురు గొల్పుఁ
బ్రతికల మనోరమం బగు వక్షకమును,
అమలినం బగుమణిని దదంశులవలె,
విరియు నెత్తామరను దేనెబిందులవలె. ౧౭

ఈ బాలురయందు మెండుగా రఘుకుల కుమారుల ఛాయను గాంచుచున్నాను.

తే. యువకపోతంపు మెడఁబోలె నొడలు కప్పు,
మూఁపు లెనసెడి నాఁబోతు మూఁపురమును,
సప్రసాద మృగేంద్ర నిశ్చలము దృష్టి,
స్వరము మంగళ మురజమాంసల కలంబు. ౧౮

[నిపుణముగా పరికించి] అహో ఈ యాకారము నన్నుఁబోలుట మాత్రమేగాక,

చ. కనఁబడుచున్న వీశిశుయుగంబున నైపుణిమీఱఁ జూచినన్
జనకజఁబోలు చందములు సైతము జానుగ నద్దియద్దియున్;
కనులకు వెండి కానఁబడు కైవడి సున్నది వీరిమోములన్
ఘనశతపత్త్రలక్ష్మికి నికాయ్యము ప్రేయసియాస్య మద్దిరా! ౧౯

ఆ. శుక్తిజాచ్ఛదంత శోచిస్మ నోజ్ఞమీ
పెదవి ముద్ర యదియె, వీను లవియె;
నేత్రయుగళి రక్తనీలంబ దైనను,
సుభగతాగుణంపు జోక యదియె. ౨౦

ఇదే వాల్మీకి నివసించు పావనము. ఇటనేగదా దేవి విసువఁబడినది. శిశువుల యాకృతియుం నిది. మఱి అస్త్రములు స్వతః ప్రకాశములు అనునది యేది కలదో, దానిని విమర్శించెదను. అప్పుడు చిత్రదర్శనమున నా చేసిన యస్త్రాభ్యనుజ్ఞానము నెఱవేఱినదా? సంప్రదాయము లేక అస్త్రములు కలుగు నని వినమైతిమి. ఈసుఖాతిశయమో సందేహములో తేలిపోవుచున్న నా యాత్మను నమ్మించుచున్నది. దేవేరి గర్భ భారము రెండుగా నెలకొని యుండుటను నేను పలుమాఱు కనియుంటిని [సబాష్పము]

చ. పరిచితి యాకొలంది నెఱఁ బండిన ప్రేముడి నేకతంబునన్
సరళత విశ్వసించియును సాజపునాన జడేక్షలం గనన్,
గరమున గర్భముం దడవి కంటిఁ గళల్ గవ లంచు నేన మున్,
సరవిని వెన్క నెన్ని దివసంబులకో ప్రియ తాను గన్గొనెన్. ౨౧

[ఏడ్చి] మఱి, వీరి నడుగుదునా ఏదేని యుపాయము చేత?

లవు.—నాయనా! ఇదేమి!

తే. భువనమంగళ మైనమీమోము దేమి
బాష్పవర్షంబుచేతను బాత్ర మయ్యె
తుహిన జాలంబుచేతను దోఁగినట్టి
పుండరీకంబునం గ్రాలు నిండుసిరికి. ౨౨

కుశు.—ఓయి వత్సా,

ఉ. ఏయది గాదు దుఃఖము మహీసుత లేమిని రామమూర్తికిన్?
ప్రేయసి నష్ట మైన నటవీమయ మే గద సర్వలోకమున్.
నేయము నట్టి దీవిరహ మీరధికిన్ దరి గానరాదు, రా
మాయణకావ్యపుం బఠితి నయ్యమ నీ విటు ప్రశ్న చేసెదే! ౨౩

రాము.—[స్వగతము] అహో, అలాపము తటస్థముగా నున్నది. ఇఁక ప్రశ్న వలదు. పాడు డెందమా! ఏల యిట్లు ఆకస్మికముగా చాపలమెత్తి పరుగులు వాఱితివి! లోని దుఃఖమును బయటికి ప్రిదుల్చుకొన్నవాఁడనై శిశుజనము సైతము కనికరించున ట్లయితిని. కానీ యీ భావమును డాఁగురించెదను. [ప్రకాశము] బాలురారా, రామాయణ మని విందుము, ప్రాచేతస భగవంతుని సరస్వతీనిష్యంద మఁట, సూర్యవంశ ప్రశస్తి యఁట; అందు ఏమేని యించుక వినం గుతూహలపడుచున్నాను.

కుశు.—ఆ గ్రంథము నంతయుం మేము వల్లించితిమి. ఇప్పుడు తటాలున జ్ఞప్తికి వచ్చినవి యీ రెండు పద్యములు బాలచరితంపుఁ గడపటి యధ్యాయములోనివి.

రాము.—వత్సా, పఠింపుము.

కుశు.—

తే. మొదలనే ప్రియ యయ్యె రామునకు సీత
తండ్రి యంగీకరించిన దార యగుట;
అట్టి యాప్రేమ వర్ధిల్ల నామె చేసె
గుణగణము చేత మఱి రూపగుణము చేత. ౨౪

తే. రాముఁడును సీత కాప్రకారంబుగానె
ప్రాణములకన్నఁ బ్రియుఁడుగాఁ బరిఢవిల్లె;
మానసము మాత్రమే యెందుఁ దా నెఱుంగు
నొండొరుల మీఁదఁ గల ప్రీతి యోజనంబు. ౨౫

రాము.—[స్వగతము] ఇది అతి దారుణముగా హృదయ మర్మమును ఉద్ఘాతము చేయుచున్నది! హా దేవీ! ఇట్లే గదా అప్పుడు జరిగినది. అహో తుదిలేని విపర్యాస పరంపరచే విప్రలంభాంతములుగా నున్నవి యీ సంసార వృత్తాంతములు!

చ. నిరతిశయంపు నమ్మకపు నిర్భరహార్ద మదేడ? నా పర
స్పరయతనంబు లేడ? రససంభృత కౌతుకకృత్య లేడనో?
హారుసమునందుఁ గుందున హృద్దైకత్య మదేడ? నకైనమున్ బరి
స్ఫురణమ నేయుఁ గాని, యుడివో దిది పాపపుఁబ్రాణ మక్కటా! ౨౬

అయ్యో! కష్టముగా నున్నదే!

క. నాకుఁ బ్రియాగుణ సాహ
స్రైకోన్మీలనముచేత నతిపేశలమై
యేకాలము దుస్స్మరమో
యాకాలమె సంస్మరింప నైతిని హా! హా! ౨౭

ఉ. అత్తఱి నించుకించుక మృగాక్షి చనుంగవ యంకురించి యు
ద్వృత్తత కంగవించు చభివిస్తృతి యించుకఁ జెంది కైపెడె౯;
చిత్తభవుండు ప్రాయమును స్నేహము భావము నండ గాంచి వే
ఱ్ఱెత్తులు డెంపమందుచు మెయి౯ మఱి గోలతనంబు మేకొనె౯ ౨౮

కుశు.—ఇది యొకటి మందాకినీ చిత్రకూట వనవిహారమందు సీతాదేవింగూర్చి రఘునాథుని పద్యము:—

క. నీకై విన్యస్తముబలె
నీకొఱలెడి ఱాతిపట్ట మెదురం గనుమా;
యీ కేసర మందుపయి౯
వీకునఁ బూబిందుచేఁ బ్రవృష్టంబుబలె౯. ౨౯

రామ.—[సలజ్జాస్మిత స్నేహకరుణముగా] శిశుజనులు మిక్కిలి జేలలు, అందు లోను అరణ్యచరులు మఱియుఁ; హా దేవి! ఆ తావును, ఆ సమయంపు స్వైరవిహారాతి ప్రసంగ సాక్షులను స్మరింతువా? కట్టాకట్టా!

మ. మనమం దెంతు శ్రమాంబు సీకలితము౯ మందాకినీ మంద పా
వనహేలాలు లీలాలకాకులిత భాస్వత్ఫాల చంద్రద్యుతి౯
వినివృత్తాగ్ని శిఖాంక నైజసుషమా విద్యోతి గండంబు నే
న నలంకార మనోరమ శ్రుతివిభా ప్రాజ్యంబు నీవక్త్రము౯. 30

[స్తంభితునివలె నుండి సకరుణము] అహో ఏమి యిది!

ఉ. ఆకృతి భావనావళి మహార్ద్ధి౯ సృజించి ఘటించె మోహ్రిల నాఁ
బైకొని యూఱడించుఁ బెడఁబాసియు నాత్తజనం బవారణ౯;
లోకము వెళ్శ్వశాన మగు లోనివికల్పము శాంతిఁ బొందిన౯,
శోకము నొందుచుండుబలె స్వాంతము వెన్కఁదుహాగ్ని రాశిలో౯.

[నేపథ్యమున]

చ. బుధులకు కయ్య్య నంచు వెలిః బోక్కి వసిష్ఠుఁడుఁ బుట్టఁబుట్టువుల్
బడి జనకుండుఁ బం క్తిరథుకష్టపుదేవు లరుంధతీయుతల్
తడవు గమించి యాశ్రమము సవ్వగుటల్ జన మేనిఁ గ్రుంచుటల్
వడి గొనుచుల్ శ్రమార్తులయి వ్రాలుచు వచ్చుచు నున్న వారదే.

రాము.—ఏమీ! భగవంతులు అరుంధతీ వసిష్ఠులును అమ్మయు జనకుఁడును ఇటనే యున్నారా! కట్టా! ఎట్లు వీరిని చూతును! [సకరుణముగా చూచి] అహహా! నాయన జనకుఁడు కూడ ఇటకే వచ్చినాఁ డని పిడుగుదెబ్బ తింటిని మందభాగ్యుఁడను.

ఉ. వియ్యము దొడ్డ దంచుఁ గను వెట్ట వసిష్ఠముఖుల్ ప్రహృష్టులై
యయ్య లపత్య యాతక మహాంబునఁ గూడినరీతిఁ గాంచియుల్
ఇ య్యతిఘోరదుఃఖమున నీదృశుఁ గాంచుచుఁ దాతమిత్త్రునిల్
వ్రయ్యన వేయిగా! నరియె! రాముని కెయ్యది దుష్కరం బగుల్.

[నేపథ్యమున]

కటకటా!

క. అనుభావ మాత్రముగ సిరి
యునికి గొనిన రాముఁ దల్లు లుద్ధవిడిఁ గనుం
గొని మును కని యెఱిఁగినజన
కునిబోధన నెఱిఁగి మూర్ఛఁ గూలిరి వెలుచల్. 38

రాము.—హా! నాయనా జనకుఁడా! హా తల్లులారా!

క. జనకులకు రఘువులకునుం
బనితం బెది కృత్స్న గోత్రమంగళముగ నం
దును సైత మకరుణుఁడఁ బా
పిని నగు నామీఁదఁ గరుణ వృథ సుఁడి మీకుల్. 39

ఇదె పోయి సంభావించెదను. [అని లేచును.

కుశలవులు.—నాయన ఇటు ఇటు.

[సకరుణముగా పరిక్రమించి అందఱు నిష్క్రమింతురు.

కుమారప్రత్యభిజ్ఞాన మను

షష్ఠాంకము సమాప్తము.

సప్తమాంకము.

[అంతట లక్ష్మణుఁడు ప్రవేశించును]

లక్ష్మణుఁడు.—ఓహో యి! నేఁడు భగవంతుఁడు వాల్మీకి బ్రహ్మ క్షత్త్ర పౌర జానపద సమేత మయిన ప్రజలను మమ్ముం గూడఁ బిలిచి సకల మైన దేవాసుర తిర్య గురగనాయక సంయుక్తముగా జంగమమును స్థావరమునునగు భూతగ్రామమును తన ప్రభావముచేత ఒక్కెడ సమకూర్చినాఁడు. నన్నును అన్నగారు ఆజ్ఞాపించినారు: "వత్సా, లక్ష్మణా, భగవంతుఁడు వాల్మీకి తనకృతిని అచ్చరలు ఆడఁగాఁ జూచుటకు మనలను ఆహ్వానము చేసినాఁడు. కావున భాగీరథీ తీరమున నొక మనోజ్ఞ స్థానమున నీవు సమాజ సన్నివేశము కావింపవలసినది." అని. నేనును మర్త్యామర్త్య రూప మయిన భూత గ్రామమును తగిన తావులం గూర్చుండఁబెట్టితిని. మఱి యీఁడుగో:—

తే. అధివసించియుఁ బ్రాజ్యరాజ్యాశ్రమమును
దాపసేంద్రుల కష్టవ్రతమును బూని
వాములూరుజ మౌనిపై భక్తిచేత
నన్న యిచటికె యరుదెంచుచున్నవాఁడు. ౧

[అంతట రాముఁడు ప్రవేశించును]

రాముఁడు.—వత్సా, లక్ష్మణా, రంగప్రాశ్నికులు వచ్చియున్నారా?

లక్ష్మ.—వచ్చియున్నారు.

రాము.—ఈ బాలుర నిరువురను చంద్రకేతువుతో సమానమయిన స్థాన మర్యాదను పొందింపవలసినది.

లక్ష్మ.—ప్రభు స్నేహంపుఁ దాక్షిణ్యముచేత అట్లే కావించితిని. ఇదిగో మఱి రాజాసనము పఱుపఁబడి యున్నది. ఆర్యుఁడు కూర్చుండుఁగాక.

[రాముఁడు కూర్చుండును.

లక్ష్మ.—ఓహో యి, ఆరంభింపుఁడు.

సూత్రధారుఁడు—[ప్రవేశించి] భగవంతుఁడు భూతార్థము చెప్పువాఁడు ప్రాచేతసుఁడు సజంగమస్థావరమును జగత్తును ఆజ్ఞాపించుచున్నాఁడు:—"మేము అర్షంబగు నేత్రముతోఁ జూచి పావనంబును కరుణాద్భుత రసంబునుగా నే ప్రబంధమును నిబంధించితిమో, దానిని కార్య గౌరవముచేత హెచ్చరికతో పరికింపుఁడు." అని.

రాము.—ఇట్లు చెప్పుట యైనది; ఏమన,—"మహర్షులు ధర్మములను సాక్షాత్కరించినవారు. అమృతసారములును పరోక్షజ్ఞానములును అయిన తత్ప్రజ్ఞానములు ఎటను శంకనొందవు. కావున వానియందు శంక వహింపఁగూడదు." అని.

[నేపథ్యమున]

హా ఆర్యపుత్త్రుఁడా! హా కుమార లక్ష్మణుఁడా! ఏకాకినిని మందభాగ్యను, దిక్కు లేనిదానిని, అడవిలో నొప్పులఁబడుచున్న నన్ను ఈ కూళలు ఘాతుక జంతువులు మెసవం జూచుచున్నవి. ఇదె నేను ఓపలేక భాగీరథిలో నన్ను ద్రైచికొనుచున్నాను.

లక్ష్మ.—[ఆత్మగతము] కట్టా! ఇదేదో మఱియొకటి యైనది!

సూత్ర.—

తే. దేవి స్థైర్యంభరేయి సాధ్వీమతల్లి
రాజు విడిపింపఁగా మహారణ్యమందుఁ,
బ్రసవవేదన పెల్లు సంప్రాప్త మగుడు,
వైచికొనెఁ దన్ను గంగాభవానియందు. 2

[అని నిష్క్రమించును.

రామ.—[సావేగము] హా దేవి! హా దేవి! క్షణము వేపుము.

లక్ష్మ.—ఆర్య, నాటక మిది.

రామ.—హా దేవి! దండకారణ్యవాస ప్రియ సఖి! రామునివలన నీకు ఈ దైవ దుర్విపాకము!

లక్ష్మ.—ఆర్యా, సమాశ్వసిల్లుము, ప్రబంధార్థమును అవధరింపుము.

రామ.—ఇదె సన్నద్ధుఁడను, వజ్రమయుండను.

[అంతట ఒడిలో ఒక్కొక్క-దారకు నుంచుకొన్నవారై పృథ్వీభాగీరథులు పట్టుకొనఁగా సీత ప్రవేశించును.]

రామ.— వత్సా, లక్ష్మణుఁడా! అడు గిడ దొరకవి చిమ్మ చీకటిలో పడిపోవు చున్నాను. నన్ను పట్టుకొమ్ము.

పృథ్వీ భాగీరథులు.—

తే. ఊఱడిల్లుము కల్యాణి యూఱడిల్లు,
నీదె పున్నెంబు; వైదేహి నీదె శివము;
నీరిలోపలఁ గంటి వో నీరజాక్షి,
క్రమ్రతేజాల రఘువంశకరులఁ గవల 3

సీత.—[సమాశ్వసించి] అహా! ఇరువుర దారకులను కంటిని! హా! ఆర్య పుత్త్రుఁడా! [అని మూర్ఛిల్లును.

లక్ష్మ.—[పాదములలోఁ బడి] ఆర్యా, సంతోషము, వర్ధిల్లుచున్నాము. రఘువంశమునకు శుభ సంతానము మొలచినది. [చూచి] హా! హా! ఏమి! బాష్పము వెల్లిగొని ఆర్యుఁడు ఓపలేక మూర్ఛిల్లినాఁడు.

దేవత లిరువురు.—పట్టీ, ఊఁఅడిల్లు మూఁఅడిల్లుము.

సీత.—[ఊఁఅడిల్లి] భగవతులారా, మీ రెవరు?

పృథ్వి.—ఈమె నీ శ్వశురకులదేవత భాగీరథి.

సీత.—భగవతి, నీకు మ్రొక్కెదను.

భాగీ.—చారిత్రమునకు తగిన కల్యాణ సంపదను బొందుము.

లక్ష్మ.—అనుగ్రహింపఁబడితిమి.

భాగీ.—ఈమె నీతల్లి విశ్వంభర.

సీత.—హా అమ్మా, ఇట్టిదానినిగా ననుఁ నీవు చూచితివి!

పృథ్వి.—రావే పుత్త్రీ.

[అని ఒండొరుం గౌఁగిలించుకొని మూర్ఛిల్లుదురు.

లక్ష్మ.—అహా! ఆర్యను గంగాపృథ్వులు అనుగ్రహించినారు.

రాము.—[చూచి] ఇది కరుణతరముగాఁ గదా ఉన్నది.

భాగీ.—విశ్వంభరకూడవ్యథ నొందుచున్నదఁట; జయించినది యపత్యవాత్సల్యము. అట్లు గాదు; చేతనగలవారి కెల్ల నిది యొక సంసార తంతువు, మోహంపు ముడితోడిది; ఎప్పటికిని త్రెవ్వక హృదయమున నుండునట్టిది. పట్టీ వైదేహీ, భూతధాత్రి, ఊఁఅడిల్లుఁడు, ఊఁఅడిల్లుఁడు.

పృథ్వి.—[ఆశ్వసిల్లి] సీతను గని యూఁఅడిల్లుట యెట్లు?

తే. రక్కసులయిక్కఁ జిర మున్కి యొక్కటియును,
దుర్భాగము సుదుస్సహంబు రెండవది యిదియు—

భాగీ.—

దైవము పచేళిమం బయి దఱియ దాని
ద్వారములు మూయఁ దరమె యేప్రాణి కైన? ४

పృథ్వి.—భాగీరథి, సరిగా చెప్పితివి, కాని ఇది రామభద్రునికి యుక్తమా?

తే. బాల్యమునఁ దాను బాలుండు పట్టినట్టి
పాణి నాతండు గొనఁడు ప్రమాణముగను,
నన్నుఁ గొనఁడు జనకునిఁ గొనండు వహ్నిఁ
గొనఁ, డనుసృతిఁ గొనఁడు, సంతతిని గొనండు. ౫

సీత.—హా! ఆర్యపుత్త్రుని స్మరింపఁజేసితివి.

పృథ్వీ.—సీ! నీ కార్య పుత్త్రుఁ డెవఁడు!

సీత.—[సలజ్జాస్రము] పోనీ, అమ్మ చెప్పినట్లే.

రాము.—అమ్మా! పృథ్వీ, ఇట్టివాఁడ నైతిని.

భాగీ.—భగవతీ, వసుంధరా, క్షమింపుము. సంసారమునకు దేహమవుగదా. మఱి, యెఱుఁగనివానివలె అల్లునిపై కోపించెద వేమి?

శా. త్యాయం బల్లెను ఘోరదుర్యశము; లంకాద్వీపమం దగ్ని చే
భూయిష్ఠస్తుత మైనవిశుద్ధి నెటు నమ్మున్ మానుషుం డిందులన్?
ఈ యుర్విప్రజఁ గొల్చుటే కులధనం బిక్ష్వాకువంశ్యాళి కౌ,
నీయిక్కట్టునఁ జిక్కి పుత్త్రకుఁడు తా నిం కేమి సేయుం గటా. ౬

లక్ష్మ.—దేవతలు అవ్యాహతమయిన సర్వభూతహృదయజ్ఞానము కలవారు గదా. అందులోను భాగీరథిమాట చెప్పవలయునా? కావున అమ్మా నీ కిదె నానమస్కారము.

రాము.—అమ్మా, నీవు భగీరథ కుటుంబమందలి నీప్రసాదమును నెఱవేర్చితివి.

పృథ్వీ.—నిత్యము మీకు ప్రసన్నురాలను. అయినను నా పట్టికిఁ గలిగిన శోకావేగము వచ్చిన రాకలోనే నాకు దుస్సహ మైనది. ఎఱుఁగనిదానను గాను రామభద్రునికి సీతయందుఁ గల స్నేహమును.

ఆ. దైవవశత నతఁడు దయితను విడనాడి
యెరియు చున్నయట్టి యెడఁదతోడ
బ్రదికి యున్నవాఁడు ప్రజల పుణ్యమునను
సకల జగ దతీత సత్త్వమునను. ౭

రాము.—గురువులు గర్భరూపులయందు కరుణావంతులు సుమా.

సీత.—[ఏడ్చుచు, కృతాంజలియై] అమ్మా నన్ను నీ యంగములందు విలయ మొందింపుము.

రాము.—మఱి యేమి చెప్ప నున్నది!

భాగీ.—శాంతము, విలయ మొందక వేయియేండ్లు ఉండుము.

పృథ్వీ.—నీ పుత్త్రులను నీవు చూచుకోనవలయును.

సీత.—అనాథ నైతిని, ఇఁక వీ రేల!

రాము.—హృదయమా, వజ్రమవు సుమా.

భాగీ.—ఏమి! సనాథవే నీవు, అనాథ వెట్లు!

సీత.—మందభాగినికి నాకు సనాథత్వ మెక్కడిది!

భాగీ.—

క. లోకైక మంగళంబును
నీకరణిని నిన్ను నీవ యొగ్గం తేలా;
మాకు సయితము పవిత్రత
నీకూటమిచేత హెచ్చె నిరుపమ సాధ్వీ. ౮

లక్ష్మ.—ఆర్యా, వినుము.

రాము.—శ్లోకము విననుగాక.

[నేపథ్యమున కోలాహలము.]

రాము.—ఇది ఏదో అద్భుతతరము.

సీత.—ఏమి యిది! గొల్లిడుచు అంతరిక్షమెల్ల ప్రజ్వలించుచున్నది!

పృ. భా.—ఆహా తెలిసినది.

తే. క్రమముగఁ గృశాశ్వకౌశిక రాము లనుచు
గురుపరంపర వేనికిఁ గుదురుకొనియె,
నవియె యావిర్భవించుచున్నవి ముదమునఁ
గైదువులు మొత్తముగ జృంభకములతోడ ౯

[నేపథ్యమున]

తే. వందనము నీకు నోదేవి, వసుధపుత్త్రి,
గతిసుమీ మాకు నీ పుత్త్రకద్వయంబు;
అట్లు గాదె రఘూద్వహుం డానతిచ్చెఁ
జిత్రదర్శనవేళ నీచిత్త మలర? ౧౦

సీత.—సంతోషము, అస్త్రదేవతలు స్ఫురించుచున్నారు.

లక్ష్మ.—ఆర్యా, నీవు చెప్పి యుంటివి "తప్పక నీప్రసూతిని ఇవి భజించును" అని.

పృ. భా.—

క. పరమాస్త్రములారా! జో
హారు! మీచేపట్టుచేఁ గృతార్థులము కదుఱ్;
ఇరువుర నిసుఁగులఁ గూడుఁడు
పరిభావన సేసినంత; భద్రము మీకుఱ్. ౧౧

రాము.—

తే. కుందుఁ దరఁగలు విస్మయానందభువుల
కూడలిం బడి పడలి యాకులత నెనసి,
అట్టి దిట్టిది యని పల్క నలవి గాని
యొక దశావిశేషమును నా కొసఁగె నిపుడు. ౧౨

వృ. భా.—పట్టీ సంతోషింపుము. నీపుత్త్రకు లిప్పుడు రామభద్రతుల్యులై నారు.

సీత.—భగవతులారా, వీరి కిపుడు క్షత్త్రియోచితకర్మ మెవరు చేయుందురు?

రాము.—

తే. అల వసిష్ఠర్షి పాలింప నలరునట్టి
రఘువులకుఁ దానె వంశవర్ధన ధురీణ
సీతయును నక్కటక్కటా శిశులకొఱకు
గానకున్నది సంస్కర్తఁ గనుదు నెట్లు! ౧౩

భాగీ.—పుత్త్రి, ఆ చింత నీకేల? ఈ నిసుఁగులను పాలు విడిచిన తర్వాత వాల్మీకి భగవంతునికి అప్పగించెదము. అయన వీరికి క్షత్త్రకృత్యముం గావించును.

తే. అమ్మ సీత, వసిష్ఠుండు నాంగిరసుఁడు
నెట్లొ, ప్రాచేతసుండును నట్లె చూవె,
జనకులకును రఘువులకును సంతతులకుఁ
దాన రెండిటికిని గురూత్తముఁ డగును. ౧౪

రాము.—భగవతి చక్కఁగా ఆలోచించినది.

లక్ష్మ.—ఆర్యా, నిజముఁగా విన్నవించెద, ఆయాయుపాయముల చేత ఈ శిశువులు కుశలవు లని యూహించెదను.—ఎట్లన—

క. వీరును జనిసిద్ధాస్త్రులు, చేరినవా రిరువురును ప్రచేతసుపుత్త్రున్;
వీరూపమె గలవీరులు, బారావర్షముల వయసు పరఁగెడువారల్. ౧౫

రాము.—ఈ బాలుర వారని నేను తెలివోవుచున్న హృదయముతో మోహ మొందుచున్నాను.

పృథ్వి.—రావే పట్టీ, పాతాళమును పవిత్రము గావింపుము.

రాము.—హా ప్రియా, లోకాంతరమున కేఁగితివే!

సీత.—అమ్మా, నన్ను నీయవయవములయందు విలయమొందింపుము. ఇట్టి యీ జీవలోక దుర్వృత్తము అనుభవింప సమర్థను గాను.

రాము.—ఏమి యుత్తరము చెప్పెనో!

పృథ్వి.—స్తన్యమును వీడువఱకు నానియోగంబున పుత్త్రకులను కాచుకొనుము. ఆవల నీయిచ్చవచ్చినం గావింపుము.

భాగీ.—అది సరి! [గంగా పృథ్వీ సీతలు నిష్క్రమింతురు.

రాము.—ఏమి వైదేహికి విలయమే సమకూడినది! హా దేవి! దండకారణ్యావాస ప్రియ సఖి! హా చారిత్ర దేవతా! లోకాంతరమునకు తరలితివి! [మూర్ఛిల్లును.

లక్ష్మ.—భగవంతుఁడా, వాల్మీకీ, కావుకావుము. ఇదియా నీ కావ్యార్థము!

[నేపథ్యమున]

వాదిత్రమును తొలఁగింపుఁడు. ఓహోయి జంగమస్థావర సమేతులు ప్రాణధారులు మర్త్యామర్త్యులు, చూడుఁడు వాల్మీకి భగవంతునిచేత అనుజ్ఞాతమయిన పవిత్రాద్భుతమును!

లక్ష్మ.—[చూచి]

తే. మథనమునఁబోలె గాంగ మంభంబు కలఁగెఁ,
బ్రాప్త దేవర్షికం బయ్యె నాకసంబు;
అచ్చెరువు! లేచె నార్య తోయంబునుండి
ద్యోనదీదేవి భూదేవి తోడుగాఁగ. ౧౬

[మరల నేపథ్యమున]

క. లోకార్చ్యయ, యోయరుంధతి, నూకుంగూర్చుముపృథివిక మందాకినికిఁ;
నీకరమున నిడితి మిదే, నీకోడలి సీతఁ బుణ్యనిరతక సాధ్విక. ౧౭

లక్ష్మ.—ఆశ్చర్య మాశ్చర్యము! ఆర్యా చూడుచూడు. [చూచి] కట్టా, ఇంకను ఆర్యుఁడు మూర్ఛఁదేరలేదు. [అంతట అరుంధతియు సీతయుఁ బ్రవేశింతురు.

అరుంధతి.—

తే. త్వర వహింపుము! నాపట్టి త్వర వహింపు!
విడుము శాలీనతను సీత, వేగ లెమ్ము.
రమ్ము బ్రతికింపు నాపట్టి రామభద్రుఁ,
బ్రియతమస్పర్శమైన నీహస్తముచేత. ౧౮

సీత.—[సంభ్రమంబునఁ దటాలున రాముని దాఁకుచు] ఆర్యపుత్త్రుఁడు సమాశ్వసిల్లును గాక.

రాము.—[సమాశ్వసిల్లి, సానందము] ఓహో! ఏమి యిది! [చూచి హర్షాద్భుతములతో] అహో సలజ్జ దేవి! అమ్మ అరుంధతి, ఋశ్యశృంగ శాంతా సమేతులు గురువు లందఱును!

అరుం.—బాలకా, ఈమె భగీరథ గృహదేవత ప్రసన్నురాలు గంగా భగవతి.

[నేపథ్యమున]

జగత్పతీ రామభద్రుఁడా, చిత్ర దర్శనమందు నన్నుఁగూర్చి నీ పలికిన యా పలుకును స్మరింపుము—ఏమనఁగా "అట్టి నీవు అమ్మా కోడలియందు అరుంధతియం బోలె మేలు దలంచుదానవు కమ్మ" అని. అందులకు నేను ఋణము తీర్చుకొంటిని.

అరుం.—ఈమె నియత్తగారు భగవతి వసుంధర.

[నేపథ్యమున]

మున్ను వత్సను పరిత్యజించునప్పుడు ఆయుష్మంతుఁడు చెప్పియుండెను—ఏమన "భగవతి వసుంధరా, శ్లాఘ్యను నీ కూఁతును కాపాడుము జానకిని" అని ప్రభు వయిన బాలుని యా మాటను జరిపితిని.

రామ.—ఎట్టిది! మహాపరాధము కావించిన వానిని నన్ను భగవతు లిరువురును కనికరించినారు! [ప్రణమిల్లును.

అరుం.—ఓహో యి పౌరజానపదులారా, ఈమె యిట్లు జాహ్నవీ వసుంధరా భగవతులచేత స్తుతయై నా చేతియందు అనఁగా అరుంధతిచేతియందు సమర్పిత యైనది. పూర్వమే అగ్ని దేవుఁడు పుణ్య చారిత్రమును నిర్ణయించిన యీమెను బ్రహ్మాది దేవతలు స్తుతించిరి. అట్టి యీమెను సూర్యవంశపుం గోడలిని దేవయజనసంభవను సీతను రాముఁడు వెండియుం గ్రహించుటకు మీర లే మనియెదరు?

లక్ష్మ.—ఇట్లు ఆర్య అరుంధతి తెలిసి చెప్పఁగానే ప్రజలును సకలమయిన భూతగ్రామంబును ఆర్యను సీతను నమస్కరించుచున్నారు; లోకపాలురును సప్తర్షులును విరుల వానలతో పూజించుచున్నారు.

అరుం.—జగత్పతీ రామభద్రుఁడా!

క. ప్రియను సహధర్మచారిణి, నియోజితను జేయవయ్య నియమంబు బడిఁ
బయిఁడి ప్రతికృతికిఁబునా, శ్రియముం బ్రకృతిని మురంగ సవనమునందుఁ.

సీత.—[స్వగతము] ఎఱుంగు నార్యపుత్త్రుఁడు సీతాదుఃఖమును కడిగివై చుటకు.

రామ.—భగవతి యాదేశించినట్లు.

లక్ష్మ.—కృతార్థుఁడ నైతిని.

సీత.—బ్రతికితిని.

లక్ష్మ.—ఆర్యా, విర్లజ్జుఁడను లక్ష్మణుఁడను ప్రణమిల్లుచున్నాను.

సీత.—బాలుఁడా, ఇట్టివాఁడవుగా చిరకాలము జీవింపుము.

అరుం.—భగవంతుఁడా, వాల్మీకి, వీరిని కుశలవులను సీతాగర్భసంభవులను రామభద్ర పుత్త్రులను తల్లిదండ్రులతోఁ గూర్పుము. [నిష్క్రమించును.

రామ లక్ష్మణులు.—సంతోషము, అట్లే ఇది.

సీత.—[సబాష్పకౌతుకము] ఏరీ నా పుత్త్రకులు?

[అంతట వాల్మీకియుం కుశలవులును ప్రవేశింతురు.]

వాల్మీకి.—శిశువులారా, కుశలవులారా, ఈయన రఘుపతి, మీ నాయన; ఈయన లక్ష్మణుండు మీ చిన్ననాయన; ఈమె సీతాదేవి మీయమ్మ. ఈయన రాజర్షి జనకుఁడు మీ మాతామహుఁడు.

సీత.—[సహర్ష కరుణాద్భుతముగా చూచి] ఏమి నాయనయా!

కుశలవులు.—హా! నాయనా! హా! అమ్మా! హా! మాతామహా!

రామ.—[సహర్షము ఆలింగించి] ఓయి నిసుఁగులారా, పుణ్యాన దొరకితిరి.

సీత.—రా పట్టీ కుశా, రా పట్టీ లవా; ఇరువురు నొక్కుమ్మడి నన్ను జన్మాంతరగతను చిరము కౌఁగిలింపుఁడు.

కుశలవులు.—[అట్లు చేసి] ధన్యులమైతిమి.

సీత.—భగవానుఁడా, ప్రణమిల్లుచున్నాను.

వాల్మీ.—పట్టీ, ఇట్టి దానవే చిర ముండుము.

సీత.—అహో! నాయన, కులగురువు ఆర్యాజనము సభర్తృక శాంతాదేవి లక్ష్మణునితోడ సుప్రసన్నులు ఆర్యపుత్త్రులవారు, కుశ లవులను గూడ కనఁబడుచున్నారు. ఈ యానందముచేత పరవశ నగుచున్నాను.

[నేపథ్యమున కలకలము.]

వాల్మీ.—[లేచి చూచి] లవణుని ఉన్మూలించి మథురానాథుఁడు వచ్చినాఁడు.

లక్ష్మ.—కల్యాణములు సానుబంధములు.

రామ.—ఇదంతయు అనుభవించుచునే నమ్మకున్నాను. అటు గాదు, ఇదే అభ్యుదయముల స్వభావము.

వాల్మీ.—రామభద్రుఁడా, నీ కింకను ఏమి ప్రియమును గావింతును?

రామ.—ఇంతకన్నను బ్రియ మొకటి యుండునా? అయిన నిది యగు[నేని]

శా. గంగాలక్ష్ములు వోలె నీకథ జగత్కల్యాణ మై కాంత మై,
త్రుంగం జేసి యఘంబు శ్రేయములసందోహంబుఁ బొందించుత[న్];
రంగత్ప్రాజ్ఞక వాక్చతుర్ముఖ కవిప్రష్ఠోక్తి నీసత్కృతిన్
రంగంబందు బుధవ్రజం బభినయారాద్ధన్ విభావించుతన్.

[అందఱు నిష్క్రమింతురు]

సమ్మేళనమను సప్తమాంకము సమాప్తము.

ఉత్తరరామచరిత నాటకము సమాప్తము.

# పద్యసూచిక.

—————

చంద్రికాప్రెస్, మద్రాసు—1942.